శ్రీః

# బ్రహ్మసూత్రశాఙ్కరభాష్యమ్

బాలానన్దిన్యాఖ్యయా ఆన్ధ్రభాషావ్యాఖ్యయా
సమన్వితమ్

(ప్రథమో భాగః)

వ్యాఖ్యాయాః రచయితా
మహామహోపాధ్యాయః
ఆచార్య డా. పుల్లెల శ్రీరామచన్ద్రః

ఆర్షవిజ్ఞానట్రస్టు
హైదరాబాదు

2000

బ్రహ్మసూత్రశాంకరభాష్యమ్ : బాలానందినీసహితమ్

ప్రథమ ముద్రణము 2000

ప్రతులు 1000

ప్రతులకు :

శ్రీ పమిడిఘంటం శ్రీరఘురామ్

అడ్వకేటు

శ్రీరామసదనం, ప్లాటు నెం. 1361, రోడ్డు నెం. 45, జూబిలీ హిల్సు,

హైదరాబాదు - 500 033. ఫోన్ : 3608237, 3545145

Brahmasutra Sankara Bhashyam with Balanandini

First Edition - 2000

Copies 1000

For Copies :

Sri Pamidighantam Sriraghuram
Advocate
Plot No. 1361, Road No. 45, Jubilee Hills,
Hyderabad -500 033.
Telefax : 3608237, 3545145

వెల : రెండు సంపుటములకు : రూ. 300-00
Price Rs. 300-00 (for two parts)

Text composed at Avighna Graphics, Hyderabad - 020. ✆ 6502000
Printed at Sree Kalanjali Graphics, Hyderabad - 029. ✆ 3229831

శ్రీః

# కృతినివేదనమ్

దుర్బోధోఽపి చ శాస్త్రార్థో యైర్హస్తామలకీకృతః,
శిష్యాణాం, తాన్ గురూన్ వన్దే రామచన్ద్రార్యదీక్షితాన్.

గమ్భీరాన్ వాచి వపుషి హృదయే చ దయామయాన్,
గీతాభాష్యాదిబోధేడ్యాన్ వన్దే లక్ష్మణశాస్త్రిణః.

వేదాన్తాధ్యయనాధ్యాపనైక ప్రవణమానసాన్,
బ్రహ్మవిద్యాగురూన్ వన్దే పోలగం రామశాస్త్రిణః.

వన్దే గ్రన్థవినిర్మాణ సంశోధన చణాన్ గురూన్,
సిద్ధ్యాద్యధ్యాపకాన్ కృష్ణమూర్తిశాస్త్రిణ అదరాత్.

వేదాన్తజ్ఞానకణికామాప్నవం యత్ప్రసాదతః,
వ్యాఖ్యా నివేద్యతే భక్త్యా తస్మిన్ గురుచతుష్టయే.

పుల్లెల శ్రీరామచంద్రః

ప్రముఖ న్యాయవాది శ్రీ ఆమంచర్ల కృష్ణమూర్తి గారు వారి పితృపాదుల జ్ఞాపకార్థము శ్రీ ఆమంచర్ల రామ మూర్తి మెమోరియల్ సొసైటీని స్థాపించి తద్వారా ఈగ్రంథముద్రణకు ద్రవ్య సహాయ మొనరించిన ధన్యజీవి.

# అభినందనము

జస్టిస్ పమిడిఘుంటం కోదండరామయ్య
ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాజీ న్యాయమూర్తి
ఆర్షవిజ్ఞాన ట్రస్టు స్థాపకాధ్యక్షుడు

శ్రీరామసదనం,
జూబ్లీ హిల్సు,
హైదరాబాదు - 500 033.

భగవాన్‌వేదవ్యాసునిచే రచింపబడిన, ప్రస్థానత్రయములో ఒకటైన ఈ బ్రహ్మసూత్రములు తత్త్వవిచారణకు పరమావధి. ఈ మహర్షి మహోన్నతజ్ఞానశిఖరము నధిష్ఠించి, ఈ తత్త్వమును మానవాళికి అందజేసిరి. సామాన్యునకు ఈ శిఖరారోహణ కష్టసాధ్యము. అందుచే జగద్గురు శంకరాచార్యులు తమ భాష్యముచే ఈ జ్ఞాన శిఖరారోహణకు సులువైన మార్గమును ఏర్పరచిరి. సంస్కృతపరిచయము లేని నేటి తరమువారికి దాని ప్రయోజనము శూన్యము. 'మహామహోపాధ్యాయ' 'ఆచార్య' పుల్లెల **శ్రీరామచంద్రుడుగారు** ఈ మూలసూత్రములపై ఆచార్యస్వామివారి భాష్యమునకు తెలుగు వివరణ మను సోపానములు నిర్మించి, ఈ జ్ఞానశిఖరారోహణ సులభసాధ్య మొనరించిరి. అందుచే ముందుగా ఆర్షవిజ్ఞాన పరిషత్ పక్షాన వారికి నా అభినందనములు తెలుపుకొనుచున్నాను. వీరు పాఠకుని అభిముఖుని చేయుచు, సుదీర్ఘమైన ప్రస్తావనలో వివిధదర్శనములు, వాటి స్వరూపములు, ఈ సూత్రములపై తదితరవ్యాఖ్యానముల సారాంశములు వివరించి జగద్గురు శంకరాచార్యులవారి భాష్యముపై గల అపోహలు, సందేహములను నివర్తింపచేయుచు వివిధ అద్వైతగ్రంథములను పేర్కొనుచు ఈనాటికిని అద్వైతసిద్ధాంత ప్రచండ భాస్కరుడు ఎటుల దేదీప్యమానముగ ప్రకాశించుచున్నాడో సహేతుకముగా నిరూపించిరి. ఇది అవశ్యము పఠనీయము.

శాస్త్రనియమము ప్రకారము సూత్రము అల్పాక్షరములతో అనుమానరహితముగా, సారవంతమై, బహుముఖమై, దోషరహితమై ఆకారమున చిన్నదై ఉండవలెను. ప్రస్తుతము ఈ సూత్రరచన కావించినవారు వేదవ్యాసమహర్షి కావున ఈ సూత్రములు శబ్దతః ప్రసన్నములై, అర్థతః గాంభీర్యము కలవై యున్నవి. పరబ్రహ్మను గూర్చి చెప్పును గావున బ్రహ్మసూత్రములు, సర్వసంగపరిత్యాగియైన సంన్యాసిచే అధ్యయనము చేయవలసినవి గాన భిక్షుసూత్రములని, శరీరమునందలి జీవుని గూర్చి తెలుపునవి కావున శారీరకశాస్త్రమని, బదరీవృక్షచ్ఛాయన నివసించిన వ్యాసునిచే రచించబడుటచే బాదరాయణ సూత్రములనియు వీనిని వ్యవహరించుట కలదు. జగద్గురువు పరమాచార్య శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి వేదము వృక్షము,

వేదాంతము పుష్పము, అద్వైతము ఫల మని వ్రాకుచ్చిరి. ఇందుచే ఈ సూత్రములు బౌద్ధములు కావు. అనగా తన బుద్ధికి తోచినట్లు వ్రాసినవి కావు. శ్రుతి, స్మృతి సమ్మతముగా భగవాన్ వేదవ్యాసునిచే వెలయించబడినవి.

ఇందు రెండు సిద్ధాంతములు ప్రత్యేకతను సంతరించుకొన్నవి. మానవుడు అపేక్షించవలసినది స్వర్గము కాదు; మోక్షము; అనగా జననమరణములనుండి విడివడుట. రెండు - జీవునకు, పరబ్రహ్మకు భేదము లేదు. ఇద్దరును ఒక్కటే. అందుచే స్థూలముగా ఇందు పరబ్రహ్మ నిర్వచనము, శ్రుతిస్మృతివాక్య సమన్వయము, జీవుని పరలోకయాత్ర, ఈ మోక్షఫలితము తెలుపబడినవి. ఈ వివరణ పరికించి, ఈయువ తరంవారు ఇది వేదాంతవిషయము, మతపరమైనది, తమకు అవసరము లేదని దీనినుండి విముఖు లగుచున్నారు. ఈ పొరపాటును పెద్దలు, సంఘసంస్కర్తలు, తల్లిదండ్రులు సరిదిద్దవలసి యున్నది.

'ధర్మే చార్థేచ కామే చ మోక్షే చ భరతర్షభ' అని వేదవ్యాసుని వచనము. ధర్మమన కర్మాచరణ. మోక్షమన జ్ఞానము. ప్రతివ్యక్తియు అర్థకామములు ధర్మానుగుణముగా సంపాదించి, మోక్షమును బడయవలెనని ఉపదేశము. ప్రతివ్యక్తికి మృత్యువు తథ్యమని తెలుసు. కాని ఇంద్రియజన్యసుఖమువలన లేక మృత్యువు యెడల భీతిచే ఈ విషయమందు విముఖుడై జీవయాత్ర నడుపుచుండును. ఈ తత్త్వవిచారణ ఆత్మవిద్య. ఈ విద్య మనుష్యుని జ్ఞానసంపన్నుని చేసి, ధర్మనిరతి కలవానినిగా చేయును. తత్త్వదర్శికి ధర్మాచరణ మొదటి మెట్టు. అందుచే ఇందు మొదటి సూత్రములోనే సాధనచతుష్టయసంపత్తి కలవాడే ఈ విద్యను అభ్యసించుటకు తగిన వాడని తెలుపబడినది. కావున వేదవ్యాసమహర్షి మహాభారతమునందలి శాంతి పర్వమునందు మోక్షధర్మపర్వమున శమము, దమము, ఉపరతి, తితిక్ష, శ్రద్ధ, సమాధానము సంపాదించు మార్గము వివరించిరి. వీటిని సంపాదించినవారు తమ జీవితములో అభ్యుదయము సంపాదించి, మోక్షమార్గమున పయనించగలరు. ధర్మాచరణ మానవుని కర్తవ్యనిరతుని చేసి త్యాగశీలునిగా తయారుచేయును.

'త్యాగేనైకే అమృతత్వమానశుః' అను శ్రుతి వచనము గమనార్హము. త్యాగశీలుడు జనన మరణములనుండి విముక్తుడై జీవన్ముక్తుడగుటయే గాక, వాని పేరు ఈ భూమండలమున చిరస్థాయిగా నెలకొనును. వాని త్యాగమువలన మానవాళికి సుఖశాంతులు చేకూరును. ఇది గొప్ప లౌకికప్రయోజనము. అమృతత్వమును పాశ్చాత్యులు Eternity అని వ్యవహరించుట కలదు. ఈ నిర్వచనము లోకకల్యాణమునకు తోడ్పడును. "తేన త్యక్తేన భుంజీథాః, మా గృధః కస్య స్విత్

ధనమ్" అను మరియొక శ్రుతివాక్యము దీనిని ధ్రువపరచును. "పరిత్యాగముచేత నిన్ను నీవు సమృద్ధిగా పోషించుకొనుము కాని యితరుల ధన మాశించకుము". ఈ సృష్టిలో జీవకోటికి అంతకు సరిపోవు సిరిసంపదలు కలవు. కాని మానవుని లోభమువల్ల ఈ భూమండలమునకు దుర్గతి కల్గినది. అందుచే ఈ విషయమును పేర్కొనుచు గాంధీజీ There is enough for all of us but not sufficient for one greedy man అని చెప్పెను.

ఈ తత్త్వదర్శి లోకకల్యాణమునకు ఎట్లు తోడ్పడగలడో మరియొక శ్రుతివాక్యము - "ఏకమేవ అద్వితీయం బ్రహ్మ" ఆత్మ ఒక్కటే కలదు. రెండవవస్తువు లేదు. ఈవాక్య భావమునే Life is one unit అని స్వామి వివేకానంద చెప్పెను. దీని అనుభూతిని పొంది ఆ చిత్సుఖముననుభవించు మహనీయుని సన్నిధిలో జీవకోటి అంతయు సుఖశాంతుల ననుభవించును. ఇందుకు కంచిపరమాచార్య శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి, శృంగేరి జగద్గురువులు శ్రీ చంద్రశేఖరభారతి ఈ తరమునందు దివ్యనిదర్శనములు.

సత్యదూరుడు, దయాశూన్యుడు తన్ను తానే ఉద్ధరించుకొనలేడు. ఇతరులకు ఎట్లు సహాయపడగలడు? కావున మానవుడు ఈ తత్త్వమును సమగ్రమున అధ్యయనము చేసి అనుష్ఠించినచో, శాంతుడు, దాంతుడునై అభ్యుదయనిశ్శ్రేయములను చూరగొనగలడు, మరియు జగత్కల్యాణమునకు తోడ్పడగలడు.

ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారు వాల్మీకి రామాయణమును టీకాతాత్పర్యసహితముగా వెలయించి, మానవుని ధర్మాచరణకు దివ్యమైన వెలుగును ప్రసాదించిరి. ఇప్పుడు మోక్షనముపార్జనకు అధారభూతమైన ఈ బ్రహ్మసూత్రభాష్యమునకు ఏ విధమైన అర్థాపేక్షా లేకుండ తెలుగులో వెలయించిరి. వీరు శ్రుతి స్మృతి ప్రస్థానములు కూడ తెలుగున జగద్గురు శంకరాచార్యులవారి భాష్యముతో వెలయించి, తాము కృతకృత్యులై ఈ ఆర్షవిజ్ఞాన సంస్థసభ్యులను కృతార్థులను చేయవలసినదిగా భగవాన్ వేదావ్యాసులను ప్రార్థించుచున్నాను.

అచతుర్వదనో బ్రహ్మ ద్విబాహురపరో హరిః
అఫాలలోచనః శంభుః భగవాన్ బాదరాయణః.

విక్రమ ఆషాఢ పౌర్ణమి

పమిడిఘంటం కోదండరామయ్య
16-7-2000

❀ ❀ ❀

**ఆర్షవిజ్ఞానట్రస్టు**

"శ్రీరామసదనము", ప్లాట్ నెం. 1361, రోడ్ నెం. 45,
జూబిలీ హిల్సు కో ఆపరేటివ్ హౌసింగ్ సొసైటీ, హైదరాబాదు - 500 033.

# ప్రస్తావన

**యన్నామధేయస్మరణేన జన్తుః ప్రాప్నోతి నిఃశ్రేయసభాగధేయమ్,**
**తాన్ శంకరాచార్యశుభాభిధేయాన్ నిత్యం నమామః శివరూపధేయాన్.**

"ద్వివిధో హి వేదోక్తో ధర్మః, ప్రవృత్తిలక్షణః నివృత్తిలక్షణశ్చ" అని భగవద్గీతా భాష్యప్రారంభంలో శ్రీశంకరభగవత్పాదులు చెప్పినట్లు వేదప్రతిపాదిత మైన ధర్మం రెండు విధాలుగా ఉన్నది. మానవు డాచరించవలసిన వివిధకర్మలకు ప్రవృత్తి లక్షణధర్మం అని పేరు. జ్ఞానవైరాగ్యాదులకు నివృత్తిలక్షణధర్మం అని పేరు. జ్ఞానవైరాగ్యమార్గంలో ప్రవర్తించేవాళ్లు కర్మమార్గంనుండి నివర్తిస్తారు గాన దీని కా పేరు. వేదాలలోని పూర్వభాగం ప్రధానంగా కర్మకాండను బోధిస్తుంది. ఆ విధంగా అది ప్రవృత్తిలక్షణధర్మబోధకం. వేదాల చివరిభాగాలవడంచేత వేదాంతాలని చెప్పబడే ఉపనిషత్తులు జ్ఞానమార్గాన్ని బోధిస్తాయి. ఆ విధంగా అవి నివృత్తిలక్షణధర్మబోధకాలు.

ఒక విధంగా చూస్తే భారతీయతత్త్వశాస్త్రానికి, అది అస్తికదర్శనరూపంలో ఉన్నా, నాస్తికదర్శరూపంలో ఉన్నా, ఉపనిషత్తులు మూలకందం అన్నట్లు కనబడుతుంది. అస్తికదర్శనాలన్నీ ఉపనిషత్తుల ప్రామాణ్యాన్ని ప్రత్యక్షంగానే అంగీకరిస్తాయి. వేదాలకు ప్రామాణ్యం అంగీకరించని నాస్తికదర్శనాలు కూడా ఎన్నో ఔపనిషదసిద్ధాంతాలను తమలో ఇముడ్చుకొన్నాయి. కర్మసిద్ధాంతం, దానిమీదనే ఆధారపడి ఉన్న పునర్జన్మసిద్ధాంతం, పుణ్యపాపాలు, స్వర్గనరకాలు, యమనియమాది యోగాంగాల సాధన, మోక్షం-మొదలైన ఎన్నో విషయాలు అన్ని దర్శనాలలోను సమప్రాధాన్యంతో నిరూపించబడ్డాయి. ఒక విధంగా పరిశీలిస్తే ఈ విషయాలన్నీ భారతదేశంలో అనాదికాలంనుంచీ ప్రచురప్రచారంలో ఉన్నాయనీ, అవి ఏదో అకారంలో నామభేదాలతో వివిధ దర్శనాల మూలగ్రంథాలలోను, దర్శనాలలోనూ కనబడుతున్నా యనీ చెప్పవచ్చును.

దర్శనాలను అస్తికదర్శనా లనీ నాస్తికదర్శనా లనీ రెండు తెగలుగా విభజించడం ఇప్పుడు అధికప్రచారంలో ఉంది. "నాస్తికో వేదనిన్దకః" అనే మనువచనాన్ని పట్టి వేదాన్ని నిందించేవాడు నాస్తికుడు. దాని ప్రామాణ్యం అంగీకరించేవాడు అస్తికుడు. ఈ నిర్వచనాన్ని అనుసరించి వేదప్రామాణ్యాన్ని అంగీకరించే న్యాయవైశేషికసాంఖ్యయోగపూర్వోత్తరమీమాంసాదర్శనాలు అస్తికదర్శనా లనీ, లోకాయతిక-జైన-యోగాచార-సౌత్రాంతిక-వైభాషిక-మాధ్యమికదర్శనాలు నాస్తికదర్శనా

లనీ వ్యవహారం. ఈశ్వరు డున్నా డని అంగీకరించేవాడు ఆస్తికుడనే నిర్వచనం అంగీకరిస్తే ఈశ్వరాస్తిత్వాన్ని అంగీకరించని సాంఖ్య - పూర్వమీమాంసాదర్శనాలు నాస్తికదర్శనా లని చెప్పవలసివస్తుంది. ప్రాచీన పూర్వమీమాంసకులు ఈశ్వరుణ్ణి అంగీకరించలేదు. అందుచేత మొదట చెప్పిన నిర్వచనం గ్రహించబడింది. అయితే ఈ విభాగం ఎప్పుడు ఎవరు ప్రారంభించారో తెలియదు. ముందుగా ఆస్తికదర్శనాలు ఆరు అని నిర్ణయించుకొని నాస్తికదర్శనాలు కూడ ఆరే అని ఆ ఆరు అనే సంఖ్యను నిర్వహించడం కోసం అలా చేసి ఉంటారు. ఎందువల్ల ననగా మొదటి ఆస్తికపదనిర్వచనం ప్రకారం నాస్తికదర్శనాలు మూడే-అవి లోకాయతిక-జైన-బౌద్ధదర్శనాలు. అయితే షట్సంఖ్యాపూర్తికోసం బౌద్ధదర్శనంలోని అవాంతరభేదాలైన యోగాచార - సౌత్రాంతిక వైభాషిక-మాధ్యమిక సంప్రదాయాలను నాలుగు దర్శనాలుగా గ్రహించి నాస్తికదర్శనాలు కూడ ఆరు అని చెప్పడం జరిగింది. ఇలాంటి అవాంతరభేదాలను కూడ కలపుకొంటే ఆస్తికదర్శనాలసంఖ్య ఏ ఇరవైకో పెరగాలి. అలాగే శ్వేతాంబరదిగంబరభేదద్వయాన్ని పట్టి నాస్తికదర్శనాలు కూడ ఏడు కావాలి. అందుచేత ఈ దర్శనవిభాగం అంతా అర్వాచీనంగా, ఏ నూరు నూటయాభై సంవత్సరాల క్రితమో ఏర్పడినదిగా, కనబడుతుంది.

చాల కాలం క్రితం ఈ విభాగం మరొక విధంగా ఉండేది. క్రీస్తుశకం పంచమశతాబ్దికి చెందిన హరిభద్రసూరి అనే ఒక జైనదార్శనికుడు షడ్దర్శనసముచ్చయం అనే ఒక ప్రకరణగ్రంథంలో "మూలభేదాన్నీ, దేవతాతత్త్వభేదాన్నీ పట్టి, బౌద్ధం, నైయాయికం, సాంఖ్యం, జైనం, వైశేషికం, జైమినీయం అని దర్శనాలు ఆరు మాత్రమే" అని ప్రతిపాదించాడు.

"దర్శనాని షడేవాత్ర మూలభేదవ్యపేక్షయా,
దేవతాతత్త్వభేదేన జ్ఞాతవ్యాని మనీషిభిః.
బౌద్ధం నైయాయికం సాంఖ్యం జైనం వైశేషికం తథా,
జైమినీయం చ నామాని దర్శనానామమూన్యహో"

ఈనాడు దర్శనా లన్నింటిలోకీ ఉత్తమదర్శనంగా పరిగణింపబడుతున్న ఉత్తరమీమాంసాదర్శనాన్ని ఇతడు దర్శనాలలో పేర్కొనకపోవడం ఆశ్చర్యజనకం. పైన చెప్పిన ఈ దర్శనా లన్నీ ఆస్తికదర్శనాలే అని కూడ హరిభద్రసూరి అభిప్రాయం. అందుచేతనే ఇతడు గ్రంథాంతంలో --

"జైమినీయప్రమాణస్య సంక్షేపో 2 యం నివేదితః,
ఏవమాస్తికవాదానాం కృతం సంక్షేపకీర్తనమ్"

అని అంటాడు. బహుశా ఇతడు "అస్తి నాస్తి దిష్టం మతిః" (పా.సూ.4.4.60) అనే పాణినిసూత్రానికి కైయటాదులు చెప్పిన "అస్తి పరలోకః ఇతి యః వదతి స ఆస్తికః" (పరలోకంఉన్నదనేవాడుఆస్తికుడు) అనేఅర్థంప్రకారం సాంఖ్యపూర్వమీమాంసాదర్శనాలకు కూడ, అవి ఈశ్వరుణ్ణి అంగీకరించకపోయినా, ఆస్తిక దర్శనత్వాన్ని అంగీకరించాడు. ఇతడే చెప్పినట్లు బౌద్ధజైనమతాల ప్రకారం బుద్ధజినేంద్రులు దేవతలు గాన అవి సేశ్వరదర్శనా లని ప్రతిపాదించాడు. ఈ విధంగా అతని ప్రకారం ఇవన్నీ ఆస్తికదర్శనాలే. ఇక్కడ ఈ ఆరు దర్శనాలను మాత్రమే అంగీకరించడాన్ని బట్టి ఆ కాలానికి బాదరాయణసూత్రాలకు అంతగా ప్రచారం రాలేదని గాని లేదా, కొందరు అర్వాచీనులైన ఆచార్యులు అంటూన్నట్లు పూర్వోత్తరమీమాంసలు ఒకే శాస్త్రంగా ఆ నాడు భావింపబడడంచేత ఉత్తరమీమాంస కూడ జైమినీయానికి పరిశిష్టంగా, తత్పుచ్ఛంగా పరిగణింపబడే దని గాని చెప్పవలసి ఉంటుంది. అయితే

"జైమినీయాః పునః ప్రాహుః సర్వజ్ఞాదివిశేషణః,
దేవో న విద్యతే కోఽ పి యస్య మానం వచో భవేత్"

(సర్వజ్ఞత్వాదిధర్మాలు గల ఈశ్వరుడు అనేవాడు లేడు, అందుచేత అలాంటి ఈశ్వరుని మాటను ప్రమాణంగా గ్రహించే ప్రసక్తి లేదు అని జైమినీయు లంటారు) అని హరిభద్రసూరి అనడంచేత ప్రథమపక్షమే సత్యమన్నట్లు తోస్తూన్నది. అందుచేత ఆ యా దర్శనాలకు ఆ యా కాలాలలో ఉన్న ప్రచురప్రచారాన్ని పట్టి ఈ దర్శనవిభాగం జరుగుతూండే దని ఊహించవచ్చును. అలంకారశాస్త్రాన్ని కూడ ఒక దర్శనంగా పరిగణించా లని చెప్పేవారు కొందరు ఈనాడు కనబడుచున్నారు కదా?

ఈ విధంగా ఒకానొక కాలంలో దర్శనాల నామపట్టిక (లిస్టు) లోనికే ఎక్కని ఉత్తరమీమాంసాదర్శనానికి దర్శనాలలో అత్యుత్తమమైన స్థానం సంపాదించిన ఘనత శ్రీ శంకరభగవత్పాదులకు మాత్రమే దక్కింది. బ్రహ్మసూత్రాలకు అంతకు ముందు ఏవేవో ఒకటి రెండు వృత్తులు, చిన్న చిన్న వ్యాఖ్యానాలు, ఉండేవేమో గాని వాటి ద్వారా ఈ దర్శనానికి ఒక స్వతంత్రప్రతిపత్తి లభించలేదు. ఆ వృత్తినిర్మాతలు కూడ దానిని జైమినీయ (పూర్వమీమాంసా) పుచ్ఛంగానే చూపించడంచేత అది ఆ రూపంలోనే నిలచిపోయింది. ప్రధానమైన ఇతరదర్శనాలనన్నింటినీ బాదరాయణులు బ్రహ్మసూత్రంలో ఖండించారు. అందుచేత ఈ దర్శనం అన్నింటికంటే అర్వాచీనంగా కనబడుతుంది. అందుచేతకూడ దీనికి దర్శననామనిర్దేశాలలో స్థానం ఆలస్యంగా లభించి ఉంటుంది. శ్రీ శంకరభగవత్పాదులు దీనికి స్వతంత్రదర్శనత్వాన్ని సంపాదించ

గలిగిన, దీనిని అత్యుత్తమదర్శనంగా నిలపగలిగిన విస్తృతవ్యాఖ్యారూపమైన ఒక విశాలమైన బాట వేసి ఈ రాజపథంలో ముముక్షువైన ఏ మానవుడైనా నిర్భయంగా పయనించి ఈ దేహంతో ఉండగానే ముక్తి పొందవచ్చు నని నిరూపించారు. కేవలం బాదరాయణసూత్రాలకే కాక ప్రధానమైన ఉపనిషత్తులకు, వాటి సిద్ధాంతాన్నే తన మాటలలో చెప్పిన భగవద్గీతకూ తమ అనుపమానము, అసాధారణమూ అయిన ప్రతిభాపాటవంతో భాష్యాలు వ్రాసి, తమకు పూర్వం ఉన్న కొందరు వృత్తికారాదుల మతాలను ఖండిస్తూ ఔపనిషదసిద్ధాంతానికి ఒక అచంచలమైన మహాప్రాసాదం నిర్మించారు. నాటినుండియే ఈ ఉత్తరమీమాంసకు దర్శనాలలో ఒక అత్యున్నతమైన స్థానం లభించింది. పూర్వమీమాంసాపుచ్ఛత్వం తొలగిపోయింది.

శ్రీ శంకరభగవత్పాదులు ఔపనిషదసిద్ధాంతాన్ని స్థిరంగా నిలబెట్టడం కోసం అంతకు పూర్వం ఉన్న దర్శనాలలోని ఉపనిషత్సిద్ధాంతవిరుద్ధాలైన కొన్ని అంశాలను బాదరాయణసూచితమార్గంలో ఖండించారు. అందుచేత ఆ దర్శనాల స్వరూపం కూడ సంక్షిప్తంగానైనా తెలుసుకొనడం అవసరం. ఈనాడు ఆరు నాస్తికదర్శనాలు, ఆరు ఆస్తిక దర్శనాలు అనే విభాగం ప్రచారంలో ఉందని వెనుక గమనించి ఉన్నాం. వాటి సంక్షిప్తస్వరూపం ఇది:

## నాస్తికదర్శనాలు

**లోకాయతికదర్శనం** : దీనికే చార్వాకదర్శనం అని కూడ పేరు. చార్వాకులు కేవలభౌతికతావాదులు. వీరి మతంలో ప్రత్యక్షం ఒక్కటే ప్రమాణం. అనుమానం, శబ్దం మొదలైనవి పూర్తిగా నమ్మదగిన ప్రమాణాలు కావు. (ధూమాన్ని చూచి అక్కడ అగ్ని ఉన్న దని ఊహించి నట్లు ఒక హేతువును బట్టి మరొక వస్తువును ఊహించడం అనుమానం. ఆప్తులు చెప్పిన మాట శబ్దం). వీటివల్ల మానవుడు అనేకస్థలాలలో పొరబాటు పడడం కూడ మనం చూస్తున్నాం కదా? ప్రత్యక్షప్రమాణం ద్వారా నేత్రాదీంద్రియాలు ఎదుట ఉన్న వస్తువులతో కలిసి నప్పుడు కలిగే జ్ఞానం, అలాంటి జ్ఞానం కలిగించే ఇంద్రియాలు ప్రత్యక్ష ప్రమాణం. మనకు భూమి, అగ్ని, వాయువు, జలం అనే నాలుగు భూతా లున్నట్లు స్పష్టంగా తెలుస్తూన్నది. మనకి కనబడే ఈ ప్రపంచంలోని పదార్థాలన్నీ ఈ భూతచతుష్టయంనుండే పుడుతున్నాయి. మానవుడు కూడ ఈ భూతచతుష్టయం కలయికవల్ల ఏర్పడిన ఒక పదార్థమే. మానవునిలో ఈ భూతచతుష్టయంకంటె వ్యతిరిక్తమైన ఆత్మ అనేది ఒకటి ఉందని ఎట్లు నమ్మాలి? మానవుని దేహంలో చైతన్యం అనేది ఒకటి ఉన్న దనే మాట నిజమే. కాని అది.

తమలపాకులు, వక్క, సున్నం కలవడంచేత ఎరుపు అనే మరొక పదార్థం ఉదయించి నట్లు నాలుగు భూతాల విశిష్టమైన కలయికవల్ల ఏర్పడినదే. దేహం నశించడంతో చైతన్యం కూడ నశిస్తుంది. దేహం నశించిన తరవాత ఇక్కడ చేసిన పాపపుణ్యాల ఫలాలను అనుభవించడానికి ఆత్మ అనేది ఏదీ మిగలదు. భగవంతు డనేవాడు కూడ లేడు. ఈ సృష్టి అంతా మహాభూతాల కలయికచేత సహజంగా కలుగుతూన్నది. దీనికి కారణమైన భగవంతు డొకడున్నా డని విశ్వసించవలసిన పని లేదు. స్వర్గాదిసౌఖ్యాలు అనుభవించడానికి గాని, దేవుని అనుగ్రహం సంపాదించడానికి గాని కర్మలు ఆచరించడం మూర్ఖత్వం. అమాయకులైన ప్రజలను మోసగించడానికి ఎవళ్లో కల్పించి వ్రాసిన వేదాలు ప్రమాణం కావు. ఈ దేహం ఉన్నంతవరకు ఏదో విధంగా భోగభాగ్యాలు సంపాదించి ఆనందించడమే జీవిత పరమావధి. అదే స్వర్గం. అనవసరంగా దాన్ని గూర్చి దీన్ని గూర్చి ఆలోచిస్తూ బాధపడడమే నరకం. ఇది లోకాయతికసిద్ధాంతం. ఇలాంటి మాటలు వినడానికి చాలా ఇంపుగా ఉంటాయి గాన ఈ లోకాయతికులు చారువాక్కులు (ఇష్టంగా అందంగా కనబడే మాటలు గలవారు) అనీ, ఈ చారువాక్కులకే కాలక్రమేణ చార్వాకులు అనే పేరువచ్చిం దనీ కొంద రంటారు. ఏతన్మతప్రవక్తలలో ఒకనికి చార్వాకు డనే పేరు ఉండడంచేత ఇది చార్వాకమతం అయిందని కొంద రంటారు. వీళ్ళ మతం ప్రకారం మనకు కనబడే ఈ లోకం ఒక్కటే ఆయతనం (నివాసస్థానం) కాబట్టి వీళ్ళు లోకాయతికులైనారు. ఈ మతంవాళ్ళు బృహస్పతి చెప్పిన కొన్ని వాక్యాలు ఉదాహరిస్తూంటారు. అందుచేత ఈ మతాన్ని బృహస్పతి అనేవా డొకడు ప్రవర్తింపచేసి ఉంటాడు అని కొందరి అభిప్రాయం.

జైనదర్శనం : జైనమతం అతి ప్రాచీనమైనది. ఆ యా కాలాలలో జన్మించిన ఇరవైనలుగురు తీర్థంకరులు (జైనాచార్యులు) ఈ మతాన్ని బోధించారు. కర్మబంధాన్ని జయించడంచేత వీళ్లకి జిను లని పేరు. ఇరవైనాల్గవ తీర్థంకరుడైన వర్ధమానమహావీరుడు క్రీ.పూ ఆరవశతాబ్దంలో జన్మించాడు. ఇతడు బుద్ధుని సమకాలికుడు.

జైనులు ప్రత్యక్షప్రమాణాన్నే కాక అనుమానశబ్దాలను కూడ ప్రమాణాలుగా అంగీకరిస్తాడు. మహామహిమాన్వితులైన తీర్థంకరాదుల ఉపదేశాలు శబ్దప్రమాణంలో చేరుతాయి. ప్రత్యక్షంగా కనబడే పృథివ్యప్తేజోవాయువులనే కాకుండా, ఆకాశం, కాలం, ధర్మం, అధర్మం అనే తత్త్వాలను కూడ జైనులంగీకరిస్తారు. ఈ ధర్మాధర్మాలు లోకప్రసిద్ధాలైన ధర్మాధర్మాలు కావు. చలనానికి ఉపకరించేది ధర్మం. స్థితికి ఉపకరించేది

అధర్మం. వీటి అన్నింటికంటె భిన్నమైన ఆత్మ కూడ ఉంది. సుఖదుఃఖాదిగుణాలను పట్టి ఆత్మాస్తిత్వాన్ని ఊహించవచ్చును. ఎన్ని శరీరాలుంటాయో అన్ని జీవాత్మ లుంటాయి. వృక్షలతాదులలోను రజఃకణాలలోను కూడ జీవాత్మలుంటాయి. అయితే వివిధజీవులలో ఉన్న జ్ఞానంలో వైషమ్యం ఉంటుంది. వృక్షలతాదులలోని జీవులకు స్పర్శజ్ఞానం మాత్రమే ఉంటుంది. ఆ జీవులు ఏకేంద్రియాలు. ఇట్లే కొన్ని జీవాత్మలకు రెండు ఇంద్రియా లుంటాయి. కొన్నింటికి మూడుంటాయి. కొన్నింటికి నాలుగుంటాయి. మనుష్యాదులకు ఐదు ఇంద్రియాలుంటాయి. ఈ విధంగా ఏకేంద్రియజీవులు మొదలు పంచేంద్రియజీవుల వరకు గల ప్రాణిసంఘాతంలో జ్ఞానతారతమ్యం ఉంటుంది. కాని అన్ని విధాలైన జీవులలోను కూడ అనంతజ్ఞానాన్ని, అనంతశక్తిని, అనంతానందాన్ని పొందగల సామర్థ్యం ఉంటుంది. ఆ సామర్థ్యం కర్మబంధంచేత ఆవృతమై ఉంటుంది. కామక్రోధాలవల్ల కలిగే కర్మలు జీవునికి అచేతనపదార్థంతో సంబంధం ఏర్పరుస్తాయి. దానితో జీవునిలో సహజంగా ఉన్న సర్వజ్ఞత్వాదులు మరుగునపడిపోతాయి. ప్రయత్నం చేస్తే ఏ జీవుడైనా ఈ కర్మభారం తొలగించుకొని సహజాలైన సర్వజ్ఞత్వసర్వశక్తిత్వాదులను పొందగలుగుతాడు.

కర్మబంధం తొలగించుకొనడానికి - (1) సమ్యగ్దర్శనం (2) సమ్యగ్జ్ఞానం (3) సమ్యక్చరిత్రం అనేవి ఆవశ్యకాలు. వీటికి రత్నత్రయం అని పేరు. తీర్థంకరులు ఉపదేశించిన తాత్త్వికసిద్ధాంతాలమీద అచంచలవిశ్వాసానికి సమ్యగ్దర్శనం అని పేరు. ఈ సమ్యగ్దర్శనంచేత క్రమంగా తత్త్వజ్ఞానం లభించి అజ్ఞానం తొలగడానికి అవకాశం ఏర్పడుతుంది. ఇలాంటి తత్త్వజ్ఞానానికి సమ్యగ్జ్ఞానం అని పేరు. సదాచారం లేకపోతే సమ్యగ్దర్శన - సమ్యగ్జ్ఞానా లున్నంతమాత్రాన ప్రయోజనం లేదు. అందుచేత సత్య-అహింసా-అస్తేయ-వైరాగ్యాదులను అలవరచుకోవాలి. ఈ విధంగా రత్నత్రయాన్ని పరిరక్షించుకొంటే క్రోధం, మానం, మాయ, లోభం, అనే కషాయాలు నశిస్తాయి వీటివల్ల ఏర్పడిన కర్మబంధం తొలగిపోతుంది. అప్పుడు జీవునకు అచేతనపదార్థాలతో ఏర్పడిన సంబంధం దూరం అవుతుంది. దానితో జీవుడు స్వసహజాలైన సర్వజ్ఞత్వసర్వశక్తిత్వాదులను పొందుతాడు. ఇదే మోక్షం.

జైనులు దేవుణ్ణి అంగీకరించరు; కాని దేవుని కున్న సర్వజ్ఞత్వాదులన్నీ తీర్థంకరులకున్నాయని అంగీకరించి వాళ్లను దేవుణ్ణి వలె పూజిస్తారు. ఈ తీర్థంకరులు జైనులకు ఆదర్శభూతులైన మహాపురుషులు.

ఎంతటి క్షుద్రజీవులనైనా దయాబుద్ధితో చూడాలనేది జైనుల

ముఖ్యసిద్ధాంతం. పరమతసహనానికి జైనులది పెట్టిన పేరు. ఇందుకు వీళ్ళ స్యాద్వాదం ఎంతగానో ఉపకరించింది. ఒక సమయంలో, కొన్ని పరిస్థితులలో ఒక వస్తువును ఒక దృష్టికోణంతో చూస్తే అది ఒక విధంగా కనబడుతుంది. అదే వస్తువు మరొకసమయంలో, వేరే పరిస్థితులలో, వేరు దృష్టికోణంతో చూస్తే మరొకవిధంగా కనబడవచ్చు. ఈ సత్యాన్ని పురస్కరించుకొని జైనులు సప్తభంగీనయం అనే నామాంతరం గల స్యాద్వాదాన్ని అంగీకరించారు.

1. స్యాదస్తి = ఉండవచ్చును
2. స్యాన్నాస్తి = లేకపోవచ్చును
3. స్యాదస్తి చ నాస్తి చ = ఉండవచ్చును లేకపోవచ్చును కూడ
4. స్యాదవక్తవ్యమ్ = వర్ణింప శక్యం కాకపోవచ్చును
5. స్యాదస్తి చ అవక్తవ్యం చ = ఉండవచ్చును, వర్ణింపశక్యం కాకపోవచ్చును
6. స్యాన్నాస్తి చ అవక్తవ్యం చ = ఉండవచ్చును, లేకపోవచ్చును, వర్ణింపశక్యం కాకపోవచ్చును. ఇవే సప్తభంగీనయం.

బౌద్ధదర్శనం :- క్రీ.పూ. ఆరవ శతాబ్దంలో కపిలవస్తురాజవంశంలో జన్మించిన గౌతముడు ఈ దర్శనానికి మూలపురుషుడు. ఇతడే సిద్ధార్థుడు (సిద్ధించిన ప్రయోజనం కలవాడు). తత్త్వబోధ కలిగిన పిమ్మట బుద్ధుడని ప్రసిద్ధి పొందాడు. ప్రపంచంలో తన చుట్టూ కనబడుతూన్న వార్ధక్యము, రోగాలు, మరణాలు మొదలైన దుఃఖహేతువులను చూడగానే రాజకుమారుడైన గౌతముని హృదయంలో వైరాగ్యభావం ఉదయించింది. ఈ దుఃఖాలను పోగొట్టే ఉపాయాలు అన్వేషించాలని అతడు నిశ్చయించాడు. ఎందరో మహాపురుషుల్ని ఆశ్రయించి తృప్తికరమైన ఉపాయం ఏదీ లభించక తానే దీర్ఘతపస్సు చేసి, దుఃఖనివారణోపాయాన్ని కనుగొని లోకానికందించాడు. బుద్ధుడు నిరంతరతపస్సుచేత నాలుగు సత్యాలు తెలుసుకున్నాడు. వాటికి "చత్వారి ఆర్యసత్యాని" అని పేరు.

1. ఈ ప్రపంచకంలో దుఃఖం ఉంది.
2. ఈ దుఃఖానికి కారణం ఉంది.
3. ఈ దుఃఖాలను పూర్తిగా తొలగించవచ్చును.
4. దుఃఖాలను తొలగించడానికి మార్గం ఉంది.

అనేవి నాలుగు సత్యాలు. బుద్ధుని బోధ లన్నీ ఈ నాలుగు సత్యాలమీద ఆధారపడి ఉన్నాయి.

ప్రపంచంలో దుఃఖం ఉన్నదనే విషయం అందరూ అంగీకరించినదే. అయితే ఈ దుఃఖం కేవలం ఆపాతతః (పైపైకి) కనబడుతున్నది మాత్రమే కాదనీ, ఇట అంతటా స్థిరంగా పాతుకొని పోయి ఉన్నదనీ, సుఖంగా కనబడేవాటిలో కూడ అంతర్గతంగా దుఃఖమే ఉన్నదనీ బుద్ధుడు కనుగొన్న మొదటి సత్యం.

రెండవ సత్యం కార్యకారణభావసమన్వయంచేత కనుగొన్నది. ఒక పదార్థం అది భౌతికపదార్థమైనా, మానసికపదార్థమైనా, దాని స్థితి ఇతరపదార్థాల స్థితిమీద ఆధారపడి ఉంటుంది. ఇతరపదార్థాల స్థితిమీద ఆధారపడకుండా స్వతంత్రంగా నిలిచి ఉండగలిగిన పదార్థం ఏదీ లేదు. అందుచేత ఈ ప్రపంచంలో స్థిరంగా ఉండేది ఏదీ లేదు. అన్ని వస్తువులూ మార్పు చెందుతూనే ఉంటాయి. మన దుఃఖాలు కూడ ఏవో కారణాలచేతనే కలుగుతున్నాయి. వీటి మూలకారణం ఈ ప్రపంచంలో పుట్టడమే. ఇలా పుట్టడానికి కారణం విషయవాంఛ. దీనికే తృష్ణ అని పేరు. ఈ తృష్ణకు కారణం అజ్ఞానం. మనకు అజ్ఞానమే లేకపోతే తృష్ణ కలగదు. తృష్ణ లేకపోతే ఈ భూమిమీద జన్మ కాని, దుఃఖం కాని ఉండేవి కావు.

పైన చెప్పినట్లు దుఃఖానికి కొన్ని కారణా లున్నట్లు తేలింది. ఆ కారణాలను తొలగించగానే కార్యమైన దుఃఖం కూడ తనంతట తానే తొలగిపోతుంది. ఇది మూడవ సత్యం.

దుఃఖకారణం తొలగించడానికి మార్గం ఉన్నది అనేది నాల్గవ సత్యం. ఈ మార్గంలో ఎనిమిది అంగాలున్నాయి. అందుచేత దీనికి అష్టాంగమార్గం అని పేరు. ఈ మార్గం అనుసరించే అధికారం ప్రతి ఒక్కరికీ ఉంది.

| | | | |
|---|---|---|---|
| 1. | సమ్యగ్ దృష్టి | 2. | సమ్యక్సంకల్పం |
| 3. | సమ్యగ్వాక్ | 4. | సమ్యక్కర్మాంతం |
| 5. | సమ్యగాజీవం | 6. | సమ్యగ్వ్యాయామం |
| 7. | సమ్యక్స్మృతి | 8. | సమ్యక్సమాధి |

అనేవి అష్టాంగాలు. (1) వెనుక చెప్పిన సత్యచతుష్టయాన్ని బాగా తెలుసుకొనడం సమ్యగ్దృష్టి. దానిచేత అజ్ఞానంవల్ల ఏర్పడిన మిథ్యాదృష్టి తొలగిపోతుంది. సత్యాలను తెలుసుకొని వాటిని ఆచరణలో పెట్టుకొనడానికి ప్రయత్నించాలి. (2) ప్రాపంచిక విషయాలమీద వైరాగ్యం పొంది, ఇతరుల విషయంలో దుష్టభావాలు విడిచిపెట్టి వాళ్లకెలాంటి అపకారమూ కూడ చేయకూడదు. దీనికి సమ్యక్సంకల్పం అని పేరు. (3) అసత్యం పలకకుండా ఉండడం, పరదూషణం చేయకపోవడం మొదలైన

రీతులలో వాక్సంయమం పాటించడం సమ్యగ్వాక్. (4) అహింస, అస్తేయం ఇంద్రియనిగ్రహం, సత్యవ్రతం, అమదం (గర్వం లేకపోవడం) అనే పంచశీలాన్ని అలవరచుకొని జీవయాత్ర సాగించడం సమ్యక్కర్మాంతం. (5) న్యాయసంమత మైన జీవనోపాధిని సంపాదించుకొనడం సమ్యగాజీవనం. (6) మానవుడు ఎంత ప్రయత్నం చేసినా పూర్వవాసనలు వానిని చెడుమార్గం వైపు త్రిప్పుతూ ఉంటాయి. అందుచేత అతడు చాల జాగరూకతతో ఉండాలి. అందుకోసం అతడు (1) వెనుకటి చెడుభావాలను సమూలంగా తొలగించుకోవాలి. (2) చెడ్డ భావా లేవీ క్రొత్తవి మనస్సులో ప్రవేశించకుండా చూచుకుంటూండాలి. (3) మనస్సును ఎల్లప్పుడూ సద్భావాలతో నింపుతూండాలి (4) ఆ భావా లెప్పటికీ తొలగిపోకుండా ఉండేటట్లు చూచుకోవాలి ఇలాంటి చతుర్విధప్రయత్నానికి సమ్యగ్వ్యాయామం అని పేరు. (7) తాను నేర్చిన సత్కర్మలను సత్యాలను సర్వదా స్మరిస్తూండడం సమ్యక్స్మృతి. (8) పై ఏడు అంగాలలో పరినిష్ఠితస్థితి పొందగలిగిన సాధకుడు చిత్తాన్ని నిశ్చలం చేసికొని ధ్యానస్థితిని పొందకలుగుతాడు. దీనికి సమ్యక్సమాధి అని పేరు. ఈ విధంగా అష్టాంగమార్గాన్ని అవలంబిస్తే నిర్వాణం (మోక్షం) లభిస్తుంది.

బుద్ధుడు తాత్త్వికసిద్ధాంతా లేవీ మనకు గ్రంథ రూపంలో అందజేయలేదు. కాని అతడు చేసిన మౌలికోపదేశాలను ఆధారంగా చేసుకొని తరువాతివారు అనేకసిద్ధాంతాలు ప్రచారంలోనికి తీసికొనివచ్చారు. వీటిలో (1) మాధ్యమికమతం (లేక శూన్యవాదం) (2) యోగాచారమతం (లేక విజ్ఞానవాదం) (3) సౌత్రాంతికమతం (4) వైభాషికమతం అనే నాలుగు మతాలు ప్రసిద్ధ మైనవి.

**(1) మాధ్యమికమతం** :- ఈ మతం ప్రకారం ప్రపంచం అంతా అసత్యం. మానసికప్రపంచం, భౌతిక ప్రపంచమూ కూడ అజ్ఞానకల్పితాలే. నిజానికి ప్రపంచం అంటూ ఏదీ లేదు. ఈ మతం సర్వమూ శూన్యమే అని చెప్పడంచేత దీనికి శూన్యవాదం అని కూడ పేరు.

**(2) యోగాచారమతం** :- ఈ మతం ప్రకారం బాహ్యప్రపంచం అంతా కాల్పనికం. విజ్ఞానమే (మానసికభావాలే) బాహ్యప్రపంచరూపంలో కనబడుతూన్నది. విజ్ఞానం మాత్రం సత్యం. మనస్సు కూడ అసత్యం అనడం అనుభవవిరుద్ధం. విజ్ఞానమే ప్రపంచరూపంలో భాసిస్తూన్నది అని అంగీకరించడంచేత దీనికి విజ్ఞానవాదం అని పేరు.

**(3) సౌత్రాంతికమతం** :- (బాహ్యమేయవాదం) ఈ మతం ప్రకారం బాహ్య ప్రపంచం, మానసికప్రపంచమూ కూడ సత్యములే. బాహ్యప్రపంచం అంతా అంతరవిజ్ఞానపరిణామమే. అంటే ప్రపంచం అంతా, అన్ని వేళల్లోనూ జ్ఞానగోచరం కావాలి. అలా అవడం లేదు. బాహ్యవస్తు వొకటి ఉంటేనే కాని జ్ఞానం కలగడం లేదు ఎదుట ఒక వృషభం నిలచి ఉన్నప్పుడు మాత్రమే వృషభజ్ఞానం కలుగుతూన్నది అది లేనప్పుడు జ్ఞానం కలగడం లేదు. అందుచేత జ్ఞానోత్పత్తికి వృషభస్థితి కారణం అని అంగీకరించి తీరాలి. అయితే విషయం ఏమిటనగా మనకు వృషభజ్ఞానం కలగడాన్ని పట్టి ఎదుట వృషభం ఉన్నట్లు ఊహిస్తున్నాం. అందుచేత బాహ్యపదార్థా లన్నీ అనుమేయాలే. బాహ్యప్రపంచం అంతా అనుమేయం అని ప్రతిపాదించడం చేత ఈ మతానికి బాహ్యమేయవాదం అని కూడ పేరు.

**4. వైభాషికమతం**:- (బాహ్యప్రత్యక్షవాదం) ఈ మతం ప్రకారం కూడ బాహ్యమానసికప్రపంచాలు రెండూ సత్యమైనవే. అయితే వీళ్లు సౌత్రాంతికుల వలె బాహ్యప్రపంచం అనుమేయం అని అంగీకరించకుండా ప్రత్యక్షవేద్యమే అని ప్రతిపాదిస్తారు. అందుచేత ఈ మతానికి బాహ్యప్రత్యక్షవాదం అని కూడపేరు.

బౌద్ధులు వేదప్రామాణ్యాన్ని, ఈశ్వరాస్తిత్వాన్ని అంగీకరించరు. వాస్తవంలో వీళ్ల మతం ప్రకారం స్థిరమైన పదార్థం ఏదీ లేదు. ప్రతీ వస్తువూ కూడ (జీవునితో సహా) క్షణ క్షణానికీ మారిపోతూ ఉంటుంది. కర్మవశంచేత జీవనం, నదీప్రవాహం వలె, దీపం వలె, అవిచ్ఛిన్నంగా సాగిపోతూ ఉండడంచేత ఏకత్వభ్రాంతి కలుగుతున్నది.

కొన్ని అవాంతరసైద్ధాంతికభేదాలను ఆచారవిధానాదులను పురస్కరించుకొని బౌద్ధంలో కొన్ని శాఖలు బయలుదేరాయి. వాటిలో హీనయానం, మహాయానం అనేవి ప్రధానమైనవి, సింహళద్వీపం, బర్మా, సయామ్ మొదలైన దక్షిణదేశాలలో హీనయానం. టిబెట్టు, చైనా, జపాను మొదలైన ఉత్తరదేశాలలో మహాయానమూ ప్రచారంలోనికి వచ్చాయి. మాధ్యమిక యోగాచారవాదాలు హీనయానానికి సౌత్రాంతిక వైభాషిక వాదాలు మహాయానానికీ సంబంధించినవి.

## ఆస్తికదర్శనాలు

**1. న్యాయదర్శనం** :- న్యాయదర్శనం గౌతమమునిచేత ప్రవర్తింపబడిన దర్శనం. ఇది చాలావరకు తర్కంమీద ఆధారపడి ఉంటుంది. నైయాయికులు ప్రత్యక్షం, అనుమానం, ఉపమానం, శబ్దం అనే నాలుగు ప్రమాణాలు అంగీకరిస్తారు.

(అరణ్యంలో సంచరించే గవయమృగం ఎద్దు ఆకారంలో ఉంటుం దని ఒకడు విని ఉన్నాడు. అత డొక పర్యాయం అరణ్యానికి వెళ్లినప్పుడు అలాంటి మృగాన్ని ఒక దానిని చూడగానే వెనుక తాను విన్న పోలిక గుర్తుకు వచ్చి ఇది గవయమృగం అని గ్రహించాడు. ఈ విధంగా ఉపమానంవల్ల వీనికి ఆ జ్ఞానం కలిగినది గాన ఇది ఉపమానప్రమాణం). ఆత్మ, శరీరం, ఇంద్రియాలు వాటి విషయాలు, బుద్ధి, మనస్సు, ప్రవృత్తి, దోషాలు, ప్రేత్యభావం (మరణానంతరం పునర్జన్మ), ఫలం (కష్టసుఖాల జ్ఞానం), దుఃఖం, అపవర్గం (మోక్షం) అనేవి ఈ ప్రమాణాలచేత గ్రహింపదగిన ప్రమేయాలు. నైయాయికులు (1) ప్రమాణాలు (2) ప్రమేయాలు, (3) సంశయం (4) ప్రయోజనం (5) దృష్టాంతం (6) సిద్ధాంతం (7) అవయవం (8) తర్కం, (9) నిర్ణయం (10) వాదం (11) జల్పం (12) వితండం (13) హేత్వాభాసం (14) ఛలం (15) జాతి (16) నిగ్రహస్థానాలు అనే పదహారు పదార్థాలు అంగీకరిస్తారు.

నైయాయికులకు కూడ పరమలక్ష్యం మోక్షసాధనమే. ఇది తత్త్వజ్ఞానంచేత సిద్ధిస్తుంది. ఆత్మ దేహేంద్రియమనోబుద్ధ్యాదులకంటె భిన్నమే అయినా అజ్ఞానంచేత వాటికంటె అభిన్నం అన్నట్లు తోస్తుంది. వాటి యథార్థస్వరూపాన్ని తెలుసుకుంటే బంధం తొలగి మోక్షం లభిస్తుంది. మనస్సు అణుపరిమాణం, నిత్యం. ఇది ఆత్మకు సుఖదుః ఖాద్యనుభవం కలిగిస్తూంటుంది. ఆత్మకు జ్ఞానం సహజం కాదు. ఇంద్రియాల ద్వారా ఆత్మకు విషయాలతో సంపర్కం ఏర్పడినప్పుడు జ్ఞానం పుడుతుంది. ఈ విధంగా జ్ఞానం అనేది ఆత్మకు ఆగంతుకం అవడంచేత ముక్తావస్థలో ఏ జ్ఞానమూ ఉండదు. ఆత్మ (ప్రతీజీవాత్మా కూడ) సర్వగతం. మిథ్యాజ్ఞానంవల్ల కలిగిన రాగద్వేష మోహాదులచేత ప్రేరితమై సుకృతదుష్కృతా లాచరిస్తూ సంసారబంధంలో చిక్కుకొంటూ ఉంటుంది. తత్త్వజ్ఞానం కలగగానే రాగమోహాదులు తొలగి సకలదుఃఖనివృత్తి రూపమైన అపవర్గం కలుగుతుంది. ముక్తావస్థలో దుఃఖమూ ఉండదు, సుఖమూ ఉండదు. నైయాయికమతంలో దుఃఖాభావమే మోక్షం.

నైయాయికులు యుక్తిసాహాయ్యంచేతనే ఈశ్వరు డున్నట్లు సాధిస్తారు. ఏదైన కార్యం ఒకటి ఉన్నదంటే దాని కొక కర్త ఉండాలి. ఘటం తయారు కావాలంటే దాని నిర్మాణకార్యక్రమం అంతా తెలిసిన కుమ్మరి ఒకడుండాలి కదా? ఈ ప్రపంచ మంతా సావయవమైన (వివిధ అవయాలు గల) కార్యం. దానిని నిర్మించడానికి సర్వసమర్థుడైన వాడొకడు లేకపోతే దీని నిర్మాణం కుదరదు. ఆ సర్వసమర్థుడే ఈశ్వరుడు. ఈ విధమైన

అనేకయుక్తులచేత ఈశ్వరాస్తిత్వాన్ని సాధించవచ్చును. ఈ ఈశ్వరుడే జగత్సృష్టి - రక్షణ - సంహారకర్త. నిత్యములైన భూతచతుష్టయపరమాణువుల సహాయంతోను కాల-దిక్-ఆత్మ-ఆకాశ-మనస్సుల సహాయంతోను ఈశ్వరుడు ఈ జగత్తును, జీవులందరూ వారి వారి పుణ్యపాపాల ఫలాలు అనుభవించడం కోసం సృష్టిస్తాడు. ఎప్పటికైనా ప్రతిజీవుడూ కూడ తత్త్వజ్ఞానం సంపాదించుకొని అపవర్గాన్ని పొందవచ్చును.

2. వైశేషికదర్శనం :- ఈ దర్శనానికి మూలపురుషుడు కణాదమహర్షి. అతనికే ఉలూకు డని కూడ పేరు. న్యాయవైశేషికదర్శనాల మధ్య ఎక్కువ పోలికలున్నాయి. వైశేషికమతానుసారం (1) ద్రవ్యం, (2) గుణం, (3) కర్మ (4) సామాన్యం, (5) విశేషం. (6) సమవాయం, (7) అభావం అని ఏడు పదార్థాలున్నాయి. న్యాయశాస్త్రంలో అంగీకరించిన పదార్థాలను ఈ ఏడింటిలోను అంతర్గతం చేయవచ్చు నని వీళ్ల అభిప్రాయం.

1. గుణకర్మలు ద్రవ్యాన్ని ఆశ్రయించుకొని ఉంటాయి. భూమి, జలం, అగ్ని, వాయువు, ఆకాశం, కాలం, దిక్కు, ఆత్మ, మనస్సు అని పదార్థాలు తొమ్మిది. వాటిలో మొదటి ఐదింటికీ పంచమహాభూతాలని పేరు. వీటిలో వరుసగా గంధం, రసం, రూపం, స్పర్శ, శబ్దం అనే గుణాలున్నాయి. మొదటి నాలుగు మహాభూతాలు నిత్యాలైన ఆ యా పరమాణువుల కలయికచేత ఏర్పడ్డాయి. ఆకాశదిక్కులు అప్రత్యక్షములు; నిత్యములు, సర్వవ్యాప్తములు. మనస్సు అణుపరిమాణం గాన ఒకే క్షణంలో రెండు జ్ఞానాలు ఉండజాలవు. ఆత్మ సర్వవ్యాప్తం. నిత్యం, జ్ఞానాధారం. జీవాత్మ మానసైకవేద్యం. పరమాత్మ అనుమానప్రమాణవేద్యుడు. ఇతడు జీవుల కర్మల ననుసరించి నిత్యములైన పరమాణువులతో జగత్సృష్టి చేస్తూంటాడు. సర్వజ్ఞుడైన ఈశ్వరుడొక డున్నాడని అంగీకరించనిచో అచేతనాలైన పరమాణుల ద్వారా సృష్టి జరగడం సంభావ్యం కాదు?

2. గుణం సర్వదా ద్రవ్యాన్ని ఆశ్రయించి ఉంటుంది. ఒక గుణంలో మరొక గుణం కాని కర్మగాని ఉండదు. ఇలాంటి రూప-రసాదిగుణాలు ఇరవైనాలు గున్నాయి. ఉత్క్షేపణం (పైకి విసరడం), అవక్షేపణం (క్రిందికి విసరడం) ఆకుంచనం (ముణవడం) ప్రసారణం (చాపడం) అని కర్మ నాలుగు విధాలు. కర్మ కూడ ద్రవ్యాన్నే ఆశ్రయించి ఉంటుంది. సామాన్య మనగా జాతి. అనేకగోవులున్నాయి. ఆ గోవు లన్నింటిలోను 'గోత్వం' అనే జాతి ఒకటి ఉంది. అది గోవు పుట్టినప్పుడు పుట్టదు. అది చనిపోయినప్పుడు

నశించదు. అందుచేత సామాన్యం నిత్యం; అనేక వస్తువులను ఆశ్రయించుకొని ఉంటుంది.

ఒక వస్తువుయొక్క అవయవ విశేషాలు, గుణాలు మొదలైనవాటిని బట్టి ఈ వస్తువుకంటె ఆ వస్తువు భిన్నమైన దని అంటాం. కాని నిత్యములు సమాన గుణములు అయిన రెండు పృథ్వీపరమాణువులలో ఒకటి రెండవదానికంటె భిన్నమైనదని చెప్పాలంటే సరియైన కారణం ఏదీ కనబడదు. అందుచేత ఈ పరమాణువులో ఒక విశేషం, ఆ పరమాణువులో మరొక విశేషం ఉందనీ, ఈ విశేషాన్ని పట్టి ఈ పరమాణువు ఆ పరమాణువుకంటె, ఆ పరమాణువు ఈ పరమాణువుకంటె భిన్నమైనది అనీ చెప్పాలి. ఈ విధంగా విశేషం అనేది నిత్యములైన పరమాణువులు మొదలైనవాటిలో ఉంటుంది. ఇలాంటి విశేషాలను అంగీకరించడం చేతనే వీరి మతానికి వైశేషికమతం అనే పేరు వచ్చినది. సమవాయం అనగా విడదీయరాని సంబంధం. ఇది గుణం గుణి, అవయవం అవయవి మొదలైనవాటిలో ఉంటుంది. ప్రాగభావం, ప్రధ్వంసాభావం, అత్యంతాభావం, అన్యోన్యాభావం అని అభావం నాలుగు విధాలు. ఏదైన వస్తువు పుట్టడానికి పూర్వం లేకపోవడం ప్రాగభావం. ఉదాహరణకి ఘటం తయారుచేయడానికి ముందు ఘటం లేదు గాన ఆ అభావం ఘటప్రాగభావం. పుట్టిన వస్తువు కొంతకాల ముండి నశించిన పిమ్మట ఏర్పడిన అభావం ప్రధ్వంసాభావం. ఉదాహరణకి -ఘటం బ్రద్దలైపోవడంచేత ఏర్పడిన అభావం ఘటప్రధ్వంసాభావం. ఒక వస్తువు ఎన్నడూ లేకపోవడం అత్యంతాభావం. ఉదాహరణకి వాయువునందు ఎన్నడూ రూపం ఉండదు గాన దానిలో రూపం లేకపోవడం అత్యంతాభావం. ఘటం పటం కాదు, పటం ఘటం కాదు అనే పరస్పరభేదం అన్యోన్యాభావం.

ఈశ్వరుడు, జీవాత్మ, మోక్షం మొదలైన విషయాలలో వైశేషికులు నైయాయకమతాన్నే అంగీకరిస్తారు. ఈశ్వరప్రోక్తం అవడంచేత వేదం ప్రమాణ మని నైయాయుకులు, వైశేషికులూ కూడ అంగీకరిస్తారు.

(3) సాంఖ్యదర్శనం :- సాంఖ్యదర్శనప్రవర్తకుడు కపిలముని. సాంఖ్యులు ప్రత్యక్ష - అనుమాన - శబ్ద ప్రమాణలను అంగీకరిస్తారు. ఈ దర్శనం ప్రకారం ప్రకృతి, పురుషుడు (జీవుడు) అని రెండే మూలతత్త్వాలు. ప్రకృతి జడం, జీవుడు చైతన్యస్వరూపుడు. మనోదేహేంద్రియాలకంటె భిన్నుడు. ఇతడు సాక్షి వలె ఉంటూ ప్రపంచం వ్యవహారాలన్నీ చూస్తూ ఉంటాడు. ప్రకృతి ప్రాపంచికవ్యవహారాలు

నడుపుతూంటే జీవుడు అనుభవిస్తూంటాడు. ఈ విధంగా జీవునికి భోక్తృత్వమే కాని కర్తృత్వం లేదు. దేహాల భేదాన్ని పట్టి జీవులు కూడా వేరు వేరుగా ఉన్నా రని అంగీకరించాలి.

ప్రపంచానికి మూలకారణం ప్రకృతి. ఇది అచేతనం. సత్త్వరజస్తమోగుణాత్మక మైనది. ఈ మూడు గుణాలు సామ్యావస్థలో ఉన్నప్పుడు సృష్టి ఉండదు. అప్పుడు ప్రకృతి (ప్రధానం అని కూడ దీనికి పేరు) అచంచలంగా ఉంటుంది. పూర్వకర్మాను సారం పురుషులకు ప్రకృతితో సంయోగం ఏర్పడడంతో ప్రకృతి సృష్టి చేయడం ప్రారంభిస్తుంది. ప్రకృతినుంచి మొట్టమొదట సకలజగద్బీజమైన మహత్తత్వం పుడుతుంది. పురుషుని చైతన్యం ఈ మహత్తత్త్వంలో ప్రతిబింబించడంచేత అది చేతనం వలె భాసిస్తుంది. అప్పుడు దానిని సకలజగదుత్పత్తిహేతువైన బుద్ధితత్త్వం అంటారు. ఈ బుద్ధితత్త్వం అహంకారంగా పరిణతం అవుతుంది. ఈ అహంకారతత్త్వం 'నేను' 'నాది' అనే అభిమానానికి కారణం. దీనితో సంబంధించడంచేత పురుషుడు కర్త నని అనుకొంటూంటాడు. సత్త్వగుణప్రధానమైన అహంకారంనుంచి త్వక్ - చక్షుః -శ్రోత్ర-ఘ్రాణ-రసనలు అనే ఐదు జ్ఞానేంద్రియాలు, వాక్-పాణి-పాద-పాయు-ఉపస్థ లనే ఐదు కర్మేంద్రియాలు, ఉభయాత్మకమైన మనస్సు జనిస్తాయి. తమఃప్రధానమైన అహంకారంనుంచి పంచస్థూలమహాభూతాలకు కారణమైన సూక్ష్మ భూతాలు (వీటికే భూతతన్మాత్ర లని పేరు) పుడతాయి. వీటిలో శబ్ద స్పర్శ రూప రస గంధాలు అవ్యక్తావస్థలో ఉంటాయి. వీటినుండి స్థూలములైన పంచమహాభూతాలు పుడతాయి. ఈ విధంగా సాంఖ్యులు ఇరవైనాలుగు తత్త్వాలు అంగీకరిస్తారు.

జీవుడు అజ్ఞానవశంచేత, అనాత్మలైన దేహేంద్రియాదులకు చెందిన సుఖదుః ఖాదులను తనమీద ఆరోపించుకుని సుఖదుఃఖవశంవదు డౌతూంటాడు. ఈ అజ్ఞానం తొలగగానే లౌకికవ్యవహారాన్నంతనీ ఒక విధమైన నిర్లిప్తతతో పరికిస్తూంటాడు. ఇట్టి స్థితికే ముక్తి, కైవల్యం, అపవర్గం అని పేర్లు. ఇట్టి స్థితిని ఈ శరీరం ఉండగానే సంపాదించకలుగుతే అది జీవన్ముక్తి.

సాంఖ్యులు ఈశ్వరాస్తిత్వాన్ని అంగీకరించరు. వేదప్రామాణ్యాన్ని అంగీకరిస్తారు. కాని కొందరు సాంఖ్యులు తమ మతం కూడ ఈశ్వరుణ్ణి అంగీకరిస్తుంది అని చెప్పడం ఉంది. ఈశ్వరాస్తిత్వాన్ని అంగీకరించకపోయినా వేదప్రామాణ్యాన్ని అంగీకరించడంచేత ఇది అస్తికమతంగా పరిగణింపబడింది.

**4. యోగదర్శనం:-** యోగదర్శనం చాల వరకు సాంఖ్యదర్శనాన్ని పోలి ఉంటుంది. ఏతద్దర్శనప్రవర్తకుడు పతంజలిముని. సాంఖ్యు లంగీకరించిన చతుర్వింశతితత్త్వాలను అంగీకరిస్తూ ఈ దర్శనం ఈశ్వరుణ్ణి కూడ అంగీకరిస్తుంది. ఆత్మానాత్మవివేకజ్ఞానంవల్ల ముక్తి కలుగుతుం దని సాంఖ్యులు బోధించగా ఈ వివేకజ్ఞానం కలగడానికి ఉపయోగించే సాధనాలను యోగదర్శనం ప్రతిపాదించింది.

చిత్తంలో సర్వదా ఏవేవో భావాలు కలుగుతూనే ఉంటాయి. వాటికి చిత్తవృత్తులని పేరు. ఆ చిత్తవృత్తుల్ని పూర్తిగా అరికట్టడమే యోగం. ఈ స్థితిని సాధించడానికి ఆవశ్యకమైన యమనియమాదిసాధనాలను యోగదర్శనం బోధిస్తుంది. వైరాగ్యాదుల ద్వారా చిత్తాన్ని శుద్ధం చేసికొని ఏదైన ఒక ఆలంబనం మీద చిత్తాన్ని స్థిరంగా నిలపడంచేత చిత్తవృత్తులను నిరోధించవచ్చును. ఇలా ధ్యానం చేయడానికి అత్యుత్తమమైన ఆలంబనం పరమేశ్వరుడు. అతడు సర్వజ్ఞత్వాదిగుణవిశిష్టుడు. ఆతనిపై చిత్తం నిలిపి యోగాన్ని సాధిస్తే ముక్తి లభిస్తుందని యోగ శాస్త్రసిద్ధాంతం. సాంఖ్యులంగీకరించిన సృష్ట్యాదిప్రక్రియ నంతనీ స్వీకరించి ఈశ్వరు డనే ఇరవై యైదవ తత్త్వాన్ని అంగీకరించడంచేత ఈ మతానికి సేశ్వరసాంఖ్యం అనే పేరు కూడవచ్చినది.

**5. పూర్వమీమాంసాదర్శనం :-** వేదాల పూర్వభాగాలను ఆధారంగా చేసి కొని బయలుదేరిన శాస్త్రానికి పూర్వమీమాంస అనీ, వాటి ఉత్తర (చివరి) భాగాలను ఆధారంగా చేసికొని బయలుదేరిన శాస్త్రానికి ఉత్తరమీమాంస లేదా వేదాంతం అని పేర్లు. పూర్వమీమాంసాదర్శనప్రవర్తకుడు జైమినిమహర్షి. ఇది ప్రధానంగా కర్మకాండను సమర్థించడానికి ఆవిర్భవించిన శాస్త్రం. జైమిని రచించిన సూత్రాలకి శబరస్వామి భాష్యం రచించారు. ఆ భాష్యానికి ప్రభాకరుడు, కుమారిలభట్టు వ్యాఖ్యానాలు వ్రాశారు. ప్రధానవిషయాలలో ఐకమత్యం ఉన్నా కొన్ని అంశాలలో వీరిద్దరికీ అభిప్రాయభేదా లున్నాయి. అందుచేత పూర్వమీమాంసలో ప్రధానంగా ప్రాభాకరమతం, భాట్టమతం అని రెండు మతాలు ప్రసిద్ధిలోనికి వచ్చాయి. భాట్టమతానికే అత్యధికమైన ప్రచారం ఉంది. ప్రాభాకరులు ప్రత్యక్షం, అనుమానం, ఉపమానం, శబ్దం, అర్థాపత్తి అనే ఐదు ప్రమాణా లంగీకరించగా భాట్టులు అనుపలబ్ధి అనే ఆరవ ప్రమాణం కూడ అంగీకరించారు. (దేవదత్తుడు బలిసి ఉన్నాడు. అతడు పగలు భోజనం చెయ్యడు అన్నప్పుడు అతడు బలిసి ఉండడాన్ని పట్టి రాత్రి భోజనం చేస్తా డని తెలుసుకుంటాం. ఈ విధంగా ఒక ఫలితాన్ని పట్టి దాని కారణాన్ని ఊహించడం అర్థాపత్తి. "ఇక్కడ

ఘటం లేదు. ఉంటే కనబడేది కదా" అన్నప్పుడు ఘటం లేదని చెప్పడానికి ప్రమాణం అది అక్కడ కనబడకపోవడం. ఇది అనుపలబ్ధి ప్రమాణం.

మీమాంసాసిద్ధాంతం ప్రకారం వేదాలు అపౌరుషేయాలు. అనగా పురుషనిర్మితాలు కావు. ఇవి అనాదిగా వస్తున్నాయి. అందుచేత వీటిలో పురుషబుద్ధికి సంబంధించిన దోషా లేవీ ఉండడానికి అవకాశం లేదు. అందుచేత ఇవి పరమప్రమాణం. "ఇలా చెయ్యాలి" అని వేదంలో విధించినదంతా ధర్మం. ఇలా చేయకూడదు అని నిషేధించినది అధర్మం. అందుచేత వేదవిహితాలైన స్వధర్మాలను (కర్మలను) ఆచరిస్తూనే ఉండాలి. ఇలా స్వధర్మానుష్ఠానం చేయగా చేయగా కర్మబంధా లన్నీ నశించి మోక్షం లభిస్తుంది. మోక్షం అవిచ్ఛిన్నానందరూపమైన దని కొందరు మీమాంసకుల అభిప్రాయం. స్వధర్మానుష్ఠానంచేత జన్మరాహిత్యం, తద్వారా సర్వదుఃఖవినాశం కలుగుతుందని మరికొందరి మతం. ప్రాచీనమీమాంసకులు స్వధర్మానుష్ఠానంచేత స్వర్గం లభిస్తుందని అంగీకరించగా తరువాతివారు నిష్కామకర్మచేత మోక్షం కలుగుతుందని అంగీకరించారు.

ఆత్మ జన్మ-మరణరహితం, నిత్యం. ఆత్మకు జ్ఞానం సహజం కాదు. ఈ ఆత్మ దేహేంద్రియాదులతో సంబంధించి ఉండి విషయాలను గ్రహించే సమయంలోనే జ్ఞానం కలుగుతుంది. దేహభేదాన్ని పట్టి జీవులు కూడ భిన్నులుగా ఉంటారు. కనబడుతూన్న ఈ జగత్తంతా సత్యమైనది. దీనికి ఆది కాని అంతం కాని లేదు. అన్ని కాలాలలోను జగద్వ్యవహారం ఈ విధంగానే సాగుతూ ఉంటుంది. అందుచేత జగత్సృష్ట్యాదుల నిమిత్తం భగవంతు డొక డున్నాడని అంగీకరించవలసిన పని లేదు. జీవుల కర్మల ననుసరించి ప్రపంచంలోని పదార్థాలు పుడుతుంటాయి. కర్మయే సర్వశక్తమై లోకవ్యవహారాన్ని నడుపుతున్నది.

మానవుడు ఇక్కడ చేసిన కర్మలచేత అతని ఆత్మలో ఒక శక్తి పుట్టుచున్నది. దీనికి అపూర్వం అని పేరు. చేసిన కర్మ నశించి పోయినా జీవుణ్ణి అంటి బెట్టుకొని ఉన్న ఈ అపూర్వం దేశాంతరకాలాంతరాలలో ఈ జీవునికి ఆ యా ఫలాలు ఇస్తుంది. ఈశ్వరాస్తిత్వాన్ని అంగీకరించకపోయినా వేదప్రామాణ్యస్థాపకు లవడంచేత పూర్వమీమాంసకులు ఆస్తికులుగా పరిగణింపబడుతున్నారు.

పైన చూచిన విధంగా ఆస్తికదర్శనాలన్నీ చాల కాలం క్రితం ఆ యా మునులు, ఆచార్యులు రచించిన సూత్రాలతో ప్రారంభ మైనట్లు చెప్పినా వాటి

మూలాలు ఎంతో కాలానికి పూర్వమే వివిధరూపాలలో ఉండి ఉండాలి. వాటిని ఆ యా ఆచార్యులు సూత్రరూపంలో నిబంధించగా తరువాతి ఆచార్యులు ఆసూత్రాలకు భాష్యాలు, వాటిపై టీకోపటీకాదులు రచించడంతో ఒక్కొక్క దర్శనం అతివిస్తృతరూపంలో పెరిగిపోయింది. అందుచేత ఆ యా దర్శనాలు ప్రస్తుతం లభ్యం అవుతున్న సూత్రగ్రంథాలతోనే ప్రారంభం అయ్యాయి అని భ్రాంతి పడకూడదు. తమకు పూర్వమే బహుళ ప్రచారంలో ఉన్న సిద్ధాంతాలను తాము సూత్ర రూపంలో క్రోడీకరించి నట్లు అ యా సూత్రకారులే తమ దర్శనాలలో సూచించి ఉన్నారు. అయితే ప్రస్తుతం లభించే అతిప్రాచీనరూపాలు సూత్రాలే గాన ఈ శాస్త్రాలు సూత్రాలతో ప్రారంభం అయినట్లు చెపుతున్నాం.

"సూత్రసూక్ష్మోద్గమా భాష్యాపూరా ధీక్షేత్రవాహినీః,
టీకోపటీకాశాఖాఢ్యా వన్దే శాస్త్రమహానదీః" (పు. శ్రీ.రా)

అని వర్ణించిన ఏ ఒక్క శాస్త్రమహానదిని చూచినా దాని విస్తృతిని తెలుసుకొనడానికి ఒక పురుషాయుషం సరిపోదు. ఇంతటి విశాలదర్శనవాఙ్మయం, అది ఆస్తికదర్శనవాఙ్మయం కావచ్చు, నాస్తికదర్శనవాఙ్మయం కావచ్చు, ఒక్క భారతదేశంలోనే కనబడుతుంది.

**6. ఉత్తరమీమాంస లేదా వేదాంతం:** వేదాల చివరిభాగాలైన ఉపనిషత్తుల అర్థాన్ని నిర్ణయించడానికి రచించిన శాస్త్రానికి **ఉత్తరమీమాంస** అని పేరు. ఉపనిషత్తులు వేదాల అంతాలు గాన ఈ శాస్త్రానికి ఉత్తరమీమాంస అనే పేరుకంటె కూడ వేదాంతం అనే పేరు బహుళప్రచారంలో ఉంది. అందులోనూ వేదాంతం అనగానే అద్వైతవేదాంతమే అని కూడ చాల కాలం నుంచి నేటి వరకూ లోకంలో అత్యధికమైన ప్రచారం ఉంది. కార్ల్ హెచ్ పాట్టర్ చెప్పినట్లు అద్వైతేతరసంప్రదాయస్థులకు విసుపు, కినుక కలిగేటంత ప్రచారంలో ఉంది.

" This System is properly known as Advaita Vedanta, though so important has it become in the eyes not only of scholars but also of those who have been influential in moulding the atitudes of enlightened Hindus to ward India's past, that one will frequently find the term "Vedanta" used to indicate only Advaita Vedanta. This tendency is a confusion to the uninitiated as well as a constant source of irritation to those who are

affiliated with one or the other Vedanta Systems. Still, it serves to emphasise the importance that is now attributed to Advaita among the Vedantas, and especilly that attributed to its most famous figure Sankracharya..." (Encyclopedia of Indian Phisolophy. (Vol. III P.6)

ఈ విధంగా వేదాంతం అనగా అద్వైతసిద్ధాంతమే అనే ప్రచారం కలగడానికి కొన్ని కారణాలు లేకపోలేదు. ప్రతీ దర్శనంలోను తన సిద్ధాంతం స్థాపించే సందర్భంలో ఇతరదర్శనాలలోని అంశాలను కూడ ఖండనమండనాలకోసం పరామర్శించడం జరుగుతూంటుంది. ఈ ప్రవృత్తి అన్ని దర్శనాలలోనూ, (ఆస్తికనాస్తికదర్శనాలలో) కనబడుతుంది. అందుచేతనే సూక్ష్మరూపంలో ప్రారంభమైన ప్రతీదర్శనమూ కూడ కాలక్రమంలో అతివిస్తృతరూపాన్ని పొందింది. ఈ విధంగా పరామర్శించే సందర్భంలో బౌద్ధజైనన్యాయవైశేషికసాంఖ్యాదిదర్శనాలలో బాదరాయణసూత్రప్రతిపాదిత వేదాంతదర్శనం అనే పేరుతో అద్వైతసిద్ధాంతాన్ని పేర్కొనడం జరిగింది. వాటిలోనే కాదు ఆళ్వారులు మొదలైన వారి రచనలలో కూడ అద్వైతసిద్ధాంతపరామర్శ కనబడుతుంది. వేదాంతం అనే పేరుతోనే వాళ్ళు కూడ ఈ దర్శనాన్ని నిర్దేశించారు. ఇది మొదటి కారణం. రెండవ కారణ మేమనగా జైమిని వేదపూర్వభాగాల వ్యాఖ్యానపద్ధతిని సూచించడానికై పూర్వమీమాంసాసూత్రాలు రచించి నట్లు బాదరాయణుడు, ఉపనిషద్వాక్యవ్యాఖ్యావిధానాన్ని నిర్ణయించడానికై బ్రహ్మసూత్రాలను, ఉపనిషత్తులలో ప్రసిద్ధమైన బ్రహ్మశబ్దాన్ని ఉపయోగించి "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అనే సూత్రంతో ప్రారంభించి రచించాడు. దాని కీ నాడు లభిస్తూన్న సర్వాంగసంపూర్ణమైన అతిప్రాచీనమైన భాష్యం శ్రీ శంకరభగవత్పాదులు రచించిన శారీరకమీమాంసాభాష్యమ్. ఉపనిషత్తులను, అక్కడక్కడ సంహితాభాగాలలో కూడ కనబడే ఉపనిషదర్థప్రతిపాదక వాక్యాలను, ఉపనిషదర్థానువాదకాలైన స్మృతి వాక్యాలను, (మహాభారతంకూడ స్మృతిగా పరిగణింపబడినది) ఉపనిషదర్థానుగుణాలైన పురాణవాక్యాలను (వీటిని చాల అరుదుగా ఉదాహరించడం జరిగింది) ప్రమాణంగా చూపుతూ శ్రీ శంకరభగవత్పాదులు ఈ సూత్రభాష్యం నిర్మించారు. ఈ సూత్రాలు ఉపనిషద్వాక్యకుసుమగ్రథనం కోసం మాత్రమే ఉద్దిష్టమైన వని ప్రారంభంలోనే స్పష్టీకరించారు. తమ తమ పరిధులలో ప్రామాణికత్వమూ, ఉపయోగిత్వమూ ఉన్న ఎన్నో ఆగమాలు ఉన్నా కూడ ఔపనిషదమైన అద్వైతసిద్ధాంతానికీ వాటికీ ఏ మాత్రం

సంబంధం లేకపోవడంచేత వాటి అర్థాలను సూత్రార్థాలలో చొనిపి సూత్రాలకి వక్రభాష్యం చేసే ప్రయత్నం చేయలేదు. అందుచేత ఈ సిద్ధాంతం ఔపనిషదంగానే, వేదాంతంగానే, ఉండేటట్లు చేయకలిగారు. ఈ అద్వైతసిద్ధాంతానికి ఏకైకమైన అధారం ఉపనిషత్తులు, తదనుసారులైన స్మృతులూ మాత్రమే. (శంకరసంప్రదాయానికి స్మార్తసంప్రదాయం అనే పేరు రావడానికి కారణం కూడ ఈ ఆగమతంత్రాదులనుండి దూరంగా ఉండడమే). వేదాంతం అనగానే అద్వైతం అని ప్రచారం కలగడానికి ఇది రెండవ కారణం.

బ్రహ్మసూత్రాలు: వేదాంతానికి మూలగ్రంథం బ్రహ్మసూత్రాలు. ఇవి బాదరాయణునిచేత రచింపబడినవి. బాదరాయణుడు అనేది వ్యాసుని మరొక పేరని, వ్యాసుడే ఏతత్సూత్రరచయిత అని సాంప్రదాయికుల విశ్వాసం. బాదరాయణుడు వేరు, ఇతని కాలం క్రీస్తుకు పూర్వం లేదా తరవాత ఒకటి రెండు శతాబ్దాలు కావచ్చును అని కొందరు అధునిక పండితుల ఊహ. ఇవన్నీ ఊహలే. నిశ్చితంగా ఏదీ చెప్పడానికి శక్యం కాదు. అయితే శ్రీశంకరభగవత్పాదులు ఎక్కడా కూడ ఇవి వ్యాసరచితా లని చెప్పకపోవడం గమనార్హం. బ్రహ్మసూత్రాలకు చాలకాలం పూర్వం వేదాంతసంప్రదాయం దానికి సంబంధించిన వివిధ సిద్ధాంతాలు ఉన్నా యని ఈ సూత్రాలవల్లనే తెలుస్తుంది. కాని ఆ యా సంప్రదాయాలకి సంబంధించిన, (ఈ సూత్రాలలోనే చెప్పిన) కొందరు ఆచార్యుల పేర్లు మాత్రమే తప్ప వారి గ్రంథా లేవీ లభ్యములు కావు.

### ప్రాచీనులైన బ్రహ్మసూత్రవ్యాఖ్యాతలు

శ్రీ శంకరభగవత్పాదులకు పూర్వం ఉన్న కొందరు వేదాంతదార్శనికుల పేర్లు ఇతర గ్రంథాల ద్వారా తెలుస్తున్నాయి. వారి గ్రంథాలు లభించడం లేదు. వారిలో కొందరు బాదరాయణసూత్రాలకు వృత్తులు - అనగా సంక్షిప్తవ్యాఖ్యలు, వ్రాసినట్లు తెలుస్తూన్నది. వాటి స్వరూపస్వభావాలు కూడ అనుమానమాత్రగమ్యములే కాని వాటిని గూర్చి ఇదమిత్థంగా తెలుసుకొనదగిన ఆధారాలేవీ లేవు. ఉపవర్షుడు, బోధాయనుడు ద్రవిడాచార్యుడు, బ్రహ్మనంది, బ్రహ్మదత్తుడు, భర్తృమిత్రుడు, భర్తృప్రపంచుడు, టంకుడు, గుహదేవుడు, భారుచి, కపర్ది, సుందరపాండ్యుడు అనేవి అలాంటి పేర్లలో కొన్ని. శ్రీశంకరభగవత్పాదులు ఉపవర్షుని పేరు అత్యధికమైన గౌరవాదరాలతో, బ్రహ్మసూత్రభాష్యంలోని దేవతాధికరణంలో "**భగవాన్ ఉపవర్షః**" అని ("**వర్ణా ఏవ తు శబ్దః ఇతి భగవానుపవర్షః**" బ్ర.సూ. 1.3.28) నిర్దేశిస్తారు. పైన చెప్పినవారందరిలోకీ

ఉపవర్షుడు ప్రాచీను డన్నట్లు కనబడుతుంది. ఈయన శబరస్వామికి పూర్వం పూర్వమీమాంసాసూత్రాలకి కూడ వృత్తి రచించాడు. ఈ విధంగా జైమినిసూత్రాలకీ, బ్రహ్మసూత్రాలకీ కూడ వృత్తి వ్రాసి ఉండడంచేత ఈయన వృత్తికారుడు అనే పేరుతో ప్రసిద్ధి పొందాడు. బోధాయనుడు కూడ రెండు మీమాంసల మీద వృత్తి వ్రాసినట్లు కనబడుతుంది. అందుచేత ఈయనను కూడ తరువాతి వ్యాఖ్యాతలు వృత్తికారుడు అని నిర్దేశించడం ఉంది. శబరస్వామి కాలం క్రీ.శ. 200 ప్రాంతం అని నిర్ణయించడంచేత ఉపవర్షుడు క్రీ.పూ. 100, క్రీ.శ. 200 మధ్యలో ఉండి ఉండవచ్చునని కొందరి ఊహ. ఉపవర్షుడు, బోధాయనుడు ఒకే వ్యక్తి అని శ్రీభగవద్రామానుజులు, శ్రీవేదాంతదేశికులు మొదలైనవారి అభిప్రాయం. కాని వారు వేరు వేరు వ్యక్తులనీ, శ్రీ శంకరభగవత్పాదులు స్వీకరించిన సంప్రదాయానికి చెందిన ప్రాచీనాచార్యులలో ఉపవర్షు డొకడనీ, అక్కడక్కడ శ్రీ శంకరభగవత్పాదులు ఖండించిన మతం బోధాయనుని మతం అనీ విమర్శకుల అభిప్రాయం (E.I. Ph. Vol III P/11), శ్రీ శంకరభగవత్పాదులు ఉపవర్షబోధాయనుల మతాలను ఉదాహరించిన తీరును పట్టి చూడగా ఆయన ఆ రెండు గ్రంథాలనూ చూచి నట్లు కనబడుతుంది. కాని శ్రీ భగవద్రామానుజుల కాలంనాటికి అవి అలభ్యములై ఉండాలి. "విస్తీర్ణాం బోధాయనవృత్తిం పూర్వాచార్యాః సంచిక్షిపుః. తన్మతానుసారేణ సూత్రాక్షరాణి వ్యాఖ్యాస్యన్తే" (శ్రీ భాష్యం 1.1.1) (విస్తృతమైన బోధాయనవృత్తిని ప్రాచీనాచార్యులు సంక్షిప్తం చేశారు. వారి మతాన్ని అనుసరించి సూత్రాలకు వ్యాఖ్య వ్రాయబడుచున్నది) అని శ్రీభగవద్రామానుజులు వ్రాయడంచేత ఆయనకు బోధాయనవృత్తి లభించలేదనే చెప్పాలి. అది లభించి ఉన్నట్లయితే "తన్మతానుసారేణ" అనికాకుండా "తదనుసారేణ" అని ఉండేవారు అని కొందరు పండితుల అభిప్రాయం. (వ్యాససంమతబ్రహ్మసూత్రభాష్యనిర్ణయః. పేజి. 7). ఏది ఏమైనా ఈ పూర్వాచార్యులలో ఎవరు ఏ మతాన్ని ప్రతిపాదించారు, తరువాతి ఆచార్యులు ఏ పూర్వాచార్యుల మతాలను ఎంత వరకు అనుసరించారు అని నిశ్చితంగా చెప్పడం కష్టం. ఊహాగానాలకు అంతం ఉండదు. ద్వైతవాదం, అద్వితీయాత్మవాదం, భేదాభేదవాదం, పూర్వోత్తరమీమాంసైకశాస్త్రత్వవాదం, భిన్నశాస్త్రత్వవాదం, జ్ఞానకర్మసముచ్చయవాదం, జ్ఞానమాత్రైకసాధనతావాదం, ఇలాంటి ఎన్నో మతభేదాలు ఆ యా ప్రాచీనాచార్యుల గ్రంథాలలో ఉండి ఉంటాయి; వాటినే తరువాతి ఆచార్యులు స్వస్వసిద్ధాంతానుగుణంగా మలచుకొని ప్రతిపాదించి ఉంటారు అని మాత్రం గ్రహించి

మనం సంతోషపడాలి. కాని ఒక్క తథ్యం మాత్రం అంగీకరించాలి- శ్రీ శంకరభగవత్పాదరచితమైన సూత్రభాష్యం, గీతోపనిషద్భాష్యాలు ప్రచారంలోనికి రావడంతో ప్రాచీనచార్యుల రచన లన్నీ నామమాత్రావశిష్టాలై తరవాత వచ్చిన పండితులు అక్కడక్కడ లభించే వాళ్ల మతాంశాలను తీసికొని పరస్పర ఖండనమండనాదులు చేసుకొనడానికీ, ఆధునికవిమర్శకులు ఎన్నో విమర్శనగ్రంథాలు, అల్పనిబంధాలు రచించడానికీ ఉపయోగిస్తున్నాయి.

శ్రీశంకరభగవత్పాదులు: భగవత్పాదుల కాలాన్ని గూర్చి అభిప్రాయభేదాలు చాలా ఉన్నాయి. కొందరి అభిప్రాయం ప్రకారం శ్రీ శంకరభగవత్పాదులు క్రీస్తుకు పూర్వం 508నుండి 476 దాకా ఉన్నారు. ఐతిహాసికుల ప్రకారం వీరి కాలం క్రీస్తు శకం 788 నుండి 820. శ్రీ శంకరభగవత్పాదులు మీమాంసకాగ్రేసరుడైన కుమారిలభట్టును కలిసికొన్నట్లు కథ లున్నాయి. కుమారిభట్టు కాలం క్రీ.శ. 600-670. ఆ కథలే నిజమైతే శ్రీశంకరభగవత్పాదుల కాలం క్రీ.శ. 650-700 ప్రాంతం కావచ్చు నని పండితుల ఊహ. (Life and works of Sankaracharya by G.C. Pande, P. 52.)

శ్రీ శంకరభగవత్పాదులు దాదాపు నాలుగు వందల గ్రంథాలు రచించి నట్లు ప్రసిద్ధి. వీటిలో ఏవి నిజంగా ఆదిశంకరులు రచించినవో ఏవి తన్నామధారులైన ఇతరులు రచించినవో చెప్పడం కష్టం. ఆ విషయంలో చాలమంది విమర్శకులు పరిశ్రమ చేసి కొన్ని నిర్ణయాలు చేసి ఉన్నారు. అద్వైతసిద్ధాంతసుస్థిరతాసంపాదకులైన శ్రీ శంకరభగవత్పాదులే రచించినట్లుగా నిశ్చితంగా చెప్పదగినవి బ్రహ్మసూత్రభాష్యం, భగవద్గీతాభాష్యం, కొన్ని ఉపనిషత్తులమీద భాష్యాలు. ఉపదేశ సాహస్రి, వివేకచూడామణి, సర్వవేదాన్త సిద్ధాంత సారసంగ్రహం మొదలైన కొన్ని ప్రకరణ గ్రంథాలు, దక్షిణామూర్తిస్తోత్రం మొదలైన కొన్ని స్తోత్రాలు కూడ వీరివే అని నిస్సంశయంగా చెప్పవచ్చును. పై మూడు భాష్యాలకు ప్రస్థానత్రయం అనిపేరు.

బ్రహ్మసూత్రభాష్యం: భాషాసౌందర్యంలోను, రచనాచాతుర్యంలోను, క్లిష్టవిషయస్పష్టీకరణంలోను, పఠితృమానసోల్లాసనంలోను ఈ భాష్యాని కిదే సాటి. ఈ భాష్యంలో శారీరకుని, అనగా జీవుని, స్వరూపాన్ని గూర్చి చర్చించి అది నిర్ణయించబడినదిగాన దీనికి 'శారీరకమీమాంస' అని కూడ పేరు. బ్రహ్మసూత్రాలలో ప్రతిపాదించబడిన విషయాల సంక్షిప్తస్వరూపం ఇది. ప్రథమాధ్యాయానికి సమన్వయాధ్యాయం అని పేరు. అన్ని వేదాంతాలకూ (ఉపనిషత్తులకూ) కూడ

అద్వితీయబ్రహ్మను ప్రతిపాదించడంలోనే తాత్పర్యం అని నిరూపించడానికై ఈ అధ్యాయంలో ఉపనిషద్వాక్యాల అర్థనిర్ణయం చేయబడింది. ఇందుకొరకై కొన్ని ప్రధానోపనిషత్తులలోని కొన్ని వాక్యాలు ఉదాహరించి వీటికి బ్రహ్మపరంగా అర్థం చెప్పాలా, లేక మరొకవిధంగా చెప్పాలా అని వివిధయుక్తి ప్రదర్శన పూర్వకంగా చర్చించి బ్రహ్మపరంగానే అర్థం చెప్పాలి అని నిర్ణయం చేయబడింది. ఇక్కడ ఉదాహరించని ఇతర వాక్యాలను కూడ ఈ పద్ధతినే అనుసరించి బ్రహ్మపరంగా వ్యాఖ్యానించాలి అని గ్రహించాలి. ఈ విధంగా ఒక్కొక్క అధికరణంలో ఒక్కొక్క నిశ్చితమైన పద్ధతి చూపబడుతుంది. ఈ పద్ధతికి న్యాయం అని పేరు. ఒక న్యాయం పోలిక లున్న ఇతర స్థానాలలో కూడ అన్వయిస్తుంది. (అధికరణంలో ఒక సూత్రం ఉండవచ్చు, రెండు మూడు సూత్రాలు ఉండవచ్చు ఇంకా అధికసంఖ్యలో కూడ ఉండవచ్చు). ద్వితీయాధ్యాయానికి **అవిరోధాధ్యాయం** అని పేరు. దీనిలో సాంఖ్యాదుల తర్కాలతో అద్వైతసిద్ధాంతానికి విరోధం లేదు అని ప్రతిపాదించబడింది. అనగా సాంఖ్యాదితర్కాలకు ప్రామాణ్యం ఉంటే వాటితో అద్వైతసిద్ధాంతానికి విరోధం ఉంటుంది గాన ఈ సిద్ధాంతాన్నే మార్చుకోవా లని చెప్పడానికి అవకాశం ఉంటుంది. వాటికి ప్రామాణ్యమే లేనప్పుడు వాటితో విరోధం ఏమిటి అని అవిరోధం అనడంలోని భావం. తృతీయాధ్యాయానికి **సాధనాధ్యాయం** అని పేరు. దీనిలో బ్రహ్మవిద్యాసాధనాలు చెప్పబడ్డాయి. బ్రహ్మవిద్యాఫలాన్ని ప్రతిపాదించే చతుర్థాధ్యాయానికి ఫలాధ్యాయం అని పేరు. ప్రథమాధ్యాయప్రథమపాదంలో స్పష్టలింగాలైన, అనగా ఈ వాక్యంలో ప్రతిపాదించబడేది బ్రహ్మయే అని చెప్పడానికి తగిన లింగాలు (గుర్తులు) స్పష్టంగా ఉన్న, ఉపనిషద్వాక్యాల విచారణ చేయబడింది. ద్వితీయపాదంలో ఉపాస్యబ్రహ్మను బోధించే అస్పష్టబ్రహ్మలింగాలైన ఉపనిషద్వాక్యాల విచారణ చేయబడింది. చతుర్థపాదంలో 'అవ్యక్త' 'అజా' మొదలైన సందిగ్ధార్థాలైన కొన్ని పదాల చర్చ చేయబడింది. ద్వితీయాధ్యాయప్రథమపాదంలో సాంఖ్య -యోగ-కణాదాదిస్మృతులతో ఉన్న విరోధానికి పరిహారం చూపబడింది. తృతీయపాదంలో పంచమహాభూతశ్రుతులకు, జీవశ్రుతులకు మధ్య విరోధం పరిహరించబడింది. నాల్గవ పాదంలో లింగశరీరాన్ని గూర్చిన శ్రుతుల మధ్య విరోధం పరిహరించబడింది. తృతీయాధ్యాయప్రథమపాదంలో జీవుని పరలోకగమనాదుల వర్ణనద్వారా వైరాగ్యం బోధించబడింది. రెండవ పాదంలో త్వంపదార్థ (జీవాత్మ) తత్పదార్థాల (పరమాత్మల)

స్వరూపం నిరూపించబడింది. మూడవ పాదంలో సగుణోపాసనను విధించే వాక్యాలలో, కొన్నింటిలో చెప్పిన గుణాలను లేదా ధర్మాలను మరికొన్నింటిలోనికి చేర్చే విధానం విశదీకరించబడింది. ఈ విధానానికి గుణోపసంహారం అనిపేరు. చతుర్థపాదంలో నిర్గుణబ్రహ్మవిద్యకు అంతరంగాలు, బహిరంగాలు అయిన ఆశ్రమ - యజ్ఞ - శమాదిసాధనాల చర్చ చేయబడింది. చతుర్థాధ్యాయప్రథమపాదంలో -జీవించి ఉండగానే బ్రహ్మసాక్షాత్కారం కలిగినవాని పుణ్యపాపక్లేశాదులు ఎట్లు తొలగిపోతాయో చెప్పబడింది. ద్వితీయపాదంలో మరణం, బైటకు పోవడం మొదలైన విషయాలు చెప్పబడ్డాయి. చతుర్థపాదంలో నిర్గుణబ్రహ్మసాక్షాత్కారం పొందేవాడు విదేహముక్తి పొందడం, సగుణబ్రహ్మోపాసకుడు బ్రహ్మలోకంలో నివసించడం చెప్పబడ్డాయి.

### శంకరభాష్యవ్యాఖ్యలు

బ్రహ్మసూత్రశాంకరభాష్యంమీద ఎన్నో వ్యాఖ్యోపవ్యాఖ్యానాలు బయలుదేరాయి. శ్రీ శంకరభగవత్పాదుల ప్రధానశిష్యచతుష్టయంలో ఒకరైన శ్రీ పద్మపాదాచార్యులు పంచపాదిక అనే ఒక వ్యాఖ్య రచించారు. ఇది చతుఃసూత్రికి మాత్రమే లభిస్తున్నది. చతుఃసూత్ర్యంతమైన ఈ పంచపాదికకు ప్రకాశాత్మయతి (1200) **పంచపాదికావివరణం** అనే అతివిస్తృతమూ, ప్రామాణికమూ, అనేకవ్యాఖ్యాతలకు ఉపజీవ్యమూ అయిన వ్యాఖ్యానం రచించారు. ఈ వివరణానికి విష్ణుభట్టోపాధ్యాయుడు **ఋజువివరణం** అనే వ్యాఖ్యను, అఖండానందముని **తత్త్వదీపనం** అనే వ్యాఖ్యా రచించారు. నృసింహానందముని (1500) **వివరణభావప్రకాశిక** అనేవ్యాఖ్య రచించారు. అమలానందుడు పంచపాదికకు **పంచపాదికాదర్పణం** అనే వ్యాఖ్య విద్యాసాగరుడు **పంచపాదికాటీకా** అనే వ్యాఖ్య రచించారు. ఈ విధంగా బయలుదేరిన పంచపాదికాదివ్యాఖ్యోపవ్యాఖ్యాప్రస్థానానికి వివరణప్రస్థానం అని పేరు. క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దికి చెందిన వాచస్పతిమిశ్రు డనే మహాదార్శనికుడు (841 ఎ.డి. ప్రాంతం) శంకరభాష్యానికి **భామతి** అనే అతిరుచిరమైన, విషయప్రతిపాదనలో సాటి లేని వ్యాఖ్య రచించాడు. అంఖండానందుడు, (బహుశా ఇతడు తత్త్వదీపనరచయితయే అయి ఉండవచ్చును) భామతిపై **ఋజుప్రకాశిక** అనే వ్యాఖ్య రచించాడు. అమలానందసరస్వతి (1247-1260) భామతికి **కల్పతరువు** అనే

విస్తృతమూ, వాచస్పతినిగూఢభావస్పష్టీకరణసమర్థమూ అయిన వ్యాఖ్య రచించాడు. ప్రసిద్ధమహావిద్వాంసుడైన శ్రీమదప్పయ్యదీక్షితేంద్రుడు కల్పతరువుకు పరిమలం అనే సువిస్తృతమై పూర్వమీమాంసావాక్యవిశ్లేషణచణమైన వ్యాఖ్య రచించారు. ఈ కల్పతరువుకే లక్ష్మీనృసింహపండితుడు ఆభోగం అనే వ్యాఖ్య రచించాడు. అల్లాలసూరి అనే పండితుడు భామతికి భామతీతిలకం అనే వ్యాఖ్య రచించాడు. ఈ విధంగా శంకరభాష్యంమీద వెలువడిన ఈ వ్యాఖ్యోపవ్యాఖ్యలకు భామతీప్రస్థానం అని పేరు. ఇవి కాక చిత్సుఖముని రచించిన భాష్యభావప్రకాశిక, నారాయణసరస్వతి రచించిన వార్తికం అనే వ్యాఖ్య, ఆనందగిరి రచించిన న్యాయనిర్ణయం అనే వ్యాఖ్య, గోవిన్దానన్దయతి రచించిన రత్నప్రభ అనే వ్యాఖ్య ప్రసిద్ధమైనవి. ఆనందగిరి శ్రీ శంకరభగవత్పాదులు రచించిన సూత్రభాష్య - గీతాభాష్య - ఉపనిషద్భాష్యాలకే కాక వారి కొన్ని శతశ్లోక్యాదిప్రకరణగ్రంథాలకి కూడ వ్యాఖ్యలు వ్రాశారు. మూలంలో ఉన్న భావాన్ని అవతారికలలోనే సుస్పష్టంగా ప్రతిపాదిస్తూ విషయవివేచనం చేయడంలో ఈయనకు ఈయనయే సాటి. వివరణమార్గాన్ని అనుసరించి రచించిన రత్నప్రభలోని చతుః సూత్ర్యంతభాగానికి పూర్ణప్రకాశానందసరస్వతి అభివ్యక్త అనే వ్యాఖ్యానం రచించాడు. దీనికి పూర్ణానందీయం అని ప్రసిద్ధి. రత్నప్రభకు రామానందీయం అని ప్రసిద్ధి ఉంది. దీని రచయిత పేరు రామానందుడనీ, వీరి గురువు గోవిందుడనీ కొందరంటారు. రత్నప్రభాకారుడు పూర్వాశ్రమంలో ధర్మసూరి అనే పేరు గల ఆంధ్రదేశీయుడైన పండితు డని ప్రసిద్ధి ఉంది. రత్నప్రభావ్యాఖ్యానం అతిసరళమైనది. భాష్యభావాన్ని తెలుసుకొనడానికి బాగా ఉపకరిస్తుంది. అందుచేత దీనికి వేదాంతశాస్త్రాధ్యయనం చేసేవారిలో అతి విస్తృతమైన ప్రచారం ఉంది.

శ్రీ శంకరభగవత్పాదుల తరవాత బయలుదేరిన కొన్ని సంప్రదాయాలవారు, ముఖ్యంగా విశిష్టాద్వైతసంప్రదాయానికి చెందిన శ్రీ భగవద్రామానుజ శ్రుతప్రకాశికాకార - శ్రీమద్వేదాంతదేశికాదులు శాంకరభాష్యంలో ఉద్భావనచేసిన కొన్ని దోషాలను సమూలంగా నిర్మూలిస్తూ శ్రీమదద్వైతానందస్వామి బ్రహ్మవిద్యాభరణం అనే అతివిస్తృతమూ, వివిధశాస్త్రార్థగభీరమూ అయిన వ్యాఖ్య రచించారు. ఈయన రత్నప్రభాకారులైన శ్రీరామానందయతీంద్రుని శిష్యుడు. దీనికి అస్మదాచార్యవర్యులైన

శ్రీ యస్.ఆర్. కృష్ణమూర్తి శాస్త్రి గారు చక్కని టీక రచించారు. బ్రహ్మవిద్యాభరణంలో ఏ విషయం ఎవరి ఆక్షేపణకి సమాధానంగా చెప్పబడిందో తెలియని స్థలాలలో (అందుకు కారణం వ్యాఖ్యాత ప్రతిపక్షి పేరు పేర్కొనకుండా సమాధానాలు చెప్పడం) వీరి టీక బాగా ఉపయోగపడుతుంది. ఇవే కాక శంకరభాష్యానికి ప్రకటార్థవివరణం మొదలైన ఇంకా ఎన్నో ప్రామాణికమైన వ్యాఖ్యలు కొన్ని ముద్రితాలు, కొన్ని అముద్రితాలు ఉన్నాయి.

## ప్రక్రియాభేదాలు

వేరు వేరు ప్రస్థానాలు, ప్రక్రియాభేదాలు, వివిధ వ్యాఖ్యలూ, వాటిలో కనబడే వేరు వేరు సమన్వయాలూ, వీటిని చూచి కొందరు అద్వైతసిద్ధాంతప్రతిపాదకులలో ఐకమత్యమే లేదని ఆక్షేపిస్తూంటారు. ఇది అవిచారితమణీయమైన ఆక్షేపం. విషయం సామాన్యబుద్ధిమంతులు అర్థంచేసికొనడానికి శక్యంకాని దైనప్పుడు దానిని ఏదో విధంగా బోధించడానికి అనేక ప్రక్రియలు అవలంబించవలసి ఉంటుంది. ప్రధానసిద్ధాంతంలో ఏమీ భేదం లేదు. ఉన్న భేదం అల్లా ప్రక్రియలలో మాత్రమే; ఆ సిద్ధాంతాన్ని అర్థం చేసికొనడానికి చూపిన ఉపాయాలలో మాత్రమే. "నువ్వు ఏ విధమైన శక్తీ లేని అల్పజ్ఞుడవు. పరమాణువువు. నువ్వు శాశ్వతమైన సుఖం పొందాలంటే, దుఃఖవిముక్తుడవు కావాలంటే నీకంటె చాల గొప్పవాడైన పరమేశ్వరుణ్ణి ఆశ్రయించాలి. సేవించాలి" అని భోధిస్తే ప్రతీవాడికి అనాయాసంగా అర్థం అవుతుంది. పుట్టింది మొదలు చేస్తూన్నది వాళ్లనీ వీళ్లనీ ఆశ్రయించి ఏవేవో లాభాలు పొందుతూండడమే ౘదా? అలాంటివానికి ప్రారంభదశలో, చాల గొప్పవాడైన భగవంతు డనేవా డొక డున్నాడు; అతని నాశ్రయించాలి అని చెప్పడం అవసరమే. దానికి ఒక అడుగు ముందు వెళ్లి నువ్వు పరమాణువు కాదు; సర్వజ్ఞుడు, సర్వశక్తుడూ అయిన ఏ పరమాత్మ ఉన్న దని వింటున్నామో ఆ పరమాత్మ నువ్వే. ఈ ప్రపంచం వెనక ఉన్న పరమార్థతత్త్వం కూడ ఈ పరమాత్మయే. ఆ తత్త్వం ఒక్కటే అని చెప్పేటప్పటికి అతని కేమీ అర్థం కాదు. ఈ విషయం అతనికి అర్థం చేయించడానికి ఎన్నో పద్ధతు లవలంబించాలి. ఉపాయాలు చూడాలి. ఒక విషయాన్ని బోధించడానికి అనేకదృష్టాంతాలను చూపడం అనే పద్ధతి ఉపనిషత్తులలోనే అనేకస్థానాలలో కనబడుతుంది. వాటినే భగవత్పాదులు

తమ భాష్యాలలో సూచించగా వాటిని వ్యాఖ్యాతలు స్పష్టీకరించడంలో తప్పేమీ లేదు. వాటి అన్నింటి పరమలక్ష్యం అద్వైతసిద్ధాంతబోధనమే. బింబప్రతిబింబవాదం, అవచ్ఛేదవాదం, అభానవాదం, ఏకజీవవాదం, అనేకజీవవాదం, మాయాఽవిద్యాభేదవాదం, మాయాఽవిద్యైక్యవాదం, మొదలైన ప్రక్రియలన్నీ ఇలాంటివే. పరమసిద్ధాంతాన్ని అర్థం చేసుకొనడానికి ఉపకరించినంతవరకు ఈ ప్రక్రియలన్నీ పరస్పరవిరుద్ధాలైనా గ్రాహ్యములే. చివరికి, ప్రధానలక్ష్యం సాధించిన తరవాత ఇవన్నీ అవసరం లేకపోతే త్యాజ్యమైనవే అని వార్తికకారులు స్పష్టీకరించారు.

"యయా యయా భవేత్పుంసాం వ్యుత్పత్తిః ప్రత్యగాత్మని,
సా సైవ ప్రక్రియా జ్ఞేయా సాధ్వీ, సా చానవస్థితా"

ఈ విషయాన్నే దృష్టిలో ఉంచుకొని అప్పయ్యదీక్షితులు - "భగవత్పాదుల ముఖపద్మంనుండి బయలుదేరిన, సంసారహారిణియైన, అద్వితీయాత్మతత్త్వ ప్రతిపాదకమైన సూక్తి ఆ యా ప్రాచీనాచార్యులను చేరి, విష్ణుపాదోద్గతమైన గంగ వివిధ భూభాగాలలో వివిధరూపాలు ధరించినట్లు, వివిధరూపాలలో కనబడుతున్నది. అయితే అద్వితీయబ్రహ్మపరాయణత్వంలో మాత్రం ఏమీ భేదం లేదు" అని అంటారు.

"అధిగతభిదా పూర్వాచార్యానుపేత్య సహస్రధా
సరిదివ మహీభేదాన్ సంప్రాప్య శౌరిపదోద్గతా,
జయతి భగవత్పాదశ్రీమన్ముఖామ్బుజనిర్గతా
జననహరణీ సూక్తిర్బ్రహ్మాద్వయైకపరాయణా"

(శాస్త్రసిద్ధాంతలేశసంగ్రహం)

ఈ విషయంలో వ్యాకరణశాస్త్రం ఉదాహరణంగా చూపవచ్చును. ప్రస్తుతం అధికప్రచారంలో ఉన్న వ్యాకరణం పాణినీయం. పాణిని పదాలను విడగొట్టి ఇది ప్రకృతి అనీ ఇది ప్రత్యయం అనీ నిర్ధారణచేశాడు. అలాంటివి ఎన్నో ప్రత్యయాలు కల్పించుకొన్నాడు. సంజ్ఞలు, పరిభాషలు ఏర్పరుచుకొన్నాడు. వీటి అన్నింటి ప్రయోజనం 'రామః', 'భవతి', 'ఏధతే', 'చికీర్షతి', 'కార్యమ్', 'చర్కరీతి', దాశరథిః', 'గౌరవమ్', 'లావణ్యమ్', 'జిగమిషతి' ఇత్యాది పదాలు తయారుకావడమే. పాణినికి పూర్వం ఉన్న కొందరు వైయాకరణులు, తరువాత వచ్చిన వైయాకరణులు ఇలాంటి పదజాలాన్నే

తయారుచేయడం కోసం వేరువేరు ప్రత్యయాలు, సంజ్ఞలు, పరిభాషలు మొదలైనవి ఏర్పరచుకొన్నారు. ఎవరు ఏవి ఏర్పరచుకొన్నా అసలు సాధించవలసినది మాత్రం పదనిర్మాణమే. వాళ్ల సాధించేపదాలు, పాణిని సాధించేపదాలూ కూడ సమమే ప్రక్రియలోమాత్రం భేదం, ఒకే విషయాన్ని ఒక ఉపాధ్యాయుడు కొన్ని ఉదాహరణల సాహాయ్యంతో ఒక విధంగా బోధిస్తాడు. మరొకడు మరొకవిధంగా బోధిస్తాడు అద్వైతగ్రంథాలలో కనబడే ప్రక్రియాభేదం ఇలాంటిదే.

అందుచేత ఈ ఆక్షేపణలన్నీ కాలక్షేపంకోసం, స్వాత్మానందంకోసం, వినేయబుద్ధివిక్షేపం కోసం చేసేవి మాత్రమే.

**భగవద్గీతాభాష్యం:** మహాభారతాన్ని శ్రీశంకరభగవత్పాదులు స్మృతినిగా పేర్కొంటూంటారు. దానిలోని భీష్మపర్వాంతర్గతమైన భగవద్గీతకు కూడ వీరు భాష్యం రచించి దానిలో ప్రధానప్రతిపాద్యం అద్వితీయాత్మతత్త్వమే అని స్థాపించారు. శ్రీశంకరభగవత్పాదులకు పూర్వం కూడ భగవద్గీతకు వ్యాఖ్యానాలు (వృత్తులు) ఉన్నట్లు వీరి భాష్యంవల్లనే తెలుస్తుంది. అవి లభ్యం కావు. కొందరు వృత్తికారులు జ్ఞానకర్మసముచ్చయం, భేదాభేదవాదం మొదలైనవి ప్రతిపాదించినట్లు భాష్యంలో వీరు చేసిన తత్తన్మతఖండనవల్ల తెలుస్తూన్నది. శ్రీశంకరభగవత్పాదులు భాష్యం రచించినది మొదలు భగవద్గీతకు అత్యధికమైన ప్రసిద్ధి లభించి ఇతరసంప్రదాయస్థులు కూడ దానికి స్వస్వమతానుసారంగా వ్యాఖ్యలు వ్రాయడం ప్రారంభించారు.

**ఉపనిషద్భాష్యాలు:** వేదాల చివర ఉపనిషత్తులు (వేదాంతాలు) ఉన్నాయి ఒక్కొక్క వేదానికి చివర ఒక్కొక్క ఉపనిషత్తు మాత్రమే కాక బహుసంఖ్యలో కూడ ఉన్నాయి. ఇలాంటి ఉపనిషత్తులు మొత్తం 108 ఉన్నట్లుగా చెపుతూ ముక్తోపనిషత్తు వాటి పేర్లు కూడ పేర్కొన్నది. ఈ నూట ఎనిమిది ఉపనిషత్తులతో పాటు ఇంకా ఎనభై ఉపనిషత్తులు చేర్చి మొత్తం 188 ఉపనిషత్తులు చాలకాలంక్రితమే ప్రకటింపబడి ఉన్నాయి. అయితే ఇవన్నీ ప్రాచీనములు కాని, ఉపనిషన్నామయోగ్యాలు కాని కావు వీటిలో అల్లోపనిషత్తు (ముస్లింల అల్లాను గూర్చి చెప్పే ఉపనిషత్తు) వంటివి ఉండడాన్ని పట్టి కొన్నింటి ప్రాచీనత్వప్రామాణికత్వాలు సంశయాస్పదములైనవే.

వేదాంతాలు నివృత్తిరూపధర్మాన్ని బోధిస్తాయి అని వెనుక చూచి ఉన్నాం. ఆ దృష్టితో చూస్తే ఇప్పుడు మనకు ఉపనిషత్తులనే పేరుతో లభ్యమైనవాటిలో కొన్ని మాత్రమే ప్రధాన మైనవి. మిగిలినవి కేవలం ఆ యా దేవతల ఉపాసనావిధానాదులను బోధించేవి. అందుచేత ఇవి శైవ-శాక్త-వైష్ణవ-గాణపతాది సంప్రదాయాలకి సంబంధించినవి.

ఉపనిషత్తులలో ఏవి ప్రధానమైనవి, ఏవి అప్రధానములు అనే విషయాన్ని ప్రాచీనాచార్యుల వ్యాఖ్యానాలను పట్టి తెలుసుకొనవలసి ఉంటుంది. శ్రీ శంకరభగవత్పాదులు ఈశ-కేన-కఠ-ప్రశ్న-ముండ-మాండూక్య-తైత్తిరీయ-ఐతరేయ-ఛాందోగ్య-బృహదారణ్యకోపనిషత్తులకు (పదింటికి) భాష్యం రచించారు. (నృసింహతాపన్యుపనిషత్తుకు కూడ వ్రాసి నట్లు అంగీకరించి వాణీవిలాసప్రెస్సువారు శ్రీశంకరగ్రంథావళిలో చేర్చారు). ఇవి కాక ఐదారు ఉపనిషత్తులనుండి కొన్ని వాక్యాలు అక్కడక్కడ బ్రహ్మసూత్రగీతోపనిషద్భాష్యాలలో ప్రమాణంగా ఉదాహరించారు. శ్రీభగవద్రామానుజాచార్యులు ఉపనిషత్తులకు వ్యాఖ్యలు వ్రాయకపోయినా పై ఉపనిషత్తులనుండి మాత్రమే వాక్యాలను ప్రమాణంగా ఉదహరించారు. దీనిని పట్టి ఉపనిషత్తులలో పదిహేను పద్దెనిమిది ఉపనిషత్తులు మాత్రమే ప్రాచీనము లనీ, జ్ఞానమార్గం విషయంలో ప్రామాణికము లనీ విమర్శకుల అభిప్రాయం. 'ఉపనిషత్తు' అనగానే దాని కొక గౌరవం ఉండడంచేత ఆ యా కాలాలలో కొందరు ఉపాసనాప్రధానాలైన రచనలు చేసి వాటికి 'ఉపనిషత్తులు' అని పేరు పెట్టి ఉంటారు. 'అల్లోపనిషత్తు' వంటి ఉపనిషత్తులు ఆవిర్భవించడం ఇందుకు ప్రమాణం.

'ఉపనిషత్' శబ్దం 'ఉప' 'ని' అనే రెండు ఉపసర్గలు చేర్చిన 'సద్'. అనే ధాతువునుండి నిష్పన్న మైనది. "సేయం బ్రహ్మవిద్యా ఉపనిషచ్ఛబ్దవాచ్యా; తత్పరాణాం సహేతోః సంసారస్య అత్యన్తావసాదనాత్. ఉపనిపూర్వస్య సదేస్తదర్థత్వాత్. తాదర్థ్యాద్గ్రన్థోఽపి ఉపనిషదుచ్యతే" (బృహదారణ్యకోపనిషద్భాష్యం. పేజి 2) "య ఇమాం బ్రహ్మవిద్యాముపయన్త్యాత్మభావేన శ్రద్ధాభక్తిపురఃసరాః సన్తః తేషాం గర్భజన్మజరారోగాద్యనర్థపూగం నిశాతయతి, పరం వా బ్రహ్మగమయతి, అవిద్యాదిసంసారకారణం చాత్యన్తమవసాదయతి వినాశయతి ఇత్యుపనిషత్. ఉపనిపూర్వస్య సదేరేవమర్థస్మరణాత్"

(ముండకోపనిషద్భాష్యం. పేజి. 12). శ్రీశంకర భగవత్పాదులు చూపిన ఈ వ్యుత్పత్తి ప్రకారం (1) నమూలమైన సంసారాన్ని నశింపచేయడంచేత (2) పరబ్రహ్మను పొందించడంచేత బ్రహ్మవిద్యకు ఉపనిషత్ అని పేరు. ఇదే ఈ పదానికి ముఖ్యార్థం. ఆ బ్రహ్మవిద్యను బోధించే గ్రంథం కూడ లక్షణచేత ఉపనిషత్ అని చెప్పబడుతుంది. ఇలాంటి వ్యుత్పత్తియే కఠోపనిషద్భాష్యప్రారంభంలో కూడ చూపబడింది. ఒక గురువును ఆశ్రయించి ఆయన దగ్గర కూర్చుండి సంపాదించవలసిన దవడంచేత కూడ బ్రహ్మవిద్యకు ఉపనిషత్ అని పేరు. 'ఉపనిషత్' అనే పదానికి 'రహస్యం' అనే అర్థం కూడ ఉంది. "ఏషా వేదోపనిషత్" (శిక్షావల్లి) ఇత్యాదివాక్యాలలో ఈ అర్థమే చెప్పబడింది. ఆత్మతత్త్వం కూడ అతిరహస్యమైనది గాన దానికీ, దానిని ప్రతిపాదించే గ్రంథానికీ కూడ ఉపనిషత్ అనే పేరు లభించింది. వెనుక చెప్పిన విధంగా వేదాల అంతంలో ఉండడంవల్లనే కాకుండా వేదాల అంతాన్ని, అనగా సారాన్ని, బోధించడంచేత కూడ ఉపనిషత్తులకు వేదాంతా లనే పేరు వచ్చింది. అందుచేతనే వీటికి 'శ్రుతిశిరస్సు' 'వేదశీర్షము' మొదలైన పేర్లు కూడ ప్రసిద్ధంగా ఉన్నాయి. శ్రీశంకరభగవత్పాదులు ప్రధానములైన పదిపదకొండు ఉపనిషత్తులకు కూడ స్వయంగా భాష్యాలు వ్రాసి తాము స్థిరీకరించిన వేదాంతానికి ఉపనిషత్తులు మాత్రమే మూలం అనే విషయాన్ని స్పష్టీకరించారు. ఛాందోగ్యోపనిషత్తు మొదలైన కొన్ని ఉపనిషత్తులకు ప్రాచీనవృత్తులు ఉన్నట్లు కనబడినా భగవత్పాదుల తరవాత వచ్చిన ఆచార్యు లెవరూ స్వయంగా వీటికి భాష్యాలు రచించలేదు.

**వేదాంతం:** ఉపనిషత్తులనూ, తదర్థజ్ఞానోపయోగిబ్రహ్మసూత్రాన్నీ, ఉపనిషదనుసారిభగవద్గీతనూ ఆధారంగా చేసికొని శ్రీశంకరభగవత్పాదులు అద్వైతసిద్ధాంతాన్ని ఒక నిశ్చితరూపంలో స్థాపించారు. అందుచేతనే తన సిద్ధాంతం ఔపనిషదమనీ, వైదికమనీ, ఆకాలంనాటికి ప్రచారంలో ఉన్న సాంఖ్య-వైశేషికాది ద్వైతమతాల వలె ఇది అవైదికం కాదనీ అనేక స్థలాలలో ఘోషిస్తూ వేదాంతార్థనిర్ణయంలో అవైదికాలైన కాపిలాదిస్మృతులకు ఆగమాలకు స్థానం లేదని సూచించారు. ద్విధా ఇతం ద్వీతమ్= రెండువిధాలను పొందినది. ద్వీతస్య భావః ద్వైతమ్= రెండువిధాలుగా ఉన్నదాని ధర్మం. న విద్యతే ద్వైతం యత్ర తత్ అద్వైతమ్=

ఎక్కడైతే ద్విధాభావంలేదో అది అద్వైతం. **"ద్విధేతం ద్వీతమిత్యాహుః తద్భావో ద్వైతముచ్యతే".** (బృ.వా. 4.3.186)

జగత్-జీవ-పరమేశ్వర స్వరూపస్వభావాలేవి, వీటి పరస్పరసంబంధం ఎలాంటిది అనే విషయాన్ని తెలుసుకొనడం కోసమే ఆస్తికదర్శనాలన్నీ ప్రయత్నిస్తాయి. ప్రత్యక్షం, అనుమానం, శబ్దం అనేవి యథార్థజ్ఞానాన్ని కలిగించే మూడు ప్రమాణాలు. "వ్యవహారే భాట్టనయః" అన్నట్లు వేదాంతులు భాట్టమీమాంసకులచేత అంగీకరించబడిన ఉపమాన-అర్థాపత్తి- అనుపలబ్ధులను కూడ ప్రమాణాలుగా అంగీకరిస్తారు. బాహ్యపదార్థాల జ్ఞానం కలిగించడంలో ప్రత్యక్షమే ప్రబలమైన ప్రమాణం. అతిసూక్ష్మమైన వస్తువులను గ్రహించడానికి గాని సుదూరంలో ఉన్న సూర్యచంద్రనక్షత్రాదుల పరిమాణస్వరూపాదులను గ్రహించడానికి గాని ఈ ప్రత్యక్షప్రమాణం కూడ చాలదు. ప్రత్యక్షాన్ని అనుసరించి ప్రవర్తించేది అను+మానం. ఇక శబ్దానికి ఉన్న పరిధి అతివిస్తృతమైనది. ఒకని తల్లిదండ్రు లెవరో వానికి తెలియా లంటే శబ్దం తప్ప మరొక ప్రమాణం లేదు. ఇంక అలౌకికవిషయాలకు వస్తే స్వర్గనరకాలు, పుణ్యపాపాలు, ఆత్మానాత్మలు ఇలాంటి విషయాలు మనకు తెలియాలంటే శ్రుతి ఒక్కటే ఆధారం. ఇది అపౌరుషేయం. అనగా ఇందులో ప్రతిపాదించిన విషయాలు మానవులు ఆలోచించి చెప్పినవి కాదు.

> **"అజన్హ వై పృశ్నీంస్తప్యమానాన్ బ్రహ్మ స్వయంభ్వానర్షత్,**
> **త ఋషయో౽భవన్, తదృషీణాం ఋషిత్వమ్"**

అని తైత్తిరీయసంహితలో చెప్పినట్లు వేదాలు మహాతపఃశాలులైన ఋషుల మనస్సులలో వాటంతట అవే స్ఫురించాయి. ఈ వేదాలను విన్న ఋషులు వాటిని తాము విన్నవి విన్నట్లుగా తరువాతివారికి అందజేశారు. వీటిలో ఉన్న సత్యాలు మాటవరసకు చెప్పిన సత్యాలు కావు; ప్రయత్నిస్తే వీటి యథార్థత్వాన్ని రుజువు చేసి నిరూపించుకో వచ్చును. అయితే వాటిని రుజువు చేసికోవాలంటే ఆ శ్రుతులలో చెప్పిన పద్ధతులనే అనుసరించాలి. నియమబద్ధమైన జీవితవిధానాన్ని జరుపుకుంటూ, అంతఃకరణను పరిశుద్ధం చేసికొని సాధనచతుష్టయసంపత్తితో ప్రయత్నిస్తే ఆ సత్యాలు స్వాను భవగోచరా లవుతాయి. లౌకికవిజ్ఞానానికి సంబంధించిన సత్యత్వాసత్యత్వాలను

పరీక్షించాలంటే కూడ ఆ యా శాస్త్రాలలో చెప్పిన సాధనాలు సేకరించుకొని ఆ విధానాలనే అనుసరించవలసి ఉంటుంది కదా? అందుచేత అద్వైతికి సంబంధించి నంతవరకు వేదోక్తసత్యానికి దూరంగా ఉన్న ప్రత్యక్షానుమానాదీతరప్రమాణాలచేత కలిగే జ్ఞానాన్ని దృష్టిలో ఉంచుకొని తదనుగుణంగా మాత్రమే వేదవాక్యాలను సమన్వయించుకొనే ప్రసక్తి లేదు. అప్పుడు శ్రుతి ప్రామాణ్యాంగీకారమే అనావశ్యకం అవుతుంది. వేదప్రతిపాదితమైన విషయానికి ప్రత్యక్షాదులతో విరోధం ఏర్పడితే అద్వైతి వేదసూచితములైన పద్ధతులనే అనుసరించి ఆ విరోధాన్ని తొలగిస్తాడు.

### సాధకుని విచికిత్స

మానవుని మనస్సులో కలిగే జిజ్ఞాసకు ప్రధానకేంద్రం మానవుడే. తాను ఒక డున్నాడు. ఆ తానే జీవాత్మ. తన చుట్టూ స్థావరజంగమాత్మక మైన సజీవనిర్జీవరూప మైన ప్రపంచకం ఉంది. ఈ రెండే కాకుండా పరమేశ్వరు డనేవా డొక డున్నా డని శ్రుత్యాదుల ద్వారా లేదా అనుమానప్రమాణం ద్వారా, లేదా రెండింటి ద్వారా తెలుసుకుంటాడు. ఈ మూడింటికీ సంబంధం ఏమిటి అనేదే ప్రశ్న. మానవుని మనస్సును ఏనాటినుంచో వేధిస్తున్న ఈ పెద్ద ప్రశ్న ఈ తీరని సంశయం "యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీత్యేకే నాయమస్తీతి చైకే" (క.ఉ.1.1.20) అనే వాక్యంలో, (కఠోపనిషత్తులో) నచికేతుడే లేవదీశాడు. మనిషి మరణించిన తరువాత కూడ అతడుంటా డని కొంద రంటారు. ఉండ డని కొంద రంటారు. ఈ విచికిత్సకు సమాధానం చెప్ప మంటాడు. ఆలోచించకలిగిన ప్రతిమనిషి మనస్సులోను కలిగే ప్రశ్నలివి-నేను పుట్టక మునుపు కూడ నేను ఉండేవాణ్ణా ఉండనే లేదా? ఉంటే ఎక్కడ, ఎలా, ఎవరుగా ఉండేవాణ్ణి? నేను ఎక్కడినుంచి వచ్చాను? ఇప్పుడు నేనెవరు? నేను మరణించిన తరవాత కూడ నేను ఉంటానా ఉండనా? ఉంటే ఎక్కడ, ఎలా ఏ రూపంలో ఉంటాను? నేనెక్కడికి వెడతాను? నా చివరి గమ్యస్థానం ఏది? నే నా గమ్యస్థానాన్ని చేరడానికి తగిన ఉపాయం ఏది?" ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పడానికే వేదాంతాలు అద్వైతప్రతిపాదకశ్రుతులు ఉపనిషత్తులు ముందుకు వస్తాయి.

"ఉన్న సత్యం, పారమార్థికమైన తత్త్వం, ఒక్కటే. రెండు సత్యపదార్థాలంటూ లేవు. ఉన్నట్లుగా కనబడుతున్న వన్నీ ఆ ఏకైకసత్యం యొక్క విభిన్నరూపాలే; వివర్తాలే.

వాటి స్వరూపాన్ని విశ్లేషించుకొంటూ పోతే చివరికి అవి భ్రాంతిమూలకాలే అని తెలుతుంది" అని బోధించే వాక్యాలు ఉపనిషత్తులలో అసంఖ్యాకంగా ఉన్నాయి.

1. "ఏకో దేవః సర్వ భూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా" "ఒకే దేవుడు అన్నీ భూతాలలోను దాగి ఉన్నాడు. అంతటా వ్యాపించి ఉన్నాడు. అతడే అన్ని భూతాల అంతరాత్మ"

2. "నేహ నానాస్తి కించన" (బృ.ఉ.4.4.19)
"ఈ ప్రపంచంలో భేదం అనేది లేదు."

3. "మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" (బృ.ఉ. 4.4.10)
"ఈ ప్రపంచంలో అనేకత్వం చూచేవాడు జనన-మరణరూపసంసారంలో తిరుగుతూంటాడు"

4. "ద్వితీయాద్వై భయం భవతి." (బృ.ఉ.)
"రెండవ వస్తువు ఉన్న దనుకొన్నప్పుడే భయం కలుగుతుంది".

5. "ఉదరమన్తరం కురుతే అథ తస్య భయం భవతి" (తై.ఉ. 2.7.8)
"ఏ కొంచెం భేదభావం ఉన్నా భయం కలుగుతుంది"

6. "స యశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే, స ఏకః" (తై.ఉ.)
"ఈ పురుషునిలో ఉన్న జీవాత్మ, సూర్యునిలో ఉన్నదీ, రెండూ ఒక్కటే"

7. "సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః (ఈ.ఉ.7)
"తత్త్వజ్ఞానం ఉన్నవానికి అన్ని భూతాలూ తన ఆత్మయే"

8. "తత్ర కో మోహః కః శోకః ఏకత్వమనుపశ్యతః (ఈ.ఉ.7)
"అంతటా ఏకత్వం చూచేవానికి ఇక మోహ మెక్కడిది? శోక మెక్కడిది?"

9. "యస్మిన్నేకస్మిన్విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" (ఛా.ఉ.)
"ఏ ఒక దానిని తెలుసుకుంటే ఇదంతా తెలుస్తుందో"

10. "ఈశావాస్యమిదం సర్వమ్" (ఈ.ఉ.1)
"ఈ ప్రపంచం అంతా ఈశ్వరునిచేత కప్పదగింది; అనగా ఈశ్వరునిచేత వ్యాప్తమైనది"

11. "ఐతదాత్మ్యమిదం సర్వమ్" (ఛా.ఉ.6.8.7)

"ఇదంతా బ్రహ్మస్వరూపం"

12. "స ఆత్మా, తత్త్వమసి శ్వేతకేతో" (ఛా.ఉ. 6.8.8)

"అదే ఆత్మ; శ్వేతకేతూ, ఆ ఆత్మయే నువ్వు"

13. "సర్వం హ్యేతద్బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ" (బృ.ఉ. 2.5.19)

"ఇదంతా బ్రహ్మయే. ఈ జీవాత్మ కూడ బ్రహ్మయే"

14. "సచ్చ త్యచ్చాభవత్" (తై. ఉ. 2.6.1)

"ఆ బ్రహ్మయే వ్యక్తావ్యక్తప్రపంచంగా అయింది"

15. "బహు స్యాం ప్రజాయేయ" (తై.ఉ. 2.6)

"నేనే అనేకాకారాలలో ఆవిర్భవిస్తాను" (అని ఆత్మ తలచినది)

అద్వితీయాత్మతత్త్వం ఉపనిషత్తులలో ప్రతిపాదించబడింది అనేది ప్రాయోవాదం మాత్రమే. సంహితాభాగాదులలో కూడ అద్వైతతత్త్వాన్ని ప్రతిపాదించే వాక్యాలు కోకొల్లలుగా ఉన్నాయి. నిజానికి ఈశావాస్యోపనిషత్తు శుక్లయజుః సంహితాంతర్గతమే. సూత్రభాష్యంలో అద్వైతసిద్ధాంతోపోద్బలకాలుగా ఋక్సంహితాదివాక్యాలు కూడ అనేకం ఉదాహరించబడ్డాయి. 1946 సంవత్సరంలో శ్రీకాంచికామకోటిపీఠంవారు ప్రకటించిన 'అద్వైతాక్షరమాలా' అనే గ్రంథంలో నాలుగువేదాలలోను (సంహితాభాగాదులలో కూడ) ఉన్న అద్వైతభావాలను సోదాహరణంగా విశదీకరిస్తూ నలుగురు పండితవర్యులు వ్రాసిన వ్యాసాలున్నాయి.

16. "ఏకం సద్విప్రాబహుధా వదన్తి" (ఋ.సం)

"సత్ అయిన తత్త్వం ఒకటే అయినా పండితులు దానినే అనేకరూపాలలో వర్ణిస్తూంటారు".

17. "ప్రజాపతిశ్చరతి గర్భే అన్తః, అజాయమానో బహుధా విజాయతే" (ఋ.సం)

"గర్భంలోపల ప్రజాపతి సంచరిస్తున్నాడు. ఇతనికి పుట్టుక లేకపోయినా అనేకరూపాలు ధరిస్తూ ఉంటాడు".

## అద్వైతప్రతిపాదకపురాణాదులు.

పురాణాలలో కూడ అనేకస్థానాలలో అద్వైతసిద్ధాంతప్రతిపాదకాలైన ఘట్టాలు కోకొల్లలుగా కనబడుతున్నాయి. విష్ణుపురాణాదులలో ఉన్న జడభరతోపాఖ్యానాదులు

ఇందుకు ఉదాహరణలు. అద్వైతతత్త్వప్రతిపాదికాలైన, విష్ణుపురాణంలోని ఎన్నో శ్లోకాలు శ్రీ యస్. ఆర్. కృష్ణమూర్తి శాస్త్రిగారు బ్రహ్మవిద్యాభరణానికి తాము వ్రాసిన ఉపోద్ఘాతంలో ఉదాహరించి ఉన్నారు.

ఉపనిషత్తుల తరవాత ఉపనిషత్తువంటి ప్రామాణ్యంగల గ్రంథం భగవద్గీత. దానిలో కూడ అనేకప్రదేశాలలో అద్వైతతత్త్వం ప్రతిపాదించబడింది.

"బ్రహ్మార్పణం బ్రహ్మ హవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్,
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా" (భ.గీ. 4.24)

"హోమం చేయడం బ్రహ్మ, బ్రహ్మయైన ఋత్విక్కుచేత బ్రహ్మయైన అగ్నిలో హోమం చేయబడిన హవిస్సు బ్రహ్మ. ఈ బ్రహ్మకర్మసమాధిచేత పొందవలసిన, పొందదగిన ఫలం కూడ బ్రహ్మయే".

**"ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే,**
**ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః"**
**క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత**
**క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ" (భ.గీ.1.3.1.2)**

"ఈ శరీరం క్షేత్రం. ఇది నాది అనుకొనేవాడు క్షేత్రజ్ఞుడు. జీవుడు. అన్ని క్షేత్రాలలోను ఉండే క్షేత్రజ్ఞుడు నేనే (పరమాత్మయే). క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానమే సరియైన జ్ఞానం".

**పరబ్రహ్మప్రతిపాదకశ్రుతులు:** పరబ్రహ్మకు ప్రతీకయైన ఓంకారాన్ని వర్ణిస్తూ మాండూక్యోపనిషత్తులో; ఈ విధంగా చెప్పబడింది.

**"ఓమిత్యేతదక్షరమిదం సర్వం తస్యోపవ్యాఖ్యానం భూతం భవద్ భవిష్యదితి సర్వమోంకార ఏవ యచ్చాన్యత్త్రికాలాతీతం తదప్యోంకార ఏవ. సర్వం హ్యేతద్బ్రహ్మ. అయమాత్మా బ్రహ్మ" (మా.ఉ. 1)**

"పవిత్రమైన ఓంకారం ఎట్టి మార్పులూ లేని బ్రహ్మకు ప్రతీకం అనగా ఓంకారమే బ్రహ్మ. ప్రతీ పదార్థమూ దీని రూపాంతరమే. పూర్వం ఏవి ఉండేవో, ఇప్పుడు ఏవి ఉన్నాయో, భవిష్యత్తులో ఏవి ఉండబోతాయో అవన్నీ ఓంకారమే. మూడు కాలాలకూ అతీతమైనది కూడ ఓంకారమే. ఈ ప్రపంచం అంతా బ్రహ్మయే.

ఈ జీవాత్మ బ్రహ్మయే".

సుషుప్త్యవస్థలో ఉన్న జీవుణ్ణి మాండూక్యోపనిషత్తు ఈ క్రింది మాటలతో వర్ణిస్తున్నది.

**"ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషో౽న్తర్యామీ. ఏష యోనిః సర్వస్య ప్రభవా వ్యయౌ హి భూతానామ్" (మా.ఉ.6)**

"ఇతడే సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, అంతరాత్మ. ఇతడే సమస్తప్రపంచానికీ మూలకారణం. ఈ భూతాలన్నీ ఈతనినుండే ఆవిర్భవించి ఇతనిలోనే నిలీనం అవుతాయి".

ఏ విశేషాలూ లేని నిర్గుణమైన శుద్ధబ్రహ్మ బృహదారణ్యకోపనిషత్తులో ఈ విధంగా వర్ణించబడింది.

**ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్తి అస్థూలమ్, అనణు, అహ్రస్వమ్, అదీర్ఘమ్, అలోహితమ్, అస్నేహమ్, అచ్ఛాయమ్, అతమః, అవాయు, అనాకాశమ్, అసంగమ్, అరసమ్, అగన్ధమ్, అచక్షుష్కమ్, అశ్రోత్రమ్, అవాక్, అమనః, అతేజస్కమ్, అప్రాణమ్, అముఖమ్, అమాత్రమ్, అనన్తరమ్, అబాహ్యమ్, న తదశ్నాతి కించన న తదశ్నాతి కశ్చన" (బృ.ఉ. 3.8.8)**

"ఓ! గార్గీ బ్రహ్మవేత్తలు వినాశరహితమైన ఈ పరబ్రహ్మను గూర్చి ఈ విధంగా చెపుతున్నారు. ఇది స్థూలం కాదు; చిన్నది కాదు, పొట్టిది కాదు, పొడవైనది కాదు; ఎఱుపు కాదు; స్నేహం (తడి) కాదు, కాంతి కాదు; చీకటి కాదు; వాయువు కాదు; ఆకాశం కాదు; దేనితోను సంగం కలది కాదు; రసం కాదు; గంధం కాదు; దీనికి కళ్లు లేవు; చెవులు లేవు; వాక్కు లేదు, మనస్సు లేదు; తేజస్సు లేదు, ప్రాణం లేదు, ముఖం లేదు, పరిమాణం లేదు; దీనికి లోపలి భాగం అనీ, వెలుపలి భాగం అనీ లేదు. ఇది దేనినీ తినదు, దీనిని ఏదీ తిన జాలదు". ఈ విధంగా నిర్గుణమైన అద్వితీయాత్మతత్త్వాన్ని బోధించే వాక్యాలు ఉపనిషత్తులలో అత్యధికసంఖ్యలో కనబడతాయి.

### ద్వైతాశ్రితశ్రుత్యాదులు

అద్వితీయనిర్గుణాత్మతత్త్వాన్ని బోధించే శ్రుతివాక్యాలు ఇలా ఉండగా మనం

రెండవ పక్షాన్ని పరిశీలించినప్పుడు ప్రపంచంలో భేదం అనేదే లేదనేది ఊహకి కూడ అందని విషయం. జగత్తులోని వ్యవహారం అంతా భేదదృష్టిమీదనే ఆధారపడిఉంది వేదప్రతిపాదితమైన కర్మకాండలో కర్త, కర్మ చేసేవాడు, దాని ఫలం అనే భేదదృష్టియే అంతర్గతమై ఉంది. ఈ భేదం ఏదీ లేకపోతే కర్మానుష్ఠానం చేసే ప్రసక్తియే లేదు. అదే విధంగా ప్రత్యక్షం, అనుమానం, ఉపమానం, అర్థాపత్తి మొదలైన ప్రమాణా లన్నీ భేదాన్నే సమర్థిస్తున్నాయి. ఉపనిషత్తులలో కూడ అనేకవిధా లైన ఉపాసనలను బోధిస్తూ సగుణబ్రహ్మయొక్క వివిధరూపాలను వర్ణించే వాక్యాలు నిర్గుణ బ్రహ్మప్రతిపాదకవాక్యాలకంటె అత్యధికసంఖ్యలో ఉన్నాయి. అప్పయదీక్షితులు చెప్పి నట్లు శ్రీ శంకరభగవత్పాదుల భాష్యాలలో కూడ నిర్గుణబ్రహ్మస్వరూపాన్ని నిరూపించే భాగాలకంటె సగుణబ్రహ్మస్వరూపాన్నీ, వివిధోపాసనలనూ ప్రతిపాదించే భాగాలు అతి విస్తృతంగా ఉన్నాయి. భేదస్థితిలో భేదాలకు గాని, భేదాలమీద ఆధారపడి ఉన్న సగుణోపాసనాదులకు గాని, వాటికి సంబంధించిన వివిధాంశాలకు గాని అంతం ఉండదు. అందుచేత వాటిని గూర్చి (సగుణస్వరూపాన్ని) ఎంత వర్ణించి చెప్పినా అసమగ్రంగానే ఉంటుంది. అభేదాన్ని, నిర్గుణబ్రహ్మని గూర్చి రెండు మూడు వాక్యాలలో చెప్పివేయవచ్చు. తరవాత ఎన్ని వాక్యాలు చేర్చినా అది చెప్పిన విషయమే మళ్ళీ చెప్పడం అవుతుంది.

"ఏవం చ యథా చతుర్ష్వపి వేదేషు సర్వప్రాణ్యనుగ్రహార్థం బ్రహ్మభావావాప్తి రూపమహాపురుషార్థప్రతిపాదనైదంపర్యేణ ప్రవృత్తేషు, తదుపయోగ్యన్తఃకరణశుద్ధి జనకకర్మనిరూపణార్థమేవ భూయాన్ ప్రపఞ్చః, బ్రహ్మనిరూపణార్థో వేదాన్తభాగస్తు నిరూపణీయబాహుల్యాభావాత్ స్వల్పః-తథా భగవత్పాదీయే భాష్యే నిర్విశేషబ్రహ్మభావప్రాప్త్యర్థం తన్నిదిధ్యాసనాయాపేక్షితచిత్తస్థైర్యాద్యుపయో గ్యుపాసనారాధనీయసగుణేశ్వరప్రసంగ ఏవ భూయాన్నిర్గుణస్వరూపవిచారాంశస్తు నిరూపణీయబాహుల్యాభావాత్ స్వల్పః". (ఆనందలహరి. పేజీ. 142)

## ద్వైతాద్వైతవాక్యసమన్వయం

ఈ విధంగా ద్వైతాన్ని అంగీకరిస్తేనే కాని కుదరని ప్రత్యక్షాదిప్రమాణ విధినిషేధమోక్షశాస్త్రాలకు, తత్త్వం ఒక్కటే, జీవాత్మపరమాత్మలకు ఏ మాత్రమూ భేదం

లేదు, జగత్తుకు స్వతంత్రమైన అస్తిత్వం లేదు అని చెప్పే అద్వైతవాక్యాలకు సమన్వయం ఎలా కుదురుతుంది? కుదరని పక్షంలో ఒకే ఉపనిషత్తు ఒక చోట ద్వైతానుగుణంగా ఉపాసనాదులను ఉపదేశిస్తూ మరొక చోట అద్వైతమే పరమార్థతత్త్వం అని చెపుతూండగా దానికి ప్రామాణ్యాన్ని అంగీకరించడం ఎట్లు? అనే ప్రశ్న లుదయిస్తాయి.

భేదమే సత్యం అని అంగీకరించిన పక్షంలో అభేదప్రతిపాదకా లైన వాక్యాలన్నీ నిరర్థకములవుతాయి. ఆ వాక్యాలలో ఉన్న పదాలు ఇటు త్రిప్పి అటు త్రిప్పి ఏవేవో ఇష్టం వచ్చిన అర్థాలు చెప్పవలసి వస్తుంది. అభేదమే సత్యం అని అంగీకరించిన ట్లయితే భేదప్రధానమైన వాక్యాలకు సరి యైన గతి చూపవలసి ఉంటుంది. శ్రీ శంకరభగవత్పాదులు రెండవ పక్షాన్నే అంగీకరించి భేదవాక్యాలకు చక్కని సమన్వయం చూపి ఉన్నారు.

ఉపనిషత్తులలో ద్వైతవాక్యాలూ ఉన్నాయి. అద్వైతవాక్యాలూ ఉన్నాయి. ఏ గ్రంథానికైనా ప్రతిపాదించవలసిన విషయం ఒకటుంటుంది. ఆ విషయాన్ని ప్రతిపాదించే సందర్భంలో ప్రమాణాంతరాల ద్వారా తెలిసి ప్రసిద్ధంగా ఉన్న, ప్రకృతోపయోగు లైన అనేకవిషయాలను పరామర్శించవలసి ఉంటుంది. తాను అనేవాడు ఒకడు, తనతోపాటు మరి ఇతర జీవులు, జగత్తు ఇవన్నీ ఉన్నట్లు ప్రత్యక్షాదుల ద్వారా ప్రతి ఒక్కరికీ తెలుసు. దేవు డనే వా డొక డున్నా డని శాస్త్రాలలో వింటున్నాడు. తానూ ఇతరజీవులూ ఒక్కటే అని గాని, తానూ దేవుడూ ఒక్కటే అని గాని, ఈ జగత్తు అసత్యం అని కాని ఏ ఒక్కడూ అనుకోవడానికి అవకాశం లేదు. అందుచేత పొరబాటున ఇవన్నీ ఒక్కటే అనుకుంటా వేమో, అలా కాదు, ఇవన్నీ వేరు వేరు అని చెప్పడానికి శాస్త్రం రావలసిన పని లేదు. ఆ విషయం ప్రత్యక్షాదుల ద్వారా తెలుస్తూనే ఉన్నది. ఈ జగత్తు సృష్టించినది పరమేశ్వరుడు అని చెప్పి, ఆ మాటలు విన్న శ్వేతకేతువు నేనే ఆ పరమేశ్వరుణ్ణి అని ఎక్కడ అనుకొనిపోతాడో అని "నువ్వు మాత్రం పరమాత్మవు కాదు" అని "తత్త్వమసి"కి వెనుకనుండి అ జోడించి అతత్త్వమసి అని చెప్పవలసిన పని లేదు. స్పష్టంగా కనబడుతూన్న అర్థం కాదని వివిధ విగ్రహవాక్యనిర్మాణచాతురిని చూపి లేనిపోని అర్థాలు కల్పించవలసిన అవసరం లేదు.

అలాంటి కల్పనలు స్వయూథ్యులకు మాత్రమే పునఃపునశ్చర్వణానందదాయకాలుగా ఉంటాయి. అందుచేత ఉపనిషత్తులలోనే కాదు, వేదపూర్వభాగ-పురాణాదులలో ఉన్న ద్వైతవాక్యా లన్నీ ప్రసిద్ధమైన భేదాన్ని అనువదిస్తూ, ఇతర ప్రమాణాలచేత తెలియని ఆ యా కర్మోపాసనాదులను విధించడం కోసం ఉదిష్టమైనవే కాని క్రొత్తగా భేదాన్ని విధించడంకోసం ఉద్ధిష్టమైనవి కావు.

అద్వైతతత్త్వం అనేది లౌకికప్రమాణాలచేత గమ్యమైన విషయం కాదు. అందుచేత ప్రమాణాంతరాలచేత తెలియని అద్వైతతత్త్వాన్ని ప్రధానంగా ప్రతిపాదించడమే ఈ వాక్యాల ప్రధానలక్ష్యం. అద్వైతమే సత్య మనే పక్షంలో మనకు ప్రత్యక్షంగా కనబడుతున్న ఈ ప్రపంచకాన్ని లేదనడం ఎలా కుదురుతుంది? జీవునికీ జీవునికీ మధ్య ఉన్న భేదాన్ని లేదనడం ఎలా సంభావ్యం అవుతుంది? అల్పజ్ఞుడూ అల్పశక్తిమంతుడూ అయిన జీవునకు, సర్వజ్ఞుడు, సర్వశక్తుడూ అయిన పరమాత్మకు అభేదం చెప్పడం మహాపచారం కదా. ఇలాంటి ప్రశ్నలు ఉదయిస్తాయి. వీటికి సమాధానాలు కూడ ఉపనిషత్తులు భగవద్గీత మొదలైన గ్రంథాలలోనే లభిస్తాయి.

ఇలాంటి విషయాలను గూర్చి ఆలోచించే టప్పుడు ముందుగా గుర్తుంచుకొనవలసినది ఒకటుంది. అధికారిభేదంచేత, అభిరుచిభేదంచేత శాస్త్రాలలో ఉపదేశభేదం కనబడుతుంది. వేదాలలోని పూర్వకాండలో అనేకకర్మలు, జ్ఞానకాండలో అనేకమైన ఉపాసనలు విధించబడి ఉన్నాయి. అన్ని కర్మలు, అన్ని ఉపాసనలు ఒక వ్యక్తి చేయగలిగినవి కాదు. వైద్యశాస్త్రంలో చెప్పిన అన్ని రోగాలూ ఒక మనిషికి రావు; అన్ని మందులు ఒకే మనిషి సేవించడం అనేది ఉండదు. అదే విధంగా శాస్త్రాలలో వారి వారి అభిరుచులను పట్టి అధికారాన్ని పట్టి మానవులు ఆచరించాలి అనే ఉద్దేశ్యంతో అనేకకర్మోపాసనాదులు విధించబడ్డాయి.

ఉపనిషదాదులలో మరొక పద్ధతి కూడ ఉన్నది. ముందు ఏదో ఒక దానిని చెప్పి అదే చాలా ప్రధానమైన దనీ, ఆత్మ అనీ చెప్పడం; దానిమీద బుద్ధి నిలచిన తరవాత మరొకదానిని, తరవాత మరొకదానిని ఆత్మ అని చెప్పడం-ఈవిధంగా జరుగుతూ ఉంటుంది. ఇదంతా అసలు తత్త్వం దగ్గరకు తీసికొనివెళ్లడం కోసమే కాని అన్నీ సమప్రాధాన్యం కలవే, అన్నీ ఆత్మలే అని చెప్పడం కోసం కాదు. తత్త్వం

అనేది ఒక్కటే ఉండాలి గాని అనేక తత్వా లుండవు కదా? ఈ పద్ధతినే అరుంధతీదర్శన న్యాయం అంటారు. మిణుకు మిణుకు మంటూ అస్పష్టంగా కనబడే అరుంధతీనక్షత్రాన్ని క్రొత్తగా వివాహం అయిన వధువునకు చూపించాలి. అందుచేత ముందుగా ఆ చుట్టు ప్రక్కల నున్న పెద్ద నక్షత్రం చూపించి అదే అరుంధతీనక్షత్రం అని చెప్పి, దానిని గుర్తించినతరువాత, అది కాదు నిజమైన అరుంధతి; దాని ప్రక్కనున్నది అరుంధతి అని మరొక నక్షత్రం చూపించి మళ్లీ దాన్ని నిషేధించి అసలు నక్షత్రాన్ని చూపడం జరుగుతుంది. తైత్తిరీయోపనిషత్తులో ఆత్మను గూర్చి చెప్పే ఘట్టంలో ముందు అన్నమయయే ఆత్మ అని చెప్పి, దానిని నిషేధించి ప్రాణమయం ఆత్మ అని చెప్పి, దానిని నిషేధించి వరసగా మనోమయ - విజ్ఞానమయ - ఆనందమయాలు ఆత్మలని చెప్పి చివరికి యథార్థాత్మస్వరూపం చెప్పడం జరిగింది. (చూ. ఆనందమయాధికరణం). ఈ దృష్టితో పరిశీలిస్తే ఉపనిషత్తులలో ప్రతిపాద్యమైన పారమార్థికతత్వం అద్వైతమే అనీ, మిగిలిన ద్వైతప్రక్రియ అంతా దానిని తెలుసుకొనడానికి మార్గంగా, అలవాటైన, అందరికీ అర్థమయే పద్ధతిలో చెప్పిన ప్రక్రియ అనీ స్పష్టం అవుతుంది.

ద్వైతమే సత్య మనే పక్షంలో అద్వైతపరమైన అనేకవాక్యాలను అప్రామాణికా లని కొట్టివేయవలసివస్తుంది. ఎందుచేత ననగా ఆ వాక్యాలవల్ల సహజంగా వచ్చే అర్థాలను మన ఇష్టం వచ్చినట్లు మార్చివేసి, ముందుగానే నిర్ణయించుకొన్న మన మతాలకి అనుగుణంగా చెప్పుకొన్న పక్షంలో వాటి ప్రామాణ్యాన్ని పూర్తిగా అంగీకరించనట్లే కదా అర్థం? ఉపనిషత్ప్రతిపాద్యమైన బ్రహ్మను దృష్టిలో పెట్టుకొని "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అని సూత్రకారుడు సూత్రిస్తే దాని అర్థం మన ఇష్టం వచ్చి నట్లు 'విష్ణు జిజ్ఞాసా' అనో, 'శివజిజ్ఞాసా' అనో, 'శక్తిజిజ్ఞాసా' అనో మార్చే అధికారం మన కెవరిచ్చారు? బ్రహ్మ నిర్గుణం అనగా హేయగుణాలు లేనిదని ఎలా చెప్పడం. జగత్తు కూడ బ్రహ్మకు శరీరం అని అంగీకరించిన తరవాత ఆ జగత్తులోని హేయగుణాలు ఎవరికి చెందాలి? ఒక మనిషి శరీరంలో ఉన్న మంచి గుణా లన్నీ వానివే, చెడ్డగుణాలు మాత్రం చెట్టువి అని ఎలా చెప్పడం? బ్రహ్మ అద్వితీయం, బ్రహ్మ తప్ప మరేదీ లేదు వాస్తవంలో అని చెపుతూండగా బ్రహ్మతో సమాన మైనది మరొకటి లేదని మాత్రమే అర్థం అనేది

స్వకపోలకల్పితం కదా? ఆ యింట్లో ఒక్కడే అద్వితీయుడుగా ఉన్నాడు అన్నప్పుడు వానితో సమానమైన వాడు మరొకడు లేడు, వాని పోలిక లేనివాళ్లు ఇంకా వందమంది ఉన్నారు అని అంటే అది అంగీకార్యం అవుతుందా? అందుచేత ద్వైతమే సత్యం అని పట్టు పట్టకుండా అద్వైతమే ప్రధానతత్త్వం అని అంగీకరించిన పక్షంలో ప్రత్యక్షాదీతర ప్రమాణాల ద్వారా కనబడే ద్వైతప్రపంచంతో పాటు ఈ ద్వైతసూచకవాక్యాలకు కూడ సమన్వయం చూపవచ్చును.

## త్రివిధసత్తలు

ప్రాతిభాసికసత్త: శ్రీ శంకరభగవత్పాదులు ప్రాతిభాసికము, వ్యావహారికము, పారమార్థికము, అనే మూడు విధాలైన సత్తలను (సత్యత్వాలను) సప్రమాణంగా ప్రతిపాదించి ఉన్నారు. ఎండపడి ధగ ధగా మెరుస్తూన్న ముత్యపు చిప్పముక్క, గాజుముక్క మొదలైన వాటిని చూడగానే వెండి అనో, బంగారం అనో భ్రాంతి కలుగుతుంది. స్వప్నం చూస్తున్నంత సేపూ ఎన్నో పదార్థాలు కనబడుతూ ఉంటాయి. కాని వాస్తవంలో అవి అక్కడ లేవు. అయితే ఆ సమయంలో కనబడుతున్నాయి కాబట్టి అసలు లేవని చెప్పడానికి వీలులేదు. అందుచేత ఆ చూచేవానికి అవి కనబడుతున్నంత సేపూ అవి ఉన్నవనే అంగీకరించాలి. అవి నిజానికి అక్కడ లేవనే విషయం తరవాత అనగా "ఇది వెండి కాదు" "ఇది బంగారం కాదు" ఇత్యాదిరూపంలో ఉండే బాధజ్ఞానం కలిగిన తరవాత తెలుస్తుంది. ఈ విధంగా భ్రాంతిజ్ఞానసమయంలో ఆ రజతాదులకు ఉన్న సత్త (ఉనికి) ప్రాతిభాసికం.

వ్యావహారికసత్త: జీవుడు ఆది లేనివాడు. ఆ జీవుణ్ణి అనాదిగా అజ్ఞానం కూడా అనువర్తిస్తూ వస్తూన్నది. అలా అనువర్తిస్తూ రావడం మూలానే జీవుడయ్యాడు. దూరం, సూర్యకాంతి మొదలైన కారణాలచేత లేని వెండి-బంగారాలు కనబడి నట్లు కనుచీకటి అనే దోషంచేత త్రాడుమీద సర్పం కనబడినట్లు, నిద్రాదిదోషంచేత స్వాప్నజగత్తు కనబడినట్లు, అనాదిగా వస్తూన్న ఈ అజ్ఞానం (దీనికే అవిద్య, మాయ అని నామాంతరాలు) చేత జీవుడు నిత్యశుద్ధబుద్ధముక్తస్వరూపమైన బ్రహ్మమీద ఈ జగత్తును, జగత్తుకంటె ఈ బ్రహ్మకంటె వేరుగా తననూ, కల్పించుకొని చూస్తున్నాడు ఈ అవిద్యకు లోబడి ఉన్నంతవరకు ఈ జగత్తు, తాను, బ్రహ్మ (పరమేశ్వరుడు)

వేరు వేరుగా ఉంటారు. ఈ భూలోకం ఉన్నట్లే వేదపురాణాదులలో చెప్పిన వివిధలోకాలు, పుణ్యపాపాలు, వాటి ఫలాలు, స్వర్గనరకాలు, అన్నీ ఉంటాయి. ఈ లోకవ్యవహారం అంతా ఒక నిశ్చితరీతిలో మామూలుగా జరుగుతూనే ఉంటుంది. ఆ భూమికలో అదంతా సత్యమే. దీనికి వ్యావహారికసత్త అని పేరు.

పారమార్థికసత్త: "నేహ నానాస్తి కించన" అని బ్రహ్మకంటె వ్యతిరిక్తమైన మరొకవస్తు వేదీ లేదని చెప్పే ఉపనిషద్వాక్యాల శ్రవణం, మనననిదిధ్యాసలు కూడ చేసి అద్వైతబ్రహ్మ ఒక్కటే పరమార్థతత్త్వం, ఈ జగత్తు కల్పిత మైనది, నేను ఆ బ్రహ్మ ఒక్కటే అనే తత్త్వసాక్షాత్కారం కలిగిన పిమ్మట ఈ జగత్తు, ఇతర విభేదా లన్నీ కూడ నిలీనం అయిపోతాయి. అంతా బ్రహ్మగానే కనబడుతుంది. ఇది పారమార్థికసత్యం. శ్రీ శంకరభగవత్పాదులు దీని కొక చక్కని ఉదాహరణం చూపించారు. కఱ్ఱతో నిజమైన ఏనుగవంటి ప్రమాణం, ఆకారం గల ఏనుగను తయారు చేసి నిలబెట్టారు. రెండు మూడు వందల గజాల దూరంనుంచి చూచినవాని కది నిజమైన ఏనుగగానే కనబడుతుంది. అప్పుడతనికి కఱ్ఱ కనబడడం లేదు. అది ఆ ఏనుగులో లీనమైపోయింది. అతడే దగ్గరగా వెళ్ళి చూచాడు. అప్పు డతనికి కఱ్ఱమాత్రమే కనబడింది గాని ఏనుగు కనబడలేదు. అంతవరకూ కనబడిన ఏనుగ కఱ్ఱలో లీనం అయిపోయింది. అదే విధంగా ప్రపంచం కనబడుతున్నంతవరకు పరమాత్మ కనడడు; పరమాత్మను చూడ కలిగితే ఇంక ప్రపంచం కనబడదు.

"దన్తిని దారువికారే దారు తిరోభవతి సోఽపి తత్రైవ,
తద్వజ్జగతి పరాత్మా పరమాత్మన్యపి జగత్తిరోభవతి"

ఈ విధంగా పారమార్థికభూమికలో అద్వైతమే సత్యం. అది చేరనంతవరకు వ్యావహారికభూమికలో అన్ని భేదాలూ ఉంటాయి. ఉపనిషత్తులను జాగర్తగా పరిశీలిస్తే ఇందులోని ఔచిత్యం స్పష్టం అవుతుంది.

మాయావాదం ఔపనిషదం: ఈ మాయావాదాన్ని శ్రీ శంకరభగవత్పాదులు కల్పించారని అంటూ కొందరు ఆయనను దూషిస్తూంటారు. ఇదొక మాయాజనితమోహం. ఈ మాయను గూర్చి ఉపనిషత్తులు, భగవద్గీతాదులు, పురాణాలు ఎలుగెత్తి స్పష్టంగా ఘోషిస్తున్నాయి.

"ఇన్ద్రో మాయాభిః పురురూప ఈయతే" (ఋ.సం. 4.7.33)

"మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్" (శ్వే.ఉ.4.10)

"తరత్యవిద్యాం వితతాం హృది యస్మిన్ని వేశితే

యోగీ మాయామమేయాయ తస్మై విద్యాత్మనే నమః"

"అవిద్యాయామన్తరే వర్తమానాః స్వయం ధీరాః పణ్డితంమన్యమానాః" (క.ఉ.1.2.5)

ఇత్యాదులైన అనేక శ్రుతివాక్యాలలోను,

"అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః"

"నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః"

"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా

మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే"

ఇత్యాది భగవద్గీతావాక్యాలలోను,

"మాయాం తతాన జనమోహినీమ్"

"మన్యమాన ఇదం సృష్టమాత్మానమిహ సజ్జతే"

"యదిదం మనసా వాచా చక్షుర్భ్యాం శ్రవణాదిభిః,

నశ్వరం గృహ్యమాణం చ విద్ధి మాయామనోమయమ్"

ఇత్యాది భాగవతవాక్యాలలోను

"ద్వైతం మాయామయం ప్రాహ శ్రుతిః సత్యార్థవాదినీ,

వాస్తవం ప్రాహ చాద్వైతం సర్వమానాతిగామినీ"

ఇత్యాదిమానవోపపురాణాదివాక్యాలలోను మాయ పరతత్త్వాన్ని అచ్ఛాదించి వాస్తవంలో లేని జగత్తును ఉన్నట్లుగా చూపిస్తున్న దని స్పష్టంగా ప్రతిపాదించబడుచున్నది. "రజ్జ్వామహేర్భోగభవాభవౌ యథా" (రజ్జువుమీద సర్పం కనబడి దానిమీదనే అంతర్ధానమైనట్లు) ఇత్యాదిభాగవతాదివాక్యాలలో జగత్తు మిథ్య అనే విషయం స్పష్టంగా చెప్పబడింది. ఒకే సమయంలో అనేకసహస్రాంతఃపురకాంతలతో కలిసి శ్రీకృష్ణుడు ఉండడం చూచి ఆశ్చర్యపడిన నారదునితో శ్రీకృష్ణుడు నీవు చూచిన వన్నీ నా మాయారూపాలే అని చెప్పారు.

"మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద
సర్వభూతగుణైర్యుక్తం మైవం మాం జ్ఞాతుమర్హసి".
అనగా ఇతరరూపాలన్నీ సృష్టించిన కృష్ణుని మూలరూపం ఒక్కటే సత్యం, మిగిలిన రూపాలన్నీ మిథ్య అనే కదా అర్థం? ఈ విధమైన కృష్ణాద్యాశ్రితమైన మాయను అంగీకరించినప్పుడు, సకలజగదాభాసహేతువైన మాయను అంగీకరించడంలో అభ్యంతరం ఉండకూడదు. శ్రీమద్రామాయణంలో అడుగడుగునా మాయాప్రయోగం వర్ణింపబడింది. భరద్వాజుడు భరతునికి, శ్రీరామునికి తన తపోబలంచేత (మాయాశక్తి చేత) ఇచ్చిన విందును గూర్చి శ్రోతల నోళ్లూ రేటట్లు ప్రవచనాలలో వర్ణించి చెపుతూనే ఉన్నాం. ఇంద్రజిత్తు మాయాసీతాశిరస్సును ఖండిస్తే చూచి వానరాదులు హాహాకారాలు చేశారు. రాముని ఖండితమైన శిరస్సు చూపి రావణుడు సీతను భయపెట్టాడు. మాయాబలంచేత సృష్టించిన నాగపాశాలతో ఇంద్రజిత్తు రామాదులను బంధించాడు. శ్రీకృష్ణుడు తల్లికి టి.వి.లో చూపినట్లు తన నోట్లో విశ్వరూపం చూపించాడు. భగవద్గీతలోని విశ్వరూపదర్శనంలో ఇంకా జీవించియే ఉన్న భీష్మాదు లందరూ కోరలమధ్య పడి నలిగిపోతున్నట్లు, మరణిస్తూన్నట్లు అర్జునునికి చూపించాడు. మాయా కల్పితాలైన ఇవన్నీ పరమార్థసత్యాలు కాదని అందరూ అంగీకరించవలసిందే. అలాంటప్పుడు ఉపనిషత్తులలో స్పష్టంగా చెప్పిన మాయను ఆధారంగా చేసికొని యుక్తియుక్తంగా శ్రీ శంకరభగవత్పాదులు స్థాపించిన మాయావాదం స్వకపోలకల్పితం అనడం సాహసమాత్రమే అవుతుంది.

మాయాస్వరూపం : ఈ మాయ ఎవరి అధీనంలో ఉన్నది? ఎవరిమీద పని చేస్తుంది? అని ప్రశ్న. దీనికి సమాధానం కొన్ని ప్రసిద్ధదృష్టాంతాలు పరిశీలిస్తే లభిస్తుంది ఒక ఐంద్రజాలికుడున్నాడు. అతడు మన కళ్ల ఎదుటనే ఏవేవో వస్తువులను సృష్టిస్తున్నాడు. రెండు మూడు అడుగుల ఎత్తు గల, శాఖోపశాఖలతో సర్వసంపూర్ణంగా ఉన్న ఒక మామిడిచెట్టు, దానికి కాయలు సృష్టించి దాని కాయ కోసి ముక్కలు అక్క డున్న వాళ్లకి పంచిపెడుతున్నాడు. (ఇది నేను 1946లో మద్రాసులో స్వయంగా చూచిన విషయం). అతడు ఆ విధంగా ఎలా చేయకలిగాడు? ఏదో ఒక శక్తి సహాయంచేత. మా గురువుగారైన ప్రాతఃస్మరణీయులు శ్రీ పోలగం రామశాస్త్రిగారు (మద్రాసు సంస్కృత

కలాశాల) మాయను గూర్చిన చర్చ పాఠ్యగ్రంథాలలో వచ్చినప్పుడు ఒక కథ చెప్పే వారు. ఒక ఇంద్రజాలికుడు ఒక గ్రామానికి వెళ్లి గ్రామస్థుల నందరినీ పిలచి "నేను ఈ పెద్దభవనాన్ని మ్రింగివేయగలను, చూడండి" అని చెప్పి ఆ భవనాన్ని మ్రింగివేశాడట. అక్కడున్నవాళ్లందరూ ఆశ్చర్యచకితులై కోలాహలం చేస్తున్నారట. ఇంతలో కొంత దూరంలో ఉన్న తాటిచెట్టుమీద కల్లు గీయడానికి ఎక్కిన ఒక వ్యక్తి అదంతా చూచి "అతడు భవానాన్ని మ్రింగడమూ లేదు, ఏమీ లేదు; దాని ఎదురుగా నోరు తెరుచుకొని నిలబడ్డాడు; అంతే" అని బిగ్గరగా చెట్టుపైనుంచి అరచాడట. "ఓహో! ఇతడు చెట్టుమీద మిగిలిపోయాడా!" అనుకొని ఆ ఇంద్రజాలికుడు అతని వైపు చూచినాడట. దానితో "ఔను ఔను; మ్రింగి వేస్తున్నాడు" అని ఆ చెట్టు మీద నున్న వ్యక్తి కూడ అంగీకరించాడట. పైన చెప్పిన విశ్వరూపదర్శనాదులు కూడ అలాంటివే.

ఈ విషయాలను పరిశీలించి చూస్తే రెండు అంశాలు మనకు స్పష్టం అవుతాయి. ఆ ఇంద్రజాలికుని దగ్గర ఏదో ఒక శక్తి ఉంది. దానిని అతడు తన చిత్తం వచ్చినట్లు ఉపయోగించగలడు. దాని ప్రభావానికి లొంగినవాళ్లకి అక్కడ లేని వస్తువులు కనబడతాయి. ఆ శక్తికి లోబడనివారికి కనబడవు. అందుచేతనే దానికి లోబడనంతవరకు తాటిచెట్టుమీద ఉన్నవాడు సత్యపరిస్థితినే చూడకలిగాడు. ఇంద్రజాలికుని దృష్టి వానిమీద పడిన మరుక్షణంలో అతడు కూడ అందరితో సమాను డైపోయాడు. అందుచేత ఈ శక్తికి ఆశ్రయం ఐంద్రజాలికు డనీ, విషయం అక్కడ చేరిన ద్రష్ట లనీ, ఆ శక్తి అక్కడ ఉండే యథార్థస్వరూపాన్ని కప్పివేసి (దీనికే ఆవరణశక్తి అనిపేరు) లేని వస్తువును ఉన్నట్లుగా చూపిస్తూన్న దనీ (దీనికే విక్షేపశక్తి అని పేరు) గ్రహించవచ్చును. స్వప్న - రజ్జుసర్పజ్ఞానాదులలో కూడ ఈ విధంగానే సమన్వయించుకొనవచ్చును. ఒక్క భేదం ఏ మనగా అక్కడ అవిద్యకు, అజ్ఞానానికి, ఆశ్రయభూతుడు ఆ వ్యక్తియే; విషయభూతుడు కూడ ఆ వ్యక్తియే.

పైన మనం చూసిన ఐంద్రజాలికుని శక్తి పరిమిత మైనది అది కొంతమంది మీద మాత్రమే, కొంతసేపు మాత్రమే పని చేస్తుంది. మాయ అనేది అచింత్యప్రభావం గలది, అచింత్యప్రభావరూపమైనది. దాని స్వరూపస్వభావాలు ఇలా ఉంటా యని

చెప్పడం కష్టం. ఇది పరమాత్మలో ఉన్న అద్భుతశక్తి. జీవు లందరూ ఈ మాయకు లోబడినవారే. పరమాత్మ మాత్రం దీనికి అతీతుడు. అగ్నిలో ఉన్న దాహకత్వశక్తి అగ్నిని దహించదు కదా? పరమాత్మ మాత్రం తన ఇచ్ఛానుసారం దానిని ప్రవర్తింపచేయగలడు, ఉపసంహరించగలడు. ఈ మాయతో కలిసిన పరమాత్మయే జగత్తుకు ఉపాదానకారణం నిమిత్తకారణమూ కూడ. మాయాశబలితం కాని శుద్ధ పరమాత్మతత్త్వం నిర్గుణం. దానికి ఈ కర్తృత్వాదులతో సంబంధం లేదు.

జీవన్ముక్తులు తప్ప మిగిలిన జీవులందరూ అ అవిద్యలో, అజ్ఞానంలో చిక్కుకొన్నవారే. వీరు ఆ స్థితిలో ఉన్నంతవరకు జగజ్జీవాదులను వేరు వేరుగా చూస్తుంటారు. అందరూ ఒకే విధమైన రంగు గల కళ్లజోళ్ళు పెట్టుకొని ఉన్నారు. అందుచేత వాళ్ల చూపులో భేదం ఏదీ ఉండదు. తాను ధరించినది రంగు కళ్లజోడు అనే నిశ్చితజ్ఞానం ఉన్నవాడు తాను చూచుచున్నది యథార్థరూపం కాదని తన మనస్సులో నిశ్చితంగా అనుకొంటూనే ఉంటాడు. జ్ఞాని పరిస్థితి అదే.

ఈ మాయకు ఆవరణశక్తి. విక్షేపశక్తి అని రెండు శక్తు లుంటాయి. మొదటి శక్తిచేత పరమార్థతత్త్వాన్ని కప్పివేసి విక్షేపశక్తిచేత లేని ప్రపంచాన్ని చూపిస్తుంది మాయ. అందుచేత దాని అసలు స్వరూపం తెలిసికొన్నవాడు అది తనంతట తానే తొలగిపోతుంది. రజ్జుస్వరూపం తెలిసిన తరవాత సర్పం తొలగిపోయి నట్లు ఆత్మ స్వరూపం తెలిసిన తరవాత జగత్తు అదే తొలగిపోతుంది. ఇంక మిగిలేది అద్వితీయాత్మతత్త్వమే. ఈ విధంగా మాయ అనేదానిని ఉపనిషదాదిప్రతిపాదితరీతిలో అంగీకరించినప్పుడే ఉపనిషత్తుల ప్రధానోపదేశ్యమైన అద్వైతత్త్వం కుదురుతుంది.

### జగన్మిథ్యాత్వం

ఈ జగత్తు పరబ్రహ్మమీద మాయామాత్రకల్పితమనీ, అందుచేత మిథ్య అనీ శ్రీ శంకరభగవత్పాదులు అనేకస్థలాలలో అనేకవిధాలుగా శ్రుతియుక్తిసాహాయ్యంతో ప్రతిపాదించి ఉన్నారు. 'మాయావాదం' అని చెప్పబడే ఈ వాదాన్ని ప్రాఙ్నిర్ణయదూషితం కాని మనస్సుతో, నిష్పక్షపాతదృష్టితో పరిశీలించి అర్థం చేసుకొనడానికి ప్రయత్నిస్తే కొంతవరకు లాభం పొందడానికి అవకాశం ఉంటుంది. ఆయన చెప్పిన మిథ్యాత్వం అంటే ఏమిటో తెల్పుతుంది. అందుచేత ఈ సిద్ధాంతాన్ని కొంతవరకు

శ్రీశంకరభగవత్పాదుల మాటలలోనే తెలుసుకొనడానికి ప్రయత్నించుదాం.

"ఈ ప్రపంచకం అంటే పేర్లు, ఆకారాలు, కర్మలు, ఈ మూడింటి సముదాయం మాత్రమే. మిథ్యాజ్ఞానంచేత కల్పించబడిన ఈ మూడింటినీ మించి ప్రపంచం అనేది లేదు. దీనిలో ఎక్కడ చూచినా పనులు, వాటి సాధనాలు, వాటి ఫలితాలు-ఇవే కనబడతాయి. (ఎండమావులలో కనబడే) నీటిని ఎండమావుల సత్యస్వరూపాన్ని తెలుసుకొనడం ద్వారా ఎండమావులలోను, (త్రాడుమీద కనబడే) సర్పాన్ని త్రాడుయొక్క సత్యస్వరూపాన్ని తెలుసుకొనడం ద్వారా త్రాడులోను, (ఆకాశంలో ఉన్నట్లు కనబడే) నీలి రంగును ఆకాశం స్వరూపంతెలుసుకొనడం ద్వారా ఆకాశంలోను నిలీనం చేసినట్లు ఆత్మయొక్క యథార్థస్వరూపాన్ని తెలుసుకొని ఈ ప్రపంచకాన్ని ఆత్మయందే నిలీనం చేసి ఆనందరూపస్థితిని పొందాలి" అని కఠోపనిషద్భాష్యంలో చెప్పబడింది.

"ఏవం పురుషః ఆత్మని సర్వం ప్రవిలాప్య నామరూపకర్మత్రయం యన్మిథ్యాజ్ఞానవిజృమ్భితం క్రియాకారకఫలలక్షణం స్వాత్మయాథాత్మ్యజ్ఞానేన మరీచ్యుదకరజ్జుసర్పగగనమలానీవ మరీచిరజ్జుగగనదర్శనేనైవ, స్వస్థః ప్రసన్నాత్మా కృతకృత్యో భవతి" (క.ఉ.భా. 1.3.14)

"పరమాత్మ అవస్థాత్రయంతో సంబంధించి ఉండడం అనేది మాయామాత్రమే. ఇది రజ్జువు సర్పాదిరూపంలో భాసించడంవంటిదే"

"మాయామాత్రం హ్యేతత్ యత్ పరమాత్మనః అవస్థాత్రయాత్మనా అవభాసనం రజ్జ్వా ఇవ సర్పాదిభావేన" (బ్ర.సూ.భా. 2.1.9)

జగత్తు స్వప్నంతోను, మాయావి సృజించిన గంధర్వనగరంతోను పోల్చబడింది.

"ఈ జగత్తు వర్ణించిన రూపంలో ఇక్కడ లేనే లేదు; ఎందువల్లననగా ఇది స్వప్నంవంటిది; ఎండమావులలోని నీరువంటిది; మాయచేత నిర్మించబడిన గంధర్వనగరం వంటిది. కనబడి వెంటనే మాయమైపోయే స్వభావం కదా దీనిది?"

"న రూపమస్యేహ యథా ఉపవర్ణితం తథా నైవోపలభ్యతే, స్వప్నమరీచ్యుదక మాయాగన్ధర్వనగరసమత్వాత్. దృష్టనష్టస్వరూపో హి సః ఇతి" (భగవద్గీతాభాష్యమ్, 15.3)

"సర్వాంతర్గతము, సర్వ వ్యాప్తమూ అయిన ఆ పదాన్ని ప్రయత్నపూర్వకంగా అన్వేషించాలి. ఇది జ్ఞానం కోసం చేసే అన్వేషణం. ఆ పదాన్ని తెలుసుకోవాలి. ఈ పురుషుడు, ఈ చైతన్యం ఎవరు? మాయావినుండి మాయామయమైన వస్తుసముదాయం ఆవిర్భవించినట్లు ఎవనినుండి అతిప్రాచీనమైన ఈ సంసారవృక్షం బయలుదేరిందో ఆ పురుషుడే ఇతడు".

"తతః పశ్చాత్ యత్ వైష్ణవం పదం తత్పరిమార్గితవ్యమ్. పరిమార్గణమ్ అన్వేషణమ్. జ్ఞాతవ్యమిత్యర్థః..... కోఽసౌ పురుష ఇతి? ఉచ్యతే. యతః యస్మాత్ పురుషాత్ సంసారమాయావృక్షప్రవృత్తిః ప్రసృతా నిఃసృతా ఐన్ద్రజాలికాదివ మాయా, పురాణీ చిరన్తనీ" (భ.గీ.భా. 15.4)

జగత్సృష్టికి మాయ కారణం అని చెప్పడంలో మాయ జగత్తును సృష్టిస్తున్నది అని ఉపనిషత్తుల అభిప్రాయం కాదు. ఉపనిషత్తుల ప్రకారం మాయోపహితమైన (మాయతో కూడిన) బ్రహ్మమే జగత్తుకు కారణం. ఈ స్థితిలో బ్రహ్మ సగుణమైనది. బ్రహ్మకు సంబంధించి నంతవరకు ఈ జగత్తు దాని వివర్తం మాత్రమే. అభాసమాత్రమే. త్రాడు మీద అభాసించే సర్పం వంటిది. అయితే మాయకు సంబంధించి నంతవరకు జగత్తు మాయాపరిణామం. పెద్ద తరంగాలు, చిన్న అలలు, బుడగలు మొదలైనవి ఏ విధంగా నీటియొక్క పరిణామాలో అట్లే జగత్తు కూడ మాయయొక్క పరిణామం. ఈ విషయాన్ని శ్రీ భగవత్పాదులు భోక్త్రాపత్త్యధికరణంలో స్పష్టీకరించారు.

"ఉపపద్యత అయమస్మత్పక్షేఽపి విభాగః, ఏవం లోకే దృష్టత్వాత్. తథాహి-సముద్రాదుదకాత్మనః అనన్యత్వేఽపి తద్వికారాణాం వీచీతరఙ్గబుద్బుదాదీనా మితరేతరవిభాగః, ఇతరేతరసంశ్లేషాదిలక్షణశ్చ వ్యవహారః ఉపలభ్యతే (బ్ర.సూ.భా. 2.1.13).

"మా సిద్ధాంతం ప్రకారం కూడ భేదదృష్టి ఉపపన్నమే. ఇందుకు తగిన దృష్టాంతాలు మామూలుగా లోకానుభవంలో ఉన్నాయి కదా? ఉదాహరణకి - తరంగాలు, నురుగు, బుడగలు, ఇవన్నీ సముద్రజలంకంటె అభిన్నములే అయినా అవన్నీ వేరుగా ఉంటూనే ఉన్నాయి. ఒకప్పుడు ఒకదానికి ఒకటి దూరంగా ఉంటాయి. ఒక్కొకప్పుడు కలుస్తూంటాయి."

ఇలాంటి అభిప్రాయాన్ని వ్యక్తీకరిస్తూ శ్రీభగవత్పాదులు సగుణబ్రహ్మమైన విష్ణువునకు భక్తునకు మధ్య ఉన్న సంబంధం ఇలాంటిదే అని షట్పదీస్తోత్రంలో వర్ణించారు. ఒక ఆగ్లఐతిహాసకుడు ఈ శ్లోకాన్ని ఉదాహరిస్తూ శ్రీశంకరాచార్యులు మహాతత్త్వజ్ఞాని మాత్రమే కాకుండా మహాకవి కూడ అని కొనియాడాడు. శ్రీభగవత్పాదులు శ్రీమహావిష్ణువుతో ఇలా చెపుతారు - "ఓ! విష్ణూ! శుద్ధచైతన్యరూపంలో నిజానికి నీకూ నాకూ మధ్య భేదం లేదు. కాని పరమేశ్వరుడు భక్తుడు అనే సంబంధాన్ని పురస్కరించుకొని మాటలాడి నప్పుడు "నేను నీవాడను" అని అనాలి కాని "నువ్వు నావాడవు" అని నే ననకూడదు. ఎందువల్ల ననగా సముద్రానికీ తరంగానికీ మధ్య భేదం లేక పోయినా "సముద్రంయొక్క తరంగం" అంటాం కాని "తరంగంయొక్క సముద్రం" అని అనం కదా?"

"సత్యపి భేదాపగమే నాథ తవాహం న మామకీనస్త్వమ్,
సాముద్రో హి తరఙ్గః క్వచన సముద్రో న తారఙ్గః"

కార్యంయొక్క సత్త కారణసత్తతో సమానమైతే అది పరిణామం. విషమం అయితే అది వివర్తం. ఘటం కార్యం, మృత్తు కారణం. కార్యమైన ఘటంయొక్క సత్త కారణమైన మృత్తుయొక్క సత్తతో సమానమైనదే గాన ఘటం మృత్తుయొక్క పరిణామం; మార్పు చెందిన ఆకారం మాత్రమే. రజ్జుసర్పభ్రాంతిలో సర్పానికి రజ్జువు కారణం. కాని రజువుయొక్క సత్యత్వంకంటె సర్పంయొక్క సత్యత్వం తక్కువ స్థాయికి చెందినది. మొదటిది వ్యావహారికసత్యత్వం, రెండవది ప్రాతిభాసికసత్యత్వం. అందుచేత సర్పం రజ్జువుయొక్క వివర్తం. జగత్తు మిథ్య గాన, వ్యావహారికసత్త మాత్రమే ఉన్నది గాన, దాని సత్త బ్రహ్మయొక్క సత్తకంటె తక్కువది. అందుచేత అది బ్రహ్మయొక్క వివర్తం. దాని సత్త మాయయొక్క సత్తతో సమాన మైనది. అందుచేత అది మాయాపరిణామం.

### వేదాంతుల మాయ సాంఖ్యుల ప్రధానం కాదు.

జగత్సృష్టికి లేదా జగదవభాసనానికి కారణ మని చెప్పబడే ఈ మాయ సాంఖ్యులంగీకరించిన, ప్రధానం అనే నామాంతరం గల మాయ కాదు. ఆ మాయ నిత్యమైనది, సత్యమైనది, స్వతంత్రమైనది. అయితే అద్వైతుల మాయకు స్వతంత్రమైన స్థితి లేదు. ఈవిషయాన్ని శ్రీ శంకరభగవత్పాదులు అనేక స్థలాలలో స్పష్టీకరించి

ఉన్నాయి.

"యది వయం స్వతన్త్రాం కాంచిత్ప్రాగవస్థాం జగతః కారణత్వేన అభ్యుపగచ్ఛేమ ప్రసంజయేమ తదా ప్రధానకారణవాదమ్. పరమేశ్వరాధీనా త్వియమస్మాభిః ప్రాగవస్థా జగతోఽభ్యుపగమ్యతే; న స్వతన్త్రా, అర్థవతీ హి సా. న హి తయా వినా పరమేశ్వరస్య స్రష్టృత్వం సిధ్యతి. శక్తిరహితస్య తస్య ప్రవృత్త్యనుపపత్తేః. ముక్తానాం చ పునరనుత్పత్తిః. కుతః? విద్యయా తస్యాః బీజశక్తేర్దాహాత్. అవిద్యాత్మికా హి సా బీజశక్తిః అవ్యక్తశబ్దనిర్దేశ్యా పరమేశ్వరాశ్రయా మాయామయీ మహాసుప్తిః. యస్యాం స్వరూపప్రబోధరహితాః శేరతే సంసారిణో జీవాః. తదిదమవ్యక్తం క్వచిదాకాశశబ్దనిర్దిష్టమ్- "ఏతస్మిన్ను ఖల్వక్షరే గార్గి ఆకాశ ఓతశ్చ ప్రోతశ్చ" (బృ.ఉ. 3.8.11) ఇతి శ్రుతేః. క్వచిదక్షరశబ్దోదితమ్ "అక్షరాత్ పరతః పరః" (ము.ఉ. 2.11.2) ఇతి శ్రుతేః. క్వచిత్ మాయేతి సూచితమ్-"మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్" (శ్వే.ఉ. 4.10) ఇతి మన్త్రవర్ణాత్. అవ్యక్తా హి సా మాయా, తత్త్వాన్యత్వనిరూపణస్య అశక్యత్వాత్" (బ్ర.సూ.భా. 1.4.3)

"స్వతంత్రమైన ఒకానొక ప్రాగవస్థ జగత్తుకు కారణం అని మేం అంగీకరించి ఉన్నట్లయితే అప్పుడు మేం ప్రధానకారణవాదాన్ని అంగీకరించినట్లు అయ్యేది. జగత్తు యొక్క ఈ ప్రాగవస్థ పరమేశ్వరాధీన మైనది అని మాత్రమే అంగీకరిస్తున్నాం కాని ఇది స్వతంత్రమైనది అని అంగీకరించడంలేదు. దానిని తప్పకుండా అంగీకరించాలి. దానికి ప్రయోజనం ఉంది. అది లేకపోతే పరమేశ్వరునికి సృష్టికర్తృత్వం కుదరదు. శక్తి లేని పరమేశ్వరుడు ప్రవర్తింపజాలడు కదా? (దీనిని అంగీకరిస్తేనే) ముక్తులకు మళ్లీ పుట్టకపోవడం అనేది కుదురుతుంది. ఎందువల్ల? విద్యచేత (జ్ఞానంచేత) ఆ బీజశక్తి కాల్చివేయబడుతుంది. అవిద్యారూపమైన ఆ బీజశక్తి అవ్యక్తం అని చెప్పబడుతుంది. ఇది పరమేశ్వరుణ్ణి ఆశ్రయించుకొని ఉన్న మాయారూపమైన మహానిద్ర. దీనిలోనే సంసారులైన జీవులందరూ స్వరూపజ్ఞానం లేకుండా (ఒళ్లు తెలియకుండా) నిద్రపోతున్నారు. "ఏతస్మిన్ను ఖల్వక్షరే గార్గి ఆకాశ ఓతశ్చ ప్రోతశ్చ" (గార్గీ! ఈ అక్షరం (బ్రహ్మ) మీదనే ఈ ఆకాశం పడుగుపేకలుగా అల్లబడి ఉంది) ఇత్యాదిశ్రుతులలో ఈ అవ్యక్తమే ఆకాశశబ్దంచేత నిర్దేశించబడింది. "అక్షరాత్పరతః

పరః" (పరమైన అక్షరంకంటె పరుడు) ఇత్యాదిశ్రుతులలో ఇదే అక్షరశబ్దంచేత నిర్దేశించబడింది. "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్" ఇత్యాది శ్రుతులలో ఇదే మాయ అని చెప్పబడింది. ఎందువల్ల ననగా తత్త్వాన్యత్వాలచేత నిరూపించడానికి శక్యం కాదు గాన ఆ మాయ అవ్యక్తం."

ఇక్కడ "తత్త్వాన్యత్వనిరూపణస్యాశక్యత్వాత్" అనగా మాయ బ్రహ్మస్వరూపమే అని చెప్పడం కుదరదు; అలా చెపితే బ్రహ్మ ఏ విధంగా సత్యమైనదో మాయ కూడా ఆ విధంగానే సత్య మైనది అని అంగీకరించవలసి వస్తుంది. ఇది బ్రహ్మకంటె భిన్నమైనది అని చెప్పడం కూడ కుదరదు; అలా చెపితే ఇది జగత్తుకు కారణం కాజాలదు. ఆకాశాదులు బ్రహ్మనుండి పుడుతున్నా యని కదా శ్రుతులు చెపుతున్నాయి? అందుచేత మాయ సత్ కాదు, శశశృంగాదుల వలె అసత్ కూడ కాదు. ఈ విధంగా దీని స్వరూపాన్ని ఏ విధంగానూ కూడ నిర్వచించడానికి శక్యం కాదు గాన ఇది అనిర్వచనీయం. జగత్తుకు కారణమైన మాయ అనిర్వచనీయ మైనప్పుడు కార్యమైన జగత్తు అనిర్వచనీయం అని వేరుగా చెప్ప నవసరం లేదు.

### మిథ్యాత్వాన్ని గూర్చిన కొన్ని అపోహలు - తన్నిరాకరణం

ఈ విధంగా జగత్తు అనిర్వచనీయం, అనగా మిథ్య, అని శ్రీ శంకరభగవత్పాదులు ప్రతిపాదించగానే తరువాతి కాలంలో వచ్చిన చాలమంది వివిధసంప్రదాయప్రవర్తకులు ఏదో మహాప్రమాదం వచ్చిం దని ఉలిక్కిపడి, కంగారుపడి పోతూ ఈ జగన్మిథ్యాత్వాన్ని గూర్చి అనేకమైన అక్షేపణలు లేవదీయడం ప్రారంభించారు. వాటిలో అందరూ అడిగే, చిన్నపిల్లల ప్రశ్న వంటి ప్రశ్న ఇది. జగత్తు మిథ్యా అంటున్నావు కదా? ఈ మిథ్యాత్వం కూడ జగత్తులో అంతర్గతమే కదా? అందుచేత ఈ మిథ్యాత్వం కూడ మిథ్యయే కావాలి. అప్పుడు జగత్తు సత్యమనే తేలుతుంది కదా?

"మిథ్యాత్వస్య చ మిథ్యాత్వే సత్యత్వం స్థాపితం భవేత్"

ఈ ప్రశ్నకు సమాధానం ఇదే భాషలో చెప్పవచ్చును. మిథ్యాత్వం మిథ్య అయినట్లే మిథ్యాత్వంయొక్క మిథాత్వం కూడ మిథ్యయే. అందుచేత మళ్లీ జగన్మిథ్యాత్వమే స్థాపించబడుతుంది. ఈవిధంగా-

"మిథ్యాత్వమిథ్యాత్వస్యాపి మిథ్యాత్వే సత్యతా కుతః"

అని ప్రతిబంద్యా ఉత్తరం ఇవ్వవచ్చు. ఆ మిథ్యాత్వంయొక్క మిథ్యాత్వం అంటూ ఇలా పొడిగించుకుంటూ పోతే అది నిజంగానే చిన్నపిల్లల ఆట అవుతుంది. మనం ఇలా మాటలతో ఆడుకుంటూండగానే బ్రహ్మజ్ఞానం కలిగినవానికి ఈ మిథ్యాత్వాదు లన్నింటితోనూ సహా మొత్తం జగత్తంతా కొట్టుకొనిపోతుంది. ఇలాంటి శాస్త్రీయసమాధానాలు బ్రహ్మవిద్యాభరణ (2.1.18) అద్వైతసిద్ధ్యాదులలో విశదంగా సప్రమాణంగా చూపబడ్డాయి.

జగత్తు మిథ్య అయినప్పుడు జగదంతర్గతమైన వేదాంతంకూడ మిథ్యయే కదా; దానివల్ల సత్యమైన బ్రహ్మజ్ఞానం ఎలా కలుగుతుంది?నిజానికి, అంతా బ్రహ్మ మయమే అవడంవల్ల ఆచార్యుడులేడు, శిష్యుడు లేడు, శాస్త్రమూలేదు. జ్ఞానోపదేశ మనేదే కుదరదు అనేది మరొక విమర్శ. దీనికి శ్రీశంకరభగవత్పాదులు అనేకప్రదేశాలలో సమాధానాలు చెప్పే ఉన్నారు. అన్ని మాట్లు చెప్పినా అవి చదవకో చదివినా అర్థంకాకో, "ఏమైనా సరే మేం అర్థం చేసికొనదలచుకోలేదు" అనే పట్టుదలచేతనో ఆచార్యపదం అధిష్ఠించిన వారు కూడా ఈ విమర్శలు మాటిమాటికీ చేస్తూనే ఉంటారు. ఈ అశంకకు శ్రీశంకరభగవత్పాదులు చెప్పిన సమాధానం ఇది.

"కథం త్వసత్యేన వేదాన్తవాక్యేన సత్యస్య బ్రహ్మాత్మభావస్య ప్రతిపత్తిరుపపద్యేత? న హి రజ్జుసర్పేణ దష్టో మ్రియతే, నా పి మృగతృష్ణికామ్భసా పానావగాహనాది ప్రయోజనం క్రియతే ఇతి. నైష దోషః. శఙ్కావిషాది నిమిత్తమరణాదికార్యదర్శనాత్. స్వప్నదర్శనావస్థస్య చ సర్పదంశనోదకస్నానాది కార్యదర్శనాత్. తత్ర కార్యమప్యనృతమేవేతి చేత్ బ్రూయాత్; తత్ర బ్రూమః - యద్యపి స్వప్నదర్శనావస్థస్య సర్పదంశనోదకస్నానాది కార్యమనృతం తథాపి తదవగతిః సత్యమేవ ఫలమ్. ప్రతిబుద్ధస్యాప్యబాధనాత్. న హి స్వప్నాదుత్థితః స్వప్నదృష్టం సర్పదంశనాది కార్యం మిథ్యేతి మన్యమానః తదవగతిరపి మిథ్యేతి మన్యతే కశ్చిత్"

(బ్ర.సూ.భా. 2.1.14 తదనన్యత్వాధికరణం)

"అసత్యమైన వేదాంతవాక్యంచేత సత్యమైన బ్రహ్మాత్మభావంయొక్క జ్ఞానం ఎలా కలుగుతుంది? రజ్జుసర్పం కరచినవాడు మరణించడం లేదు కదా?

ఎండమావులలోని నీళ్లచేత పానం, స్నానం మొదలైన పనులు చేయబడడం లేదు కదా? ఈ దోషం లేదు. శంకావిషాదులవల్ల కలిగిన (అ పాముకరిచింది, విషం ఎక్కింది అనే శంకవల్ల కలిగిన) మరణాదికార్యాలు కనబడుతున్నాయి కదా? స్వప్నం చూచే అవస్థలో ఉన్నవానికి సర్పం కరవడం, నీళ్లలో స్నానం చేయడం మొదలైన కార్యాలు కనబడుతున్నాయి కదా? అక్కడ ఉన్న కార్యం కూడ అసత్యమే అన్నట్లయితే ఈ విషయంలో (సమాధానం) చెపుతున్నాం. స్వప్నదర్శనావస్థలో ఉన్నవానికి సంబంధించిన, సర్పం కరవడం, ఉదకంలో స్నానం చేయడం మొదలైన కార్యం అసత్యమే అయినా దాని జ్ఞానం అనే ఫలం సత్యమే కదా? మేల్కొన్న తరవాత కూడ జ్ఞానరూపమైన ఈ ఫలం బాధించ బడడంలేదు. స్వప్నంనుండి మేల్కొని స్వప్నంలో కనబడిన సర్పదంశనాదికార్యం మిథ్య అని అనుకుంటూన్నవాడు ఎవ్వడూ ఆ కార్యంయొక్క జ్ఞానాన్ని కూడ మిథ్య అని అనుకొనడం లేదు కదా?

"బ్రహ్మ తప్ప మరేమీ లేదనే పక్షంలో ఎవ్వడూ, ఎవ్వనికీ, ఏమీ ఉపదేశించడానికి అవకాశమే లేదు" అనే ఈ అక్షేపాన్ని శ్రీ శంకరభగవత్పాదులు బృహదారణ్యకోపనిషద్భాష్యంలో కూడ చక్కగా సమాధానం చెప్పారు. "అత్యున్నతము, పారమార్థికమూ అయిన అద్వైతతత్త్వభూమికలో ఇలాంటి భేదాలకు అవకాశం లేదు అని నీ ఆక్షేపణకు అభిప్రాయ మైతే అది మాకు కూడ అంగీకార్యమే. అలా కాక బ్రహ్మస్థితి ఇంకా లభించని క్రింది భూమికలో నైతే ఈ అక్షేపానికి అవకాశం లేనే లేదు. ఆ భూమికలో కర్త, కర్మ, కరణం మొదలైన భేదా లన్నీ స్పష్టంగా కనబడుతుండగా అవేవీ లేవని ఎలా అంటావు? అందుచేత అద్వైతతత్త్వం అనే ఈ మహాదుర్గంలోనికి అల్పబుద్ధులు గాని, శాస్త్రగురుప్రసాదం లేని తార్కికు లనే భటులు, భట్రాజులు గాని ప్రవేశించజాలరు".

"యదుక్తం బ్రహ్మైకత్వే యస్మై ఉపదేశః, యస్య చ ఉపదేశగ్రహణఫలం తదభావాత్ ఏకత్వోపదేశానర్థక్యమితి; తదపి న; అనేకకారకసాధ్యత్వాత్ క్రియాణాం కశ్చోద్యో భవతి? ఏకస్మిన్ బ్రహ్మణి నిరుపాధికే న ఉపదేశః, న ఉపదేష్టా, న చ ఉపదేశగ్రహణఫలమ్; తస్మాదుపనిషదాం చానర్థక్యమిత్యేతదభ్యుగతమేవ. అథ అనేకకారకానర్థక్యం చోద్యతే, న. స్వతోఽభ్యుపగమవిరోధాత్ ఆత్మవాదినామ్. తస్మాత్

తార్కికచాటభటరాజాప్రవేశ్యం దుర్గమిదం అల్పబుద్ధ్యనవగమ్యం.
శాస్త్రగురుప్రసాదరహితైశ్చ" (బృ.ఉ.భా. 2.1)

ఉపనిషత్తులలో రెండు రకాలైన వాక్యాలు కనబడుతున్నాయి. నిర్విశేషము. నిర్గుణము అయిన బ్రహ్మ ఒక్కటే సత్యం అని కొన్ని వాక్యాలు బోధిస్తూండగా కొన్ని వాక్యాలు వివిధరూపాలలో సగుణబ్రహ్మను, అనేక విధాలైన భేదాలకు నెలవైన జగత్తును వర్ణిస్తున్నాయి. ఈ రెండు విధాలైన వాక్యాల మధ్య సమన్వయం సంపాదించడం కోసం శ్రీ శంకరభగవత్పాదుల ప్రవేశపెట్టిన ఈ మిథ్యాత్వవాదాన్ని మనం వెనుక చూచినట్లు తరువాత సంప్రదాయాలవారు పొరబాటుగా అర్థంచేసుకొన్నారనేనా చెప్పాలి లేదా కావాలని వక్రవ్యాఖ్యానాలు చేయడానికి పూనుకున్నారని చెప్పాలి. త్రాడుమీద సర్పం ఆరోపించబడినట్లు బ్రహ్మమీద జగత్తు ఆరోపించబడింది అని వినగానే వీళ్లందరికీ తమ పాదాల క్రింద నేలను దొవిచివేస్తున్నంత భయం కలిగింది. ఒక సత్యమైన పదార్థాన్ని అనగా నిజానికి ఒక రూపంలో ఉన్న పదార్థాన్ని, మరొక రూపంలో చూడడం జరుగుతూ ఉంటుంది అనే విషయం బుద్ధికి పట్టడానికి మాత్రమే శుక్తిరజతం, రజ్జుసర్పం మొదలైన దృష్టాంతాలు చూపబడ్డాయి. దృష్టిదోషం, వెలుతురు చాలకపోవడం మొదలైన కారణాలచేత త్రాడుమీద సర్పం ఆరోపించబడితే జీవు డే విధంగా అనాదియో అదే విధంగా అనాదియైన మాయయొక్క శక్తిచేత జగత్తు బ్రహ్మమీద ఆరోపించబడుచున్నది. సర్పాన్ని ఆరోపించడానికి హేతువైన అజ్ఞానం (అవిద్య) కొన్ని క్షణాలలో తొలగింపబడుతే కొన్ని వందల జన్మలెత్తిన తరవాతనే మాయను తొలగించుకొనడానికి శక్యం కావచ్చు. ఈ దృష్టాంతదార్ష్టాంతికాలమధ్య ఉన్న సామ్యం (పోలిక) ఇంత మాత్రమే. దీనిని ఇంతకు మించి ముందుకు త్రోయడానికి వీలులేదు. త్రోయకూడదు. మాయ, జీవుడు, జగత్తు అనేవి రజ్జ్వజ్ఞానము. సర్పమూ వలె అత్యల్పకాలికములు కాదు. అద్వైతసిద్ధాంతం ప్రకారం - జీవుడు. పరమేశ్వరుడు, శుద్ధచైతన్యం, జీవపరమాత్మల భేదం, అవిద్య, అనగా మాయ. మాయాచైతన్యాల సంబంధం ఈ ఆరూ అనాదులు-

"జీవ ఈశో విశుద్ధా చిత్తథా జీవేశయోర్భిదా,
అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాకమనాదయః".

## వేదాంతుల జగన్మిథ్యాత్వానికీ ఇతరుల జగత్సత్యత్వానికీ భేదం లేదు

"సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" ఇత్యాద్యుపనిషత్తులు బ్రహ్మ సత్యం అని చెప్పుతున్నాయి. ఈ సత్యశబ్దాన్నే జగత్తు విషయంలో కూడ ఉపయోగిస్తే జగత్తు కూడ బ్రహ్మం ఎంత సత్యమో అంతే సత్యం అనే భ్రాంతి కలగవచ్చు. అప్పుడు బ్రహ్మ ఒకటే సత్యం అని ప్రతిపాదించే శ్రుతుల ప్రామాణ్యానికి విఘాతం కలుగుతుంది. అందుచేత ఈ రెండు సత్యత్వాల మధ్య నున్న భేదం స్పష్టంగా తెలపడం కోసం శ్రీ శంకరభగవత్పాదులు జగత్తులో ఉన్న ఆపేక్షికమైన సత్యత్వానికి వ్యావహారికసత్యత్వం అని పేరుపెట్టారు. రజ్జుసర్పంలో ఉన్న సత్యత్వానికి ప్రాతిభాసికసత్యత్వం అని పేరు పెట్టారు. అంతేనే కాని ఈ జగత్తు రజ్జుసర్పంవలె ప్రాతిభాసికం అని శ్రీ శంకరభగవత్పాదు లెన్నడూ అభిప్రాయపడలేదు. ఎక్కడో పది లక్షలమందిలో ఒక్కడుగా ఉండే జీవన్ముక్తునికి (జ్ఞానోదయానంతరం) ఇది ప్రాతిభాసికం అయితే కావచ్చునేమో! అందుచేత ఇతరదార్శనికులు అంగీకరించిన జగత్సత్యత్వానికీ, అద్వైతు లంగీకరించిన జగన్మిథ్యాత్వానికీ భేదం లేదు. భేదం అల్లా మాటలలో మాత్రమే. బ్రహ్మసాక్షాత్కారం కలిగే వరకు జగత్తు ఉంది, పుణ్యపాపా లున్నాయి. స్వర్గనరకాదు లున్నాయి. పురాణాదులలో వర్ణించిన అన్ని లోకాలూ ఉన్నాయి. ఈ విషయం శ్రీ శంకరభగవత్పాదులు అనేకస్థలాలలో సుస్పష్టంగా ప్రతిపాదించారు. ఎవరైనా ఈ వాక్యాల వైపు పెడచెవి పెట్టి "జగత్తు మిథ్య అంటే అయ్యో! జగద్వ్యవహారం నడవదే: ప్రమాణప్రమేయాదిభేదం కుదరదే" అని ఆక్రోశిస్తూనే ఉంటే అందుకు బాధ్యుడు అద్వైతి కాదు. "నాయం స్థాణోరపరాధః యదేనమ్ అన్ధో న పశ్యతి". అయితే జగత్సత్యత్వం బ్రహ్మసత్యత్వం వంటిదే అంటే మాత్రం అది శ్రుతివిరుద్ధం. అద్వైతులకు అలాంటి సత్యత్వం అంగీకార్యం కాదు.

శ్రీశంకరభగవత్పాదులు ఛాందోగ్యోపనిషద్భాష్యంలో ఇలా అంటారు. "ప్రాక్ సదాత్మప్రతిబోధాత్ స్వవిషయేఽపి సర్వం సత్యమేవ, స్వప్నదృశ్యా ఇవేతి న కశ్చిద్విరోధః" (ఛా.ఉ.భా. 84)

"స్వప్నంలో చూస్తూన్న వస్తువు లన్నీ ఆ స్వప్నం చూస్తున్నంత సేపూ ఏ విధంగా సత్యమైనవో అదే విధంగా అద్వితీయాత్మసాక్షాత్కారం కలిగే వరకు అంతకు పూర్వం చూస్తూన్న దంతా స్వవిషయంలో (దాని స్వరూపంలో, అది ఎలా కనబడితే

అలా) సత్యమే."

సూత్రభాష్యంలో ఒక స్థలంలో ఇలా అంటారు. "నను ఏకత్వాభ్యుపగమే నానాత్వాభావాత్ ప్రత్యక్షాదీని లౌకికాని ప్రమాణాని వ్యాహన్యేరన్; నిర్విషయత్వాత్; స్థాణ్వాదిష్వివ పురుషాదిజ్ఞానాని. తథా విధిప్రతిషేధశాస్త్రమపి భేదాపేక్షత్వాత్ తదభావే వ్యాహన్యేత. మోక్షశాస్త్రమపి, శిష్యశాసిత్రాదిభేదసాపేక్షత్వాత్. కథం చానృతేన మోక్షశాస్త్రేణ ప్రతిపాదితస్య ఆత్మైకత్వస్య సత్యత్వముపపద్యేతేతి అత్రోచ్యతే-నైష దోష. సర్వవ్యవహారాణామేవ ప్రాగ్ బ్రహ్మాత్మత్వవిజ్ఞానాత్ సత్యత్వోపపత్తేః, స్వప్నవ్యవహారస్యేవ ప్రాక్ప్రబోధాత్. యావద్ధి న సత్యాత్మైకత్వప్రతిపత్తిః తావత్ప్రమాణ ప్రమేయఫలలక్షణేషు వికారేష్వనృతత్వబుద్ధిః న కస్య చిదుత్పద్యతే. వికారానేవ త్వహం మమేతి అవిద్యయా ఆత్మీయేన భావేన సర్వో జన్తుః ప్రతిపద్యతే స్వాభావికీం బ్రహ్మాత్మతాం హిత్వా. తస్మాత్ ప్రాగ్ బ్రహ్మాత్మతాప్రతిబోధాత్ ఉపపన్నః సర్వో లౌకికో వైదికశ్చ వ్యవహారః". (బ్ర.సూ.భా. 2.1.14, తదనన్యత్వాధికరణమ్).

"ఏకత్వమే కాని భేదం అనేది లేదు అని అంటే ప్రత్యక్షాదిప్రమాణాలచేత గ్రహింపదగిన విషయమే లేకపోవడం చేత, "ఇది స్థాణువే" అను జ్ఞానం కలిగిన తరవాత (అంతకు మునుపు కలిగిన) "ఇతడు పురుషుడు" అనే జ్ఞానానికి ఏ విధంగా అవకాశం లేకుండా పోతుందో అదే విధంగా లౌకికమైన ఈ ప్రత్యక్షాదిప్రమాణా లన్నీ వ్యర్థము లైపోతాయి. అదే విధంగా భేదదృష్టిమీద ఆధారపడి ఉన్న విధిశాస్త్రమూ, నిషేధశాస్త్రమూ, శిష్యుడు ఆచార్యుడు ఇత్యాదిభేదదృష్టిమీద ఆధారపడి ఉన్న మోక్షశాస్త్రంచేత ప్రతిపాదించబడిన ఆత్మైకత్వం సత్యం ఎలా అవుతుంది? ఇక్కడ (సమాధానం)చెప్పబడుచున్నది. ఈ దోషం లేదు. మెలకువ రావడానికి ముందు స్వప్నవ్యవహారం అంతా సత్యం అయినట్లు బ్రహ్మాత్మత్వజ్ఞానానికి ముందు సకలవ్యవహారాలు సత్యము లవడం కుదురుతుంది. సత్యాత్మైకత్వజ్ఞానం ఎంతవరకు కలగదో అంతవరకు ఎవనికీ కూడ ప్రమాణములు ప్రమేయములు ఫలములు ఈ రూపాలలో నున్న వికారా లన్నీ అసత్యములు అనే బుద్ధి కలగదు కదా? ప్రతీవాడు అవిద్యచేత తన సహజమైన బ్రహ్మాత్మత్వాన్ని విడిచి వికారాలనే 'తాను', 'తమవి' అని గ్రహిస్తుంటాడు. అందువల్ల సమస్తమైన లౌకికవ్యవహారమూ, వైదికవ్యవహారమూ కూడ బ్రహ్మాత్మతాజ్ఞానానికి ముందు కుదురుతుంది".

నిజానికి శంకరభగవత్పాదులు చతుర్థసూత్రవ్యాఖ్యాంతంలోనే ఔపనిషద సంప్రదాయజ్ఞుడైన ఒక ప్రాచీనాచార్యుని మూడు శ్లోకాలు ఉదాహరిస్తూ ఈ విషయాన్ని స్పష్టీకరించారు.

"తస్మాదహంబ్రహ్మాస్మీత్యేతదవసానా ఏవ సర్వే విధయః సర్వాణి చేతరాణి ప్రమాణాని. న హి అహేయానుపాదేయాద్వైతాత్మావగతౌ నిర్విషయాణి అప్రమాతృకాణి చ ప్రమాణాని భవితుమర్హన్తి ఇతి. అపి చాహుః-

"గౌణమిథ్యాత్మనోఽసత్త్వే పుత్రదేహాదిబాధనాత్
సద్బ్రహ్మాత్మాహమిత్యేవం బోధే కార్యం కథం భవేత్.
అన్వేష్టవ్యాత్మవిజ్ఞానాత్ప్రాక్ ప్రమాతృత్వమాత్మనః,
అన్విష్టః స్యాత్ ప్రమాతైవ పాప్మదోషాదివర్జితః.
దేహాత్మప్రత్యయో యద్వత్ప్రమాణత్వేన కల్పితః,
లౌకికం తద్వదేవేదం ప్రమాణం త్వాత్మనిశ్చయాత్". (బ్ర.సూ.భా. 1.1.4)

"అందువల్ల సమస్తమైన విధులు, సమస్తప్రమాణాలు కూడా 'అహం బ్రహ్మాస్మి' అనే జ్ఞానం కలగగానే అంతమైపోతాయి. ఎందువల్ల ననగా అద్వితీయాత్మసాక్షాత్కారం కలగగానే ప్రమాత ప్రమేయాలు ఇవన్నీ కూడ అంతర్హితాలైపోతాయి. నిజానికి ఈ అద్వితీయాత్మ నిరాకరించడానికి శక్యం కాదు; క్రొత్తగా పొందబడేది కాదు. దీని సాక్షాత్కరం కలిగిన తరవాత ప్రమాణాలు వాటి ప్రమాణత్వాన్ని కోల్పోతాయి. అందుచేతనే వారు (బ్రహ్మజ్ఞానం కల సంప్రదాయజ్ఞులు) ఇలా అన్నారు.

"సద్రూపమైన బ్రహ్మయే నేను (నేను ఆ సద్రూపబ్రహ్మయే) అనే జ్ఞానం కలిగిన తరవాత గౌణాత్మ మిథ్యాత్మ కూడ ఉండవు. అప్పుడు పుత్రాదులు దేహాదులు కూడ బాధితములైపోతాయి. అలాంటప్పుడు ఇంక చేయవలసిన కార్యం ఏముంటుంది.?"

"ఆత్మకు ప్రమాతృత్వం అనేది అన్వేషింపదగిన అత్మస్వరూపంయొక్క జ్ఞానం కలిగేటంతవరకే. ఇంతవరకు అన్వేషించబడినవాడు పాపాలు దోషాలు లేని ప్రమాతయే. (ఆ ఆత్మస్వరూపం తెలియగానే ప్రమాతయొక్క ప్రమాతృత్వం తొలగి పోతుంది.")

"ఆత్మ సాక్షాత్కారం కలిగేవరకు, దేహమే ఆత్మ అనే జ్ఞానం ఏ విధంగా

ప్రమాణంగా అంగీకరించబడిందో, అదే విధంగా లౌకికప్రమాణం కూడ ప్రమాణంగా అంగీకరించబడుతుంది."

ప్రపంచ స్వభావాన్నీ, స్వరూపాన్నీ గూర్చి మిథ్యావాదియొక్క అభిప్రాయాన్ని సుస్పష్టం చేయడంచేత ఈ మూడు శ్లోకాలకి ఒక వైశిష్ట్యం ఉంది. ఈ మూడు శ్లోకాల భావాన్ని వాచస్పతిమిశ్రుడు ఈ విధంగా వివరించాడు.

"తనకీ తన దారపుత్రాదులకీ ఏమీ భేదం లేదన్నట్లు ప్రతీ వాడూ అనుకొంటూ ఉంటాడు. అందుచేతనే వాళ్లు సుఖంగా ఉన్నప్పుడు తాను కూడ ఆనందిస్తాడు వాళ్లు కష్టాలలో ఉన్నప్పుడు దుఃఖిస్తాడు. అందుచేత వీనికి దారపుత్రాదులు గౌణాత్మ. ఈ అభేదబుద్ధి సుఖదుఃఖా లనే గుణాలను పట్టి ఏర్పడింది గాన దీనికి గౌణాత్మ అని పేరు. అదే విధంగా మానవుడు అజ్ఞానంచేత శరీరమే తాననీ, ఇంద్రియాలే తాననీ అనుకొంటూ ఉంటాడు. అందుచేత ఇవి వాని మిథ్యాత్మ. లోకయాత్ర, లౌకికవ్యవహారం అంతా, ఈ గౌణాత్మాభిమానంమీదా, మిథ్యాత్మాభిమానంమీదా ఆధారపడి నడుస్తూంటుంది. గౌణాత్మాభిమానం తొలగిపోతే "నా భార్య" "నా కుమారుడు" అనే భావం తొలగిపోతుంది. అనగా మమకారం నశిస్తుంది. మిథ్యాత్మాభిమానం తొలగిపోతే లౌకికవ్యవహారం మాత్రమే కాక శ్రవణమననాదికమైన ఆధ్యాత్మికవ్యవహారం కూడ నిలిచిపోతుంది. ఆధ్యాత్మికసాధన చేయనివాడు బ్రహ్మాత్మ సాక్షాత్కారం పొందడం అసంభావ్యం. ఆత్మయొక్క యథార్థస్వరూపం తెలియనంతవరకే ప్రమాత (తెలుసుకొనేవాడు), ప్రమేయం (తెలియదగినది) ప్రమ (జ్ఞానం) అనే భేదం ఉంటుంది. ఈ ప్రమాత ఎవరు? ఇంతవరకు ఎవనికొరకు ఈ అన్వేషణం చేయబడిందో అతడే ప్రమాత; ఈ ప్రమాతలో, వాస్తవానికి, ఎలాంటి దోషాలు లేవు. ప్రతి ఒక్కడూ కూడ తానే శరీర మనీ, తానే ఇంద్రియాలనీ అనుకొంటూ లౌకికవ్యవహారాసక్తు డౌతున్నాడు. అద్వైతులే కాదు, ఇతరదార్శనికు లందరూ కూడ ఈ దేహాత్మబుద్ధి మిథ్య అని అంగీకరించవలసిందే. ఎందుచేతననగా ఇది ప్రమాణాలచేత బాధించబడుచున్నది. అయినా కూడ ఈ లోకవ్యవహారం ఏ అడ్డంకులూ లేకుండ కొనసాగుతూనే ఉంది. అందుచేత ఆత్మసాక్షాత్కారం కలిగే వరకు, అనగా నేనే పరబ్రహ్మను అనే జ్ఞానం కలిగే వరకు, జగత్తులో ఉన్న ప్రతివస్తువూ సత్యమే".

అందుచేత శ్రీ శంకరభగవత్పాదులు ప్రతిపాదించిన ఈ జగన్మిథ్యాత్వం వినగానే కంగారుపడిపోవలసిన పనిలేదు. మిథ్యాత్యం అంటే ఏమిటి అని అందరికీ అర్థం అవడంకోసం శ్రీ శంకరభగవత్పాదులు చూపిన రజ్జుసర్పాదిదృష్టాంతాలను చూచి "అయ్యో! మనం ఉంటూన్న ఈ ప్రపంచం ఇంతేనా" అని విలపించ నవసరం లేదు. అర్థరహితంగా ఉన్మత్తుల వలె తమలో ఉన్న లోపాలను ఆయనలో ఆపాదించి శ్రీ శంకరభగవత్పాదులను కటువుగా దూషించవలసిన పనిలేదు. ఈ సందర్భంలో "ది క్రిటికల్ సర్వే ఆఫ్ ఇండియన్ ఫిలాసఫీ" అనే గ్రంథంలో ప్రొఫెసర్ చంద్రధరశర్మ వ్రాసిన వాక్యాలు ఉదాహరించడం అప్రస్తుతం కాదు.

Many critics have failed to understand the real significance of Maya or Avidya and have, therefore, charged Sankara with explaining the world away. But this charge is based on a shifting of stand-points. Sankara, as we have shown above, has granted some degree of reality even to dream, illusions and errors. How can he take away the reality of this world? The words **real and unreal** are taken by Sankara in their absolute sense. **Real** means real for all times and Brahman alone can be **real** in this sense. Similarly **unreal** means absolutely unreal like the hares horn, which the phenomical world is not. Hence this world is neither real nor unreal. This shows its self-contradictory and therefore, incomprehensible nature. It is relative, phenomenal finite. But it is not illusory. It is true for all practical purposes. What does it matter to us, worldly people, if it is not absolutely true in the philosophical sense. When the reality which is denied to this world means reality for all times the unreality which is attributed to it means non-eternity. Who can stand up and say that the world is not unreal if unreal means non-eternal? Again the world will be sublated only when the knowledge dawns, not before. This should make us humbly strive after knowledge rather than engage outselves in futile quarrels. Sankara's intention is perfectly clear-none can condemn this world as

unreal, he who does it is not qualified to do so and he who is qualified to do so will not do so for he would have risen above language and finite thought". (P. 279)

"శంకరాచార్యులు చెప్పిన మాయయొక్క లేదా అవిద్యయొక్క స్వరూపాన్ని చాలామంది విమర్శకులు అర్థం చేసికొనకుండా శంకరులు జగత్తే లేదని అన్నా రని నిందిస్తున్నారు. ఈ దూషణం శంకరులు చెప్పిన విషయాన్ని తారుమారుచేయడవల్ల ఏర్పడినది. మేం పైన వివరించిన రీతిగా శంకరాచార్యులు స్వప్నాలకీ, భ్రాంతులకు కూడ కొంత సత్యత్వాన్ని అంగీకరించారు. అలాంటప్పుడు ఆయన ప్రపంచానికి ఏ మాత్రమూ సత్యత్వం లేదని ఎలా అంటారు? సత్యం, అసత్యం అనే మాటలకు. శంకరాచార్యులు సర్వవిధాలా (ఏనాటికీ) మార్పులేని సత్యం, సర్వవిధాలా (ఏనాటికీ) మార్పులేని అసత్యం అనే అర్థాలు గ్రహించారు. సత్యం అంటే ఎప్పటికీ సత్య మైన దని అర్థం. ఆ అర్థంలో బ్రహ్మ ఒక్కటే సత్యం అని చెప్పడానికి తగినది. అసత్యం అనగా ఎన్నడూ ఉండడానికి అవకాశం లేనిది. కుందేటి కొమ్ము వంటివి ఇలాంటి అసత్యపదార్థాలు. ప్రత్యక్షంగా కనబడుతూన్న ప్రపంచకం ఈ విధంగా అసత్యమైనది అని చెప్పడం ఏ నాడూ కుదరదు. అందుచేత ఈ ప్రపంచకం (బ్రహ్మవలె) సత్యమూ కాదు, (శశశృంగాదుల వలె) అసత్యమూ కాదు. అందుచేత ఇది విరుద్ధస్వభావం కల దనీ అనిర్వచనీయ మనీ తెలుస్తూన్నది. ఇది సాపేక్షం (దీనికున్న సత్యత్వం సాపేక్షం). దృశ్యమైనది. సాంతం. అయితే ఇది భ్రాంతికల్పితం కాదు. సకలవ్యవహారాలకు సంబంధించినంతవరకు ఇది సత్యం. తాత్త్వికదృష్టితో పరిశీలించినప్పుడు ఇది పరమార్థసత్యం కానంతమాత్రంచేత లౌకికవ్యవహార వ్యాపృతులమైన మనకు కలిగిన నష్టం ఏమిటి? ప్రపంచకం విషయంలో నిషేధించబడిన (లేదని చెప్పిన) సత్యత్వం అనగా పారమార్థికసత్యత్వం అయితే, ప్రపంచకం అసత్యం అన్నప్పుడు ఆ అసత్యత్వానికి అశాశ్వతత్వం అని అర్థం. అసత్యం అనే పదానికి ఈ అర్థం (అశాశ్వతం అనే అర్థం) చెప్పినప్పుడు ఎవడైనా నిలబడి ఈ ప్రపంచం అసత్యం కాదు అని చెప్పగలుగుతాడా? మరొక విషయం ఏ మనగా అద్వితీయాత్మజ్ఞానం ఉదయించిన తరవాతనే ఈ ప్రపంచం బాధితం అవుతుంది కాని అంతకు ముందు బాధితం కాదు. అందుచేత మనం వ్యర్థమైన వాగ్వాదాలతో కాలం గడపడంకంటె వినీతభావంతో సరియైన జ్ఞానం

సంపాదించుకొనడం కోసం ప్రయత్నించాలి. శంకరాచార్యుల అభిప్రాయం సుస్పష్టం. ఈ జగత్తు అనిత్యం అని ఎవ్వడూ దీనిని దూషణపూర్వకంగా నిరాకరించజాలడు. ఎవడైతే అలా అంటాడో వానికి అలా అనే అర్హత లేదు. అలా అనే అర్హత కలవాడు ఆ విధంగా నిరాకరించడు; ఎందువల్ల ననగా అతడు భాషయొక్క, పరిచ్ఛిన్నమైన ఆలోచనాశక్తి యొక్క పరిధిని దాటిపోయాడు."

ఇంతవరకు మనం చూచిన దానిని పట్టి శ్రీ శంకరభగవత్పాదులు జగత్తుకు బ్రహ్మ కున్న సత్యత్వం వంటి సత్యత్వాన్ని అంగీకరించకపోయినా కొంతవరకు సత్యత్వాన్ని అంగీకరించడానికి ఏమాత్రము విముఖులు కాదనే విషయం స్పష్టం అవుతుంది. కొన్ని ప్రదేశాలలో వారు జగత్తు విషయంలో అనిత్యం అనే పదంకూడ ఉపయోగించారు. ఉదాహరణకి ప్రశ్నోపనిషత్తులో "అపరవిద్యకు సంబంధించిన, సాధ్యసాధకరూపమైన ప్రాకృతమైన సంసారం అనిత్యం" అంటారు. "గార్గ్యః పప్రచ్ఛ ప్రశ్నత్రయేణ అపరవిద్యాగోచరం సర్వం పరిసమాప్య సంసారం ప్రాకృతవిషయం సాధ్యసాధకలక్షణమ్ అనిత్యమ్" (ప్ర.ఉ.భా. 4-1). అట్లే వేదాన్తాధ్యయనాధికారానికి కావలసిన సాధనచతుష్టయసంపత్తిని గూర్చి మాట్లాడుతూ ఆయన నిత్యానిత్యవస్తువివేకాన్ని మొట్టమొదటి సాధనంగా పేర్కొన్నారు గాని దానిని మిథ్యామిథ్యవస్తువివేకం అనలేదు.

## సగుణబ్రహ్మ

తమ తరువాత వచ్చిన ఆచార్యులు ఎంతటి అభినివేశంతో నిరూపిస్తారో అంతటి అభినివేశంతోనూ కూడ శ్రీ శంకరభగవత్పాదులు సగుణబ్రహ్మోపాసనను సమర్థిస్తూ, సగుణబ్రహ్మానుగ్రహంలేకపోతే చిత్తశుద్ధి కాని తన్మూలకమైన ఆత్మసాక్షాత్కారం గాని కలగవని ప్రతిపాదించారు.

"ద్విరూపం హి బ్రహ్మావగమ్యతే - నామరూపభేదోపాధివిశిష్టం తద్విపరీతం చ సర్వోపాధివివర్జితమ్- "యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి. యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్" (బృ.ఉ.4.5.15) "యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా. అథ యత్రాన్యత్పశ్యతి అన్యచ్ఛృణోతి అన్యద్విజానాతి తదల్పమ్. యో వై భూమా తదమృతమ్. అథ యదల్పం తన్మర్త్యమ్"

(ఛా. ఉ. 7.2.41) **"సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాభివదన్యదాస్తే"** **(తై.ఆ. 3.12.7). "నిష్కలం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరఞ్జనమ్ అమృతస్య పరం సేతుం దగ్ధేన్ధనమివానలమ్" (శ్వే.ఉ. 6.19)." నేతి నేతి (బృ.ఉ. 2.3.6) ఇతి "అస్థూలమనణు" (బృ.ఉ. 3.8.8) "న్యూనమన్యత్ స్థానం సంపూర్ణమన్యత్" ఇతి చైవం** సహస్రశః విద్యావిద్యావిషయభేదేన బ్రహ్మణో ద్విరూపతాం దర్శయన్తి వాక్యాని. తత్రావిద్యావస్థాయాం బ్రహ్మణ ఉపాస్యోపాసకలక్షణః సర్వో వ్యవహారః. తత్ర కాని చిద్బ్రహ్మణ ఉపాసనాని అభ్యుదయార్థాని..." "ఏవమేకమపి బ్రహ్మ అపేక్షితో పాధిసంబన్ధం నిరపేక్షోపాధిసంబన్ధం చ ఉపాస్యత్వేన జ్ఞేయత్వేన చ వేదాన్తేషు ఉపదిశ్యతే" (బ్ర.సూ.భా. 1.1.11)

"నామరూపభేదాల ఉపాధులతో కూడినది, దానికి విపరీతంగా సమస్తోపాధిశూన్యమూ అయిన రెండు రూపాలు గల (రెండు విధాలైన) బ్రహ్మ తెలియబడుతున్నది. **"యత్రహి.. పశ్యతి"** ఏ స్థితిలో నైతే ద్వైతం ఉన్నట్లు అనిపిస్తుందో ఆ స్థితిలో ఒకడు మరొకనిని (మరొక వస్తువును) చూడడం అనేది ఉంటుంది. ఏ స్థితిలో నైతే సమస్తమూ వీనికి ఆత్మయే అవుతుందో ఆ స్థితిలో ఎవడు ఎవనిని చూస్తాడు". **"యత్ర నాన్యత్... మర్త్యమ్"** "ఏ స్థితిలో మరొక వస్తువును భిన్నంగా చూడడో, మరొక వస్తువును వినడో మరొక వస్తువును తెలుసుకొనడో ఆ స్థితి భూమ, అతివిశాలమైన స్థితి. ఏ స్థితిలో (తనకంటె భిన్నంగా) మరొక వస్తువును చూస్తాడో. మరొక వస్తువును వింటాడో, మరొక వస్తువును తెలుసుకుంటాడో అది అల్పం - సంకుచిత మైన స్థితి. భూమయే అమృతం, నాశం లేనిది. అల్పమే మర్త్యం, నశించేది" **"సర్వాణి... ఆస్తే"** ధీరుడైన ఆ పరమాత్మ అన్ని రూపాలు, నామాలు సృజించి (వాటిని ఆపేర్లతో పిలుస్తూ ఉంటాడు); **"నిష్కలం.... అనలమ్"** "ఇది అవయవాలులేనిది, క్రియలు లేనిది, శాంతమైనది, దోషరహితం, మాలిన్యం లేనిది; అమృతత్వాన్ని చేర్చే సేతువు, కట్టెలను కాల్చివేసిన అగ్నివంటిది". **"నేతి నేతి"** "ఇది కాదు", అని, **"అస్థూలమనణు"** "ఇది స్థూలం కాదు అణువు కాదు". **"న్యూనమ్... అన్యత్"** "ఒక స్థానం తక్కువది. ఒకటి సంపూర్ణం "ఈ విధమైన వేలకొలది వాక్యాలు విద్యావిషయం, అవిద్యావిషయం అనే భేదంవల్ల బ్రహ్మ ద్వివిధమైనది అని చూపుతున్నాయి. బ్రహ్మ విషయంలో ఉపాస్యం ఉపాసకుడు అనే సమస్తవ్యవహారమూ కూడ అవిద్యావస్థలోనే

ఉంటుంది. ఈ ఉపాసనలలో కొన్ని (సగుణ) బ్రహ్మోపాసనలు అభ్యుదయం (ఐహికపారలౌకికాభివృద్ధికి) ఉపయోగించేవి... ఈ విధంగా ఒకే ఉపాధిసంబంధం ఉన్నదిగాను ఉపాధి సంబంధం లేనిదిగాను, (మొదటిది) ఉపాస్యంగాను, (రెండవది) జ్ఞేయంగాను వేదాంతాలలో ఉపదేశించబడుతున్నది."

## పరమేశ్వరునికి శరీరాదులుండవచ్చును

అస్తికదార్శనికు లని చెప్పబడే సాంఖ్యులు, పూర్వమీమాంసకులూ కూడ పరమేశ్వరుణ్ణి అంగీకరించలేదు. పూర్వమీమాంసకు లైతే (ప్రాచీనులు) ఇంద్రాది దేవతలకు శరీరేంద్రియాదులున్నా యని కూడ అంగీకరించలేదు. దీనిని పట్టి వివిధ పురాణాలలోని దేవతావర్ణనఘట్టాలకు దేవతలకు సంబంధించిన ఉపాఖ్యానాదులకు వీరి మతం ప్రకారం ఎట్టి ప్రామాణ్యం ఉన్నదో ఊహించవచ్చును. ఈశ్వరుణ్ణి అంగీకరించిన న్యాయవైశేషిక-యోగులు కూడ ఈశ్వరునకు శరీరేంద్రియాదులను అంగీకరించలేదు. వీళ్ల మతాల ప్రకారం పరమేశ్వరుడు నిరాకారుడు. దీని ప్రకారం, తరవాత వచ్చిన, ఆగ్రహావేశాదులతో ప్రచారంలోనికి తీసికొనిరాబడిన, శైవ-వైష్ణవ-శాక్తాది మతాల స్థానం ఏమైపోతుందో ఊహించవచ్చును. ఇట్టి స్థితిలో పరమేశ్వరుడు కూడ భక్తజనానుగ్రహార్థం శరీరేంద్రియాదులను ధరించి సాక్షాత్కరించడంలో తప్పు లేదనీ, అది ఉపనిషత్సంమతమే అనీ ఎట్టి సంశయానికీ తావు లేని మాటలలో సర్వప్రథమంగా దృఢంగా ప్రతిపాదించి పూరాణాదుల ప్రామాణ్యాన్ని కూడా స్థాపించిన ఘనత శ్రీ శంకరభగవత్పాదులకే చెందుతుంది. అందుచేతనే

"శ్రుతిస్మృతిపురాణానామాలయం కరుణాలయమ్.
నమామి భగవత్పాదశంకరం లోకశంకరమ్"

అనే శ్రీ శంకరభగవత్పాదస్తుతి ప్రాచరంలోనికి వచ్చింది.

"నువ్వు చూస్తున్నది నా సత్యస్వరూపం కాదు, ఇదంతా నా మాయాసాహాయ్యంతో కల్పించబడినది. నా అసలు స్వరూపం దీనికి అతీతమైనది". అని శ్రీకృష్ణుడు నారదునితో చెప్పినట్లుగా భగవంతుడు భక్తులను అనుగ్రహించడం కోసం వివిధరూపాలు ధరించవచ్చును" అని శ్రీశంకరభగవత్పాదులు ఒకచోట చెప్పి ఉన్నారు.

"స్యాత్ పరమేశ్వరస్యాపి ఇచ్ఛావశాత్ మాయామయం రూపం

సాధకానుగ్రహార్థమ్.

"మాయా హ్యేషా గుణమయీ యన్మాం పశ్యసి నారద,

సర్వభూతగుణైర్యుక్తం మైవం మాం జ్ఞాతుమర్హసి"

ఇతి స్మరణాత్ (బ్ర.సూ.భా. 1.1.20).

బ్రహ్మసూత్రభాష్యంలోనే మరొక చోట - "ఏమిటి? రెండు రకాల బ్రహ్మలున్నాయా? అని ప్రశ్న వేసికొని "అహా! న్సందేహంగా ఉన్నాయి" అని శ్రీ శంకరభగవత్పాదులు సమాధానం చెప్పారు.

"కిం ద్వే బ్రహ్మణీ పరమపరం చేతి? బాఢమ్; ద్వే "ఏతద్వై సత్యకామ పరం చాపరం చ బ్రహ్మ యదోఙ్కారః" (ప్ర.ఉ. 5.2) ఇత్యాదిదర్శనాత్. కిం పునః పరం బ్రహ్మ కిమపరమితి? ఉచ్యతే - యత్ర అవిద్యాకృతనామరూపాదివి శేషప్రతిషేధాత్ అస్థూలాదిశబ్దైః బ్రహ్మోపదిశ్యతే తత్ పరమ్. తదేవ యత్ర నామరూపాదివిశేషేణ కేన చిద్విశిష్టముపాసనాయ ఉపదిశ్యతే "మనోమయః ప్రాణశరీరో భారూపః (ఛా.ఉ. 3.4.2) ఇత్యాదిశబ్దైః తదపరమ్" (బ్ర.సూ.భా. 4.3.14)

"అయితే పరబ్రహ్మ అనీ అపరబ్రహ్మ అనీ రెండు బ్రహ్మలున్నాయా? నిస్సంశయంగా రెండున్నాయి. ఎందువల్ల ననగా శ్రుతి "ఏతద్వై..... ఓంకారః" "ఓ సత్యకామా. ఓంకారం పరబ్రహ్మరూపమూ అపరబ్రహ్మరూపమూ కూడ" అని చెపుతూన్నది. అయితే పరబ్రహ్మ ఏది అపరబ్రహ్మ ఏది? చెపుతున్నాం విను. అవిద్యచేత చేయబడిన నామరూపాదివిశేషాలను నిషేధిస్తూ ఎక్కడైతే అస్థూలాదిశబ్దాలచేత బ్రహ్మ ఉపదేశించబడుతుందో అది పరం. అదే బ్రహ్మ ఏదో ఒక నామరూపాదివిశేషంతో కూడినట్లు ఉపాసననిమిత్తం "మనోమయః... భారూపః" "మనోమయమైనది, ప్రాణమే శరీరంగా గలది కాంతిరూపమైనది" ఇత్యాదిశబ్దాలచేత ఉపదేశించబడుతుందో అది అపరం".

ఇదే విషయం కేనోపనిషద్భాష్యంలో కూడ విశదీకరించబడింది- "కిమనేకాని బ్రహ్మణో రూపాణి మహాన్తి అర్భకాణి చ యేనాహ దహరమేవేతి? బాఢమ్. అనేకాని హి నామరూపోపాధికృతాని బ్రహ్మణో రూపాణి, న స్వతః" (కే. ఉ. భా. 2.1)

"దహరమేవ (చిన్నదే) అని అంటున్నారు; బ్రహ్మకు పెద్దవి చిన్నవి అంటూ చాలా ఆకారాలు ఉన్నాయా? అహా! నిఃసంశయంగా ఉన్నాయి. బ్రహ్మకు నామ

రూపాద్యుపాధులచేత ఏర్పడిన అనేకరూపా లున్నాయి.''

ఈ విధంగా శ్రీశంకరభగవత్పాదులు చెప్పినట్లుగా ఉపనిషత్తులు సగుణ బ్రహ్మకు కూడ ఎవ్వరూ ప్రశ్నించడానికి వీలు కాని స్థానాన్ని కల్పించాయి. అందుచేత భక్తులు ఏ స్వరూపమైనా పరబ్రహ్మస్వరూపమే అని నిశ్చయంతో, ఏ రూపాన్నీ ద్వేషించకుండా, తమ కిష్టమైన స్వరూపాన్ని లేదా స్వరూపాలను ఆరాధిస్తే లాభం పొందకలుగుతారు అనేది అద్వైతసంప్రదాయం. ఈ క్రింది శ్లోకంలో చెప్పినట్లు మందాధికారులను ఉద్ధరించడానికే ఉపనిషత్తులు సగుణబ్రహ్మరూపాలను కూడ ప్రతిపాదించాయి-

"నిర్విశేషం పరం బ్రహ్మ సాక్షాత్కర్తుమనీశ్వరాః,
యే మన్దాస్తేఽనుకమ్ప్యన్తే సవిశేషనిరూపణైః"

ఇది ఉపనిషత్ప్రామాణ్యాన్ని అనుసరించి శ్రీ శంకరభగవత్పాదులు మన కుపదేశించిన ఎంతో ప్రధానమైన మానసికభావనావిధానం. అయితే తరువాత వచ్చిన సంప్రదాయాలకు చెందినవారు ఈ ఉపదేశాన్ని పెడచెవిని పెట్టి, పరస్పరద్వేషభావంతో, నిరర్థకవాదాలతో జీవనసార్థక్యం పొందలేకపోతున్నారు. ఈ దృష్టిపథాన్నే పురస్కరించుకొని వివిధపురాణాలలో లేనిపోని సాత్త్విక-రాజస-తామసాదిభేదాలను అంగీకరించకుండా అన్ని పురాణాలకీ, ఇతిహాసాలకీ వాటి వాటి పరిధిలో సమానమైన ప్రామాణ్యాన్ని స్థిరీకరించడానికి శ్రీ శంకరభగవత్పాదులకు అవకాశం లభించినది. ఉపనిషత్తులకు సంబంధించి నంతవరకు అవి ప్రాచీనగ్రంథాలలో చెప్పబడిన, దైనందినవ్యవహారానికి సంబంధించిన ప్రతీ విషయానికీ తగు స్థానం కల్పించాయి.

**పురాణేతిహాసాల ప్రామాణ్యం:** అన్ని పురాణాలకు, ఇతిహాసాలకు ప్రామాణ్యం ఉందనీ, భూలోకంలోని మానవులకు ఇతరలోకాలలోని దేవతాదులకి కూడ పరస్పరసంబంధం, సంవ్యవహారం ఉండే దనీ శ్రీ శంకరభగవత్పాదులు దేవతాధికరణంలో స్పష్టీకరించారు.

"ఇతిహాసపురాణమపి వ్యాఖ్యాతేన మార్గేణ సంభవన్మన్త్రార్థవాదమూలత్వాత్ ప్రభవతి దేవతావిగ్రహాది సాధయితుమ్. ప్రత్యక్షాదిమూలమపి సంభవతి. భవతి హ్యస్మాకమప్రత్యక్షమపి చిరన్తనానాం ప్రత్యక్షమ్. తథా చ వ్యాసాదయః దేవతాదిభిః ప్రత్యక్షం వ్యవహరన్తీతి స్మర్యతే. యస్తు బ్రూయాత్ ఇదానీన్తనానామివ పూర్వేషామపి

నాస్తి దేవతాదిభిర్వ్యవహర్తుం సామర్థ్యమితి స జగద్వైచిత్ర్యం ప్రతిషేధేత్. ఇదానీమివ చ నాన్యదాపి సార్వభౌమః క్షత్రియః ఆసీదితి బ్రూయాత్. తతశ్చ రాజసూయాదిచోదనా ఉపరున్ధ్యాత్. ఇదానీమివ చ కాలాన్తరేఽపి అవ్యవస్థితప్రాయాన్ వర్ణాశ్రమధర్మానాచక్షీత తతశ్చ వ్యవస్థావిధాయి శాస్త్రమనర్థకం స్యాత్" (బ్ర.సూ.భా. 1.3.33)

"మేం వెనక స్థాపించినట్లుగా వేదంలోని మన్త్రార్థవాదాలు అధారంగా కల ఇతిహాసపురాణాదుల ప్రామాణ్యంచేత కూడ దేవతావిగ్రహాదులను సాధించవచ్చును (ఇతిహాసపురాణాదులకు) ప్రత్యక్షాదులు కూడ మూలం కావచ్చును. మనకు ప్రత్యక్షం కాకపోయినా ప్రాచీనులకు ప్రత్యక్షం కావచ్చును కదా? వ్యాసాదులు దేవాదులతో ప్రత్యక్షంగా వ్యవహరించేవా రని స్మృతులలో (భారతాదులలో) చెప్పబడుచున్నది కదా? ఇప్పటివాళ్లకు వలె పూర్వికులకు కూడ దేవతాదులతో వ్యవహరించే సామర్థ్యం లేదు అనేవాడు జగత్తుయొక్క వైచిత్ర్యాన్ని నిషేధించినవా డవుతాడు. ఇప్పుడు వలె పూర్వకాలంలో కూడ సార్వభౌముడైన క్షత్రియుడుండేవాడు కాడని అనేవాడవుతాడు. అప్పుడు సార్వభౌముడైన క్షత్రియునిచేత మాత్రమే అచరించదగిన రాజసూయయాగాన్ని విధించే శాస్త్రానికి భంగం కలుగుతుంది. ఇప్పటివలెనే కాలాంతరంలో కూడ వర్ణాశ్రమ ధర్మాలు అస్తవ్యస్తంగా ఉండే వని చెప్పినవా డవుతాడు. అప్పుడు వర్ణాశ్రమవ్యవస్థను విధించే శాస్త్రం నిరర్థకం అవుతుంది".

**జీవాత్మ:** ఇంతవరకు మనం ఉపనిషదనుసారం జగత్తుయొక్క స్థానం ఏమిటి, సగుణబ్రహ్మస్వరూపం ఏమిటి అనే విషయాలు తెలుసుకొన్నాం. వాస్తవంలో పారమార్థికసత్త అనేది ఒకటే, అదే సర్వవిశేషాతీతమైన నిర్గుణమైన పరబ్రహ్మ అని కూడ తెలుసుకున్నాం. అయితే జీవాత్మస్వరూపం ఏమిటి? ఉపనిషత్తుల ప్రకారం జీవాత్మ కూడ పరబ్రహ్మవలెనే సత్యమైనది. శాశ్వతమైనది అని తెలుస్తూన్నది. జగత్తు బ్రహ్మనుండి ఆవిర్భవించిన దని, బ్రహ్మ మీదనే నిలచి ఉన్నదని చివరికి బ్రహ్మలోనే విలీనం అవుతుందనీ ఉపనిషత్తులు చెపుతున్నాయి. **"యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి, యత్ ప్రయన్త్యభిసంవిశన్తితి. తద్విజిజ్ఞాసస్వ; తద్ బ్రహ్మేతి"** (తై. ఉ. 3.1).

అయితే జీవాత్మ కూడ బ్రహ్మచేత సృష్టించబడిన దని ఎక్కడా చెప్పలేదు. బ్రహ్మను వర్ణించడానికి ఏ పదాలు ఉపయోగింపబడుతున్నాయో ఇంచుమించు

అదే పదాలను ఉపయోగిస్తూ జీవాత్మవర్ణనం చేయబడింది. కఠోపనిషత్తులో వర్ణించిన ప్రకారం - "జీవాత్మకు జన్మ కాని మరణం కాని లేదు. ఇది దేనినుండీ పుట్టలేదు; దీని నుండి ఏదీ పుట్టలేదు. ఇది జన్మరహితం, శాశ్వతం, నిత్యం అతిప్రాచీనం (అనాది). ఈ దేహం చంపబడుతున్నా కూడ ఇది చంపబడదు".

**"న జాయతే మ్రియతే వా విపశ్చిత్**
**నాయం భూత్వా భవితా వా న భూయః,**
**అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో**
**న హన్యతే హన్యమానే శరీరే" (క.ఉ. 2.18)**

ఇలాంటి వర్ణన లన్నీ చూస్తే జీవాత్మ కూడ పరమార్థసత్యమే Absolute Truth అని తెలుస్తూన్నది. మనం వెనుకచూచినట్లు ఉపనిషత్తుల ప్రకారం రెండు పరమార్థసత్యాలు Absolute Truth ఉండడానికి వీలులేదు. బంధం అనేది కేవలం అవిద్యాకల్పితం అని చెప్పి జీవాత్మ పరమాత్మాభిన్న మని అంగీకరిస్తేనే ఈ విధమైన వర్ణనలు కుదురుతాయి. "అహం బ్రహ్మాస్మి" 'అయమాత్మా బ్రహ్మ", "ప్రజ్ఞానం బ్రహ్మ" "తత్త్వమసి" ఇత్యాదిమహావాక్యాలు జీవబ్రహ్మల అభేదాన్ని స్పష్టంగా బోధిస్తున్నాయి.

నిర్గుణము, నిర్విశేషము, శుద్ధము అయిన బ్రహ్మ సంసారంలో చిక్కుకొనడం ఏమిటి? దార్శనికుల నందరినీ వేధిస్తూన్న మౌలికప్రశ్నకు సమాధానం ఉపనిషత్తుల లోనే లభిస్తుంది. సంసారం అనేది ఒకటుంది. దీనిలో జీవుడు చిక్కుకొని ఉన్నాడు. అయితే ప్రమాణాలలో కెల్లా అత్యుత్తమప్రమాణమైన శ్రుతి జీవాత్మ పరమాత్మ ఒకటే అని చెపుతున్నది. నిర్వచించడానికి శక్యం కాని మాయాశక్తిచేతనే శుద్ధచైతన్యం జీవాత్మవలె కనబడుచున్నది. మాయయైనా బ్రహ్మయొక్క సహజస్వరూపాన్ని ఎలా కప్పిపుచ్చగలదు అనేది మరొకప్రశ్న. ఇదే ఆశ్చర్యాలలో కెల్లా మహాశ్చర్యం. అందుచేతనే మాయాశక్తి, మాయా కూడ అనిర్వచనీయము లని చెప్పడం జరిగింది. ఎన్ని అనుపపత్తులు చూపినా మాయ చిత్స్వరూపాన్ని కప్పివేయడం అనేది కనబడుతున్నప్పుడు కాదని ఎలా అనడం? "న హి దృష్టే అనుపపన్నం నామ". ఇది అనుపపన్నం అని శ్రీ శంకరభగవత్పాదులకు మాత్రం తెలియదా? ఆ విషయం తెలిసే కదా అధ్యాసభాష్యం వ్రాసినది. "విషయవిషయయులకు తద్ధర్మాలకు

అన్యోన్యాధ్యాసం నిజానికి కుదరదు; ఐతే నేమి? అలాంటి అధ్యాసచేతనే లోకవ్యవహారం జరుగుతున్నది" ఆయన అని మొట్టమొదటనే ప్రతిపాదించిన తరవాత సప్తవిధానుపపత్తులు చూపినా సప్తశతానుపత్తులు చూపినా అవేశం, కావేశం మాత్రమే మిగులుతాయి. ఈ అనుపపత్తులు అనుపపన్నములని చిదచిదశరీరకబ్రహ్మసిద్ధిః సప్తవిధానుపపత్తిపరీక్షాచ అనే గ్రంథంలో శ్రీ వే.జగదీశ్వరశాస్త్రి ప్రతిపాదించి ఉన్నారు. 1958

చాల కాలం క్రితం పత్రికలలో ఒక వార్త ప్రచురించబడింది. ఒక చిన్న దేశానికి చెందిన రాణి అమెరికాలో ఒక దుకాణంలో ఏదో ఒక చిన్న వస్తువును దొంగిలించినదట. ఆమె పట్టుబడింది. అయితే "(1) ఒక రాణి ఏమిటి?, (2) చిన్న వస్తువును అపహరించడం ఏమిటి, (3) పోనీ అది అధికమూల్యమైన వస్తువైనా అలా చేసిం దనుకోవచ్చును (4) అక్కడ దుకాణదారులు జాగరూకతో ఉంటారు కదా (5) ఎవరూ లేకపోయినా ఏవో యంత్రాలు కనిబెడుతూ ఉంటాయని అందరికీ తెలిసినవిషయమే కదా? (6) ఆ మాత్రం ఆ రాణికి మాత్రం తెలియదా; (7) పోనీ ఇతరులు చూడరనుకొన్నా తన వెంట నున్న తనవాళ్లే చూస్తారేమో అని అమె సంకోచించాలి కదా? ఈ విధంగా అనుపపత్తులు ఎన్ని ఏకరువుపెట్టినా జరగవలసిన విషయం జరిగింది. జరగడం నిజమే. ఈ అనుపపత్తులన్నింటికీ ఒకే ఒక సమాధానం - ఆ సమయంలో అమె ప్రవర్తన అనిర్వచనీయం.

మాయాశక్తి అనిర్వచనీయం అవడంచేతనే ఏ విధంగాను కూడ సమర్థించడానికి శక్యం కాని పనులు జరుగుతున్నాయి. ఇది లోకంలో ప్రతి ఒక్కరి అనుభవంలో ఉన్న విషయమే. ఎట్టి పరిస్థితులలోను ఆ విధంగా ప్రవర్తిస్తాడు అని నమ్మడానికి వీలులేని మనిషి ఆ విధంగా ప్రవర్తిస్తాడు. ఇదేమిటి ఇలా చేశావేమిటి అని ప్రశ్నిస్తే "ఏమిటో! ఆ సమయంలో నే నేం చేస్తున్నానో నాకే తెలియ లేదు" అంటాడు. ఏదో ఒక స్థితిలో ప్రతీదార్శనికుడూ ఇష్టం ఉన్నా లేకపోయినా అనిర్వచనీయతావాదాన్ని అంగీకరించవలసిందే. ఎంత గొప్ప వైజ్ఞానికుడైనా కొన్ని వస్తువులు ఆ విధంగా ఎందుకు ఉన్నాయి అంటే కారణం చెప్పజాలడు. ఒక స్థితిలో అనిర్వచనీయం అని అంగీకరించవలసియే ఉంటుంది. అందుచేత ఉపనిషత్తులను

మాత్రమే ప్రమాణంగా అంగీకరిస్తాం అని చెప్పే ప్రతీ దార్శనికుడూ కూడ జీవ-జగదాదిస్వరూపాల విషయంలో శ్రీశంకరభగవత్పాదులు చూపిన మార్గాన్ని అనుసరించవలసిందే. అలా కాక ఆగమాదులలో చెప్పిన విషయాలు ఇక్కడ చొప్పిస్తాం అంటే అది ఔపనిషదార్థప్రతిపాదనం కాజాలదు.

పరమేశ్వరునికి ఒక రూపం (శరీరాదికం) ఇచ్చి ఒక చోట కూర్చుండ బెట్టిన తరవాత అతని సర్వవ్యాపకత్వం, అంతర్యామిత్వం ఎలా కుదురుతుంది? శ్రీ శంకరభగవత్పాదులు చెప్పినట్లు ఈ రూపాదులు పరమేశ్వరేచ్ఛామాత్రకల్పితాలు, అందుచేత అనిత్యాలు, తాత్కాలికాలు అనేనా అంగీకరించాలి, లేదా పరమేశ్వరుని కున్న సర్వవ్యాపిత్వసర్వాంతర్యామిత్వాదులు అసత్యాలనేనా చెప్పాలి. దేశపరిచ్ఛిన్నమైన శరీరాదికం అంగీకరించిన తరవాత సర్వవ్యాపకత్వాదిసమర్థనం కోసం శేషశేషి భావకల్పనం చేసినంతమాత్రంచేత అది కల్పనమే అవుతుంది కాని యథార్థం అవడానికి వీలులేదు. అవిద్యభూమికలో ఇవన్నీ చెపుతున్నాం అంటే ఇవన్నీ కుదురుతాయి. ఈ భూమికలో జగత్తంతా పరమేశ్వరుని శరీరం అనే విషయం అందరూ అంగీకరించినదే. కాళిదాసాదులు కూడ ఏనాడో తమ కావ్యాలలో అష్టమూర్త్యాదివర్ణనద్వారా నిశ్చితంగా చెప్పిన విషయం ఇది. శ్రీ శంకరభగవత్పాదులు కూడ దక్షిణామూర్తి స్తోత్రంలోని-

భూరమ్భాంస్యనలోఽనలోఽమ్బరమహర్నాథో హిమాంశుః పుమా
నిత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవ మూర్త్యష్టకమ్,
నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభో
స్తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే"

అనే శ్లోకంలో పరమేశ్వరుడు జగజ్జీవశరీరు డని స్పష్టంగా ప్రతిపాదించి ఉన్నారు. ఇదే విధంగా జగత్సమష్టిరూపం "సహస్రశీర్షా పురుషః" ఇత్యాదిరూపాలలో వర్ణించబడిన విరాట్పురుషుడు, జీవసమష్టిరూపం హిరణ్యగర్భుడు ఇత్యాదివిషయా లన్నీ అద్వైతులకు కూడ అంగీకార్యాలే. ఇలాంటివి ఎన్ని అంగీకరించినా అవన్నీ అవిద్యాభూమికలోనే అనీ, ఏకైకనిత్యసత్యం నిర్గుణమైన శుద్ధబ్రహ్మయే అనీ వాళ్ల సిద్ధాంతం. ఇలా చెప్పడం వల్ల జగజ్జీవులు పరమేశ్వరుని శరీరమే, అవయవాలే అని అంగీకరించి నప్పుడు "జగద్గతదోషాలు అంగియైన పరమేశ్వరునికి కూడ సంబంధించి ఉండాలి గదా?

అతడు కేవలం అనంతకల్యాణగుణాకరుడు మాత్రమే ఎలా అవుతాడు?" ఇత్యాది ప్రశ్నలకు అవకాశం ఉండదు. జగదాదులకు పరబ్రహ్మకున్న సత్యత్వం వంటి సత్యత్వం లేనప్పుడు, అవన్నీ ఒక విధంగా కాల్పనికములే అయినప్పుడు వీటి దోషాలు పరమాత్మకు అంటవు కదా. దోషాలు అంటవు; గుణాలూ అంటవు. మరీచ్యారోపి జలంతో మరుభూమిలో సాగు చేయజాలరు కదా?

పరమాత్మకు సర్వగతత్వాన్ని అంగీకరించే ద్వైతవాదంలో కొన్ని చిక్కులు ఎదుర్కొన వలసి ఉంటుంది. జగత్తు కూడ సత్యమే అయిన పక్షంలో ఆ జగత్తు ఎంత ప్రదేశాన్ని ఆక్రమించి ఉంటుందో ఆ ప్రదేశంలో పరమాత్మ ఉండడానికి వీలు లేదు. పెద్ద నీళ్ల తొట్టె నిండా నీళ్లు ఉన్నాయి. ఆ తొట్టిలో కొన్ని రాళ్లు వేశాం. ఇపుడా నీరు రాళ్లు ఉన్న ప్రదేశం తప్ప మిగిలిన ప్రదేశానికి సర్దుకుంటుంది. ఈ విధమైన పరిచ్ఛిన్నత్వాన్ని పరమాత్మకి అంగీకరిస్తే పరిపూర్ణమైన సర్వగతత్వానికి లోపం వస్తుంది. అంతా ఆయన శరీరమే అంటే జగత్తులో ఉండే ఎన్నో మంచి విషయాలతో పాటు ఎన్నో చెడ్డ విషయాలు కూడ ఆ పరమాత్మకు అంటకట్టవలసివస్తుంది. ఇదంతా ప్రతీతి మాత్రమే అని, వాస్తవంలో, కనీసం జ్ఞాని దృష్టిలో, జగత్తు అనేది లేదు అని అంగీకరిస్తే ఈ చిక్కు ఉండదు.

తనకు పూర్వం ఉన్నవారు, తమ సమకాలికులూ అయిన దార్శనికులందరూ ద్వైతులే అనే విషయం శ్రీ శంకరభగవత్పాదులకు తెలియును. అయితే ఆయనకు ఉపనిషత్తులలో మాయావాదం అనే బ్రహ్మాస్త్రం దొరికింది. దానిని వశంలో ఉంచుకుని వైశేషిక-సాంఖ్య-మీమాంసకాది ద్వైతులను నిర్భయంగా ఎదురుకుంటూ తమకు అత్యుత్తమ ప్రమాణమైన వేదంయొక్క అవలంబం ఉంది గాన వాదంలో చివరికి జయం తమదే అని ఉద్ఘోషిస్తారు. శ్రీహర్షుడు కూడ ఇలాంటి ఘట్టంలోనే ఖండనఖండఖాద్యంలో ఇలా అంటాడు.

"ఏకంబ్రహ్మాస్త్రమాదాయ నాన్యం గణయతః క్వచిత్,
ఆస్తే న వీరధీరస్య భఙ్గః సంగరకేలిషు."

"బ్రహ్మాస్త్రం ఒక్కటీ చేత పట్టి మరి దేనినీ లెక్కచేయని ధీరవీరునికి సమరాంగణ కేళిలో భంగం అనేది ఉండదు."

తాము స్థాపించిన అద్వైతసిద్ధాంతం విషయంలో శ్రీ శంకరభగవత్పాదులకున్న అచంచలవిశ్వాసం తైత్తిరీయోపనిషద్భాష్యంలోని ఈ క్రింది వాక్యాలవల్ల తెలుస్తుంది.

“చిన్తయసి త్వమ్? న నిర్ణేష్యసి. కిం న నిర్ణేతవ్యమితి వేదవచనమ్? న. కథం తర్హి? బహుప్రతిపక్షత్వాత్. ఏకత్వవాదీ త్వమ్; వేదార్థపరత్వాత్. బహవో హి నానాత్వవాదినః వేదబాహ్యాః త్వద్విపక్షాః. అతో మమాశఙ్కా న నిర్ణేష్యసీతి. ఏతదేవ మే స్వస్త్యయనమ్, యన్మామేకయోగినమ్ అనేకయోగిప్రతిపక్షమాత్థ. అతో జేష్యామి సర్వాన్; ఆరభే చ చిన్తామ్” (బ్రహ్మానందవల్లీ 8.5)

ఇది, శ్రీ శంకరభగవత్పాదులకీ, ఊహాకల్పితుడైన ఒక ప్రతివాదికీ లేదా మధ్యస్థునికీ మధ్య జరిగిన సంభాషణ. (ప్రతిపక్షి) నిజమే, నువ్వు వాదించాలని అనుకుంటున్నావు. కాని నువ్వు ఏ నిర్ణయానికీ రాజాలవు (శం) ఏ నిర్ణయానికీ రాజాల నంటూ ఇదేమైనా వేదవాక్యమా? (ప్ర) కాదు. (శం) ఐతే సమస్య ఏమిటి? (ప) నీకు ప్రతిపక్షులు చాలామంది ఉన్నారు. అంతే కాకుండా నువ్వు వేదాన్నే పట్టుకొని వ్రేలాడుతూ అద్వైతం అద్వైతం అంటూ మాట్లాడుతూంటావు. అందుచేత వాదంలో నీకు విజయం లభించదేమో నని నాకు సందేహం. (శం) నేను అద్వైతిని; నాకు ప్రతిపక్షులు చాలమంది ఉన్నారు, వాళ్లంతా ద్వైతులు అని కదా నువ్వు అంటున్నారు. ఇదే నాకు బలం. నేను వాళ్లందరినీ జయిస్తాను; వాదం ప్రారంభిస్తున్నాను”.

పై వాక్యాలలో శ్రీ శంకరభగవత్పాదులు ఒక రహస్యాన్ని సూచించారు ఔపనిషదమైన సిద్ధాంతాన్ని అభివ్యక్తీకరిస్తాం అని అందుకు ఉద్యుక్తులైన వాళ్లందరూ పూర్తిగా తమ సిద్ధాంతాన్ని ఉపనిషత్తులను మాత్రమే ప్రమాణంగా చేసికొని ప్రతిపాదిస్తే వాళ్లు కూడ చివరికి అద్వైతసిద్ధాంతాన్నే చేరుకొన వలసిఉంటుంది. అలా కాకుండా ఇతరతంత్రాగమాదులలో చెప్పిన విషయాలను కూడ తీసికొని వచ్చి దీనిలో చొప్పించడంతో అద్వైతానికి దూరం అవుతున్నారు. ఎప్పటి కైనా పునః పరిశీలన చేసుకొంటే దీని వైపే రాగల రని శ్రీ శంకరభగవత్పాదుల అభిప్రాయం.

### ఉపనిషత్తుల పరమతాత్పర్యం

శ్రీ శంకరభగవత్పాదుల అభిప్రాయం ప్రకారం జీవాత్మ-పరమాత్మల యథార్థస్వరూపాన్ని నిరూపించడంలోనే ఉపనిషత్తుల పరమతాత్పర్యం.

"వేదాన్తవాక్యకుసుమగ్రథనార్థత్వాత్ సూత్రాణామ్" (బ్ర.సూ. భా. 1.1.2) అని శ్రీ భగవత్పాదులే చెప్పినట్లు ఉపనిషద్వాక్యార్థనిర్ణయం కోసం రచించబడిన బాదరాయణసూత్రాలకు బ్రహ్మసూత్రం అనే సార్థకమైన నామధేయం ఇవ్వబడిది. అట్లే బ్రహ్మసూత్రాలకు శ్రీశంకరభగవత్పాదులు రచించిన భాష్యానికి శారీరకభాష్యం అని పేరు. శరీరంలో ఉండే జీవుని స్వరూపాన్ని నిర్ణయించడంకోసం ఉద్దిష్టమైన దవడంచేత దీని కా పేరు. జీవాత్మ-పరమాత్మల స్వరూపాలు తప్ప ఉపనిషత్తులలో చర్చించిన ఉపాసనా-జగత్సృష్ట్యాదు లన్నీ కూడ అనుషంగికాలు. అందుచేతనే వాటిలో కొన్ని భేదాలు కూడ కనబడతాయి. జీవ-బ్రహ్మస్వరూపనిరూపణంలో మాత్రం పూర్తి ఐకమత్యం ఉంది. తెలిసినదాని సహాయంతో తెలియనిదానిని తెలుసుకోవడం అనే పద్ధతిలో మనకు ప్రత్యక్షంగా కనబడే జగదాదులు కూడ పరోక్షమైన పరమాత్మను గూర్చి తెలుసుకొనడానికి ఉపయోగిస్తాయి. బ్రహ్మ నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావ మైనది. దానిమీద ఈ జగత్తు ఆరోపించబడింది. ముందు ఈ జగత్తుయొక్క స్వరూపాన్ని పరిశీలించి, ఇది బ్రహ్మమీద ఏ విధంగా ఆరోపించబడిందో చెప్పి, దీని ఆరోపానికి ఆధారమైనది ఒకటి ఉందని బోధించి, చివరికి ఈ అరోపితజగత్తును నిషేధించడం (అపవాదం) ద్వారా ఇంక మిగిలినది ఆ పరబ్రహ్మయే అని సాధకునికి తెలపడం జరుగుతుంది. ఇది అధ్యారోపాపవాదపద్ధతి. ముందు ఉన్నదానిమీద లేని ఒకదానిని ఉన్నట్లు అరోపించడం అధ్యారోపం. తరవాత అది అక్కడ లేదు; అక్కడ ఉన్నది ఇది అని బోధించడం అపవాదం. ఉదాహరణకి దూరంగా తళతళలాడు తూన్న ఒక వస్తువును చూపి చూడు "అక్కడ అలా మెరుస్తూన్నది వెండి"అని ముందు చెప్పి తరవాత వాని దృష్టి ఆ వస్తువుమీద కేంద్రీకృతం అయిన తరవాత "ఇది వెండి కాదు. ముత్యపు చిప్ప" అని దాని యథార్థస్వరూపం చెపితే అది అధ్యారోపాపవాదపద్ధతి, (ఇది విషయ గ్రహణం మాత్రం కోసం చూపిన ఉదాహరణం). లేదా జగదాదికం బ్రహ్మకార్యం అని చెప్పి కార్యం ద్వారా కారణం వరకు తీసికొని వెళ్లవచ్చును, ఈ రెండు పద్ధతుల ద్వారా అసలు తత్త్వాన్ని బోధించడానికే ఉపనిషత్తులు జగత్సృష్ట్యాదికాన్ని చెపుతున్నాయి. జగత్తును గూర్చి చెప్పడంలో వాటికి తాత్పర్యం లేదు. అట్లే చిత్తశుద్ధిద్వారా బ్రహ్మసాక్షాత్కారం పొందడానికై వివిధోపాసనలు కూడ

ఉపనిషత్తులలో చెప్పబడ్డాయి. పురాకృతపుణ్యంచేత సహజంగానే ఆత్మసాక్షాత్కారం పొందగలవానికి ఉపాసనలతో పని లేదు. అందరూ అన్ని ఉపాసనలూ చేయవలసిన అవసరం కూడ లేదు. ఇది అద్వైతసంప్రదాయం. ఈ విషయాన్ని శ్రీ భగవత్పాదులు అనేక స్థలాలలో విశదీకరించి ఉన్నారు.

"తదత్ర యల్లక్షణం బ్రహ్మ కారణత్వేన విజ్ఞాతం తల్లక్షణమేవ అన్యత్రాపి విజ్ఞాయతే "**సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్. తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి. తత్తేజోऽసృజత**" (ఛా. ఉ. 6.2.1,3) ఇతి. తథా "**ఆత్మా వా ఇదమగ్ర ఆసీత్, నాన్యత్ కించన మిషత్, స ఐక్షత లోకాన్ను సృజా ఇతి**" (ఐ.ఉ. 4.1.1,2) ఇతి చ. ఏవంజాతీయకస్య కారణస్వరూపనిరూపణపరస్య వాక్యజాతస్య ప్రతివేదాన్తమవిగీతార్థత్వాత్. కార్యవిషయం తు విగానం దృశ్యతే-క్వచిదాకాశాదికా సృష్టిః, క్వచిత్తేజఆదికా ఇత్యేవంజాతీయకమ్. న చ కార్యవిషయేణ విగానేన కారణమపి బ్రహ్మ సర్వవేదాన్తేషు అవిగీతమధిగమ్యమానమ్ అవివక్షితం భవతి ఇతి శక్యతే వక్తుమ్ - అతిప్రసంగాత్, సమాధాస్యతి చ ఆచార్యః కార్యవిషయమపి విగానమ్ - "**న వియదశ్రుతేః**" (2.3.1) ఇత్యారభ్య. భవేదపి కార్యస్య, విగీతత్వమ్, అప్రతిపాద్యత్వాత్, న హ్యయం సృష్ట్యాదిప్రపఞ్చః ప్రతిపిపాదయిషితః. న హి తత్ప్రతిబద్ధః కశ్చిత్పురుషార్థః దృశ్యతే, శ్రూయతే వా; న చ కల్పయితుం శక్యతే. ఉపక్రమోపసంహారాభ్యాం తత్ర తత్ర బ్రహ్మవిషయైర్వాక్యైః సాకమేకవాక్యతాయా వక్ష్యమాణత్వాత్. దర్శయతి చ సృష్ట్యాదిప్రపఞ్చస్య బ్రహ్మప్రతిపత్త్యర్థతామ్ - "**అన్నేన సోమ్య శుఙ్గేనాపో మూలమన్విచ్ఛ అద్భిః సోమ్య శుఙ్గేన తేజో మూలమన్విచ్ఛ తేజసా సోమ్య శుఙ్గేన సన్మూలమన్విచ్ఛ**" (ఛా. ఉ. 6 84) ఇతి. మృదాదిదృష్టాన్తైశ్చ కార్యకారణాభేదం వదితుం సృష్ట్యాదిప్రపఞ్చః శ్రావ్యతే ఇతి గమ్యతే. తథా చ సంప్రదాయవిదో వదన్తి-

**మృల్లోహవిస్ఫులిఙ్గాద్యైః సృష్టిర్యా చోదితాన్యథా,**

**ఉపాయః సోऽవతారాయ నాస్తి భేదః కథంచన**" (మా.కా. 3.15)

బ్రహ్మప్రతిపత్తిప్రతిబద్ధం తు ఫలం శ్రూయతే - "**బ్రహ్మవిదాప్నోతి పరమ్**" (తై. ఉ. 2.1) "**తరతి శోకమాత్మవిత్**" (ఛా.ఉ. 7.1.3) "**తమేవ విదిత్వా అతిమృత్యుమేతి**" (శ్వే.ఉ. 3.8) ఇతి. ప్రత్యక్షావగమం చేదం ఫలమ్ - "**తత్త్వమసి**" ఇత్యసం

సార్యాత్మప్రతిపత్తౌ సత్యాం సంసార్యాత్మత్వవ్యావృత్తేః" (బ్ర.సూ.భా. 1.4.14).

"ఏ లక్షణాలు గల బ్రహ్మ ఇక్కడ జగత్కారణంగా తెలుస్తున్నదో ఆ లక్షణాలే కల బ్రహ్మయే ఇతర స్థలాలలో కూడ తెలుస్తున్నది. (ఉదాహరణకి) "సదేవ.... సృజత" ఓ సౌమ్యుడా! సృష్టిప్రారంభంలో కేవలం సద్రూపమైన బ్రహ్మయే ఉండేది. అది సజాతీయవిజాతీయస్వగతభేదరహితమైనది. "నేను అనేకరూపాలు ధరించి సృష్టిస్తాను". అని అది అనుకొన్నది. అది తేజస్సును సృష్టించింది" అని (ఒక ఉపనిషత్తులో చెప్పబడింది). అట్లే (మరొక ఉపనిషత్తులో) "ఆత్మా... సృజా ఇతి" (ప్రారంభలో ఇదంతా ఆత్మ గానే ఉండేది. మరొక వస్తు వేదీ మొదట లేదు. "నేను లోకాలను సృష్టిస్తాను" అని ఆ ఆత్మ ఆలోచించింది" అని (చెప్పబడింది). కారణస్వరూపాన్ని ప్రతిపాదించే ఈ రకమైన వాక్యసముదాయంలో విషయభేదం ఏమీ లేదు. (అన్నీ ఒకే కారణ స్వరూపాన్ని గూర్చి చెపుతున్నాయి). కార్యం విషయంలో మాత్రం భేదం (పరస్పరవిరోధం) కనబడుతున్నది. సృష్టి ఆకాశసృష్టితో ప్రారంభమైనది అని ఒక చోట చెపితే మరొక చోట తేజఃసృష్టితో ప్రారంభం అయినది అని చెప్పబడింది. కార్యం విషయంలో విగానం (పరస్పరవిరోధం) ఉన్నంతమాత్రాన, అన్ని వేదాంతాలలోను విగానం ఏమీ లేకుండా ప్రతిపాదించబడుచున్న బ్రహ్మ వివక్షితం కాదు అని చెప్పడానికి శక్యం కాదు కదా? అలా చెపితే అతిప్రసంగం ఏర్పడుతుంది. (ఎక్కడో ఉన్న లోపాన్ని మరొక చోట అన్వయించడం ప్రారంభిస్తే ఏదీ సరిగా కుదరదు). అయితే ఆచార్యుడు "న వియదశ్రుతేః" అని ప్రారంభించి కార్యంవిషయంలో కూడ విగానం లేదని చెప్పబోతున్నాడు. ఇంతకీ కార్యం ప్రతిపాద్యం కాదు గాన విగీతత్వం ఉంటే ఉండవచ్చును కూడ. సృష్టి మొదలైన ఈ విషయం అంతా ప్రతిపాదించడానికి ఉద్దిష్టం కాదు. సృష్ట్యాదులను సవిస్తరంగా ప్రతిపాదిస్తే దానిని తెలుసుకొనడంవల్ల పురుషార్థం ఏదీ కనబడడంలేదు. (శ్రుతిలో) వినబడడం లేదు. మనం కల్పించడానికి కూడ శక్యం కాదు. సృష్ట్యాదిప్రతిపాదకవాక్యా లన్నింటికీ, ఉపక్రమోపసంహారాల సామర్థ్యంచేత, బ్రహ్మవిషయకాలైన వాక్యాలతో ఏకవాక్యతయే (కాని అవి స్వతంత్రంగా అర్థాన్ని బోధించవు) అని చెప్పబడ నున్నది. "అన్నేన అన్విచ్ఛ" "సౌమ్యుడా! పృథివి... అనే లింగం (కార్యం) చేత దాని మూలమైన ఉదకాన్ని తెలుసుకో; ఉదకం అనే

లింగంచేత దాని మూలమైన తేజస్సును తెలుసుకో, తేజస్సనే లింగంచేత దాని మూలమైన సత్తును బ్రహ్మను) తెలుసుకో" అని సృష్ట్యాదుల విస్తృతవర్ణనం అంతా (మూలకారణమైన) బ్రహ్మను తెలుసుకొనడంకోసమే అని చూపుతున్నాడు. మృత్తు మొదలైన దృష్టాంతాలచేత, కార్యానికి కారణానికీ భేదం లేదని చెప్పడం కోసమే, సృష్ట్యాదివివరణం చేయబడుచున్న దని తెలుసన్తూన్నది. ఈ విషయమే సంప్రదాయవేత్తలు "మృల్లోహ.. కథంచన" అని చెప్పారు. "మట్టి, ఇనుము, నిప్పు నెరసు మొదలైన దృష్టాంతాల సహాయంతో ఏ జగత్సృష్టి చెప్పబడిందో అది కేవలం పరమకారణమైన పరమాత్మమీద బుద్ధి నిలవడం కోసమే. ఏ విధంగానూ భేదం లేదు" అయితే "బ్రహ్మ.. పరమ్" "బ్రహ్మవేత్త బ్రహ్మను పొందుతాడు", "తరతి.. విత్" "ఆత్మ వేత్త శోకం దాటుతాడు", "తమేవ..మేతి" "ఆ ఆత్మను తెలియగానే మృత్యువును (సంసారాన్ని) దాటుతాడు" అని బ్రహ్మజ్ఞానంవల్ల ఫలం కలుగుతుం దని చెప్పబడుచున్నది. బ్రహ్మజ్ఞానంవల్ల కలిగే ఫలం ప్రత్యక్షంగానే చూడవచ్చును. ఎందువల్ల ననగా "తత్త్వమసి" అని అసంసారి యైన ఆత్మను తెలుసుకోగానే సంసార్యాత్మ నివర్తిస్తుంది".

### అద్వైతికి ఎవరితోను విరోధవిద్వేషాలు లేవు

తన సిద్ధాంతంమీద ఎంతటి దృఢవిశ్వాసం ఉన్నా అద్వైతి ద్వైతుల విషయం లో ఏమాత్రమూ కూడ ద్వేషభావం వహించడు. వ్యావహారికసత్తాభూమికలో అనేక భేదా లుండవచ్చు ననీ, వారి వారి అధ్యాత్మికస్థితిలోని తారతమ్యాన్ని బట్టి వేరు వేరు ఆలోచనలు గల మనుష్యులు ఉంటా రనీ ఆతనికి తెలియును. అలాంటప్పుడు తన మాటే అందరూ వినాలని కాని విననివాళ్లందరూ మహాపాపాత్ము లని గాని అనుకునేవాడు నిజమైన అద్వైతి కాజాలడు. చిత్తశుద్ధికి కావలసిన సాధనా లన్నీ సమకూర్చుకున్న తరువాతనే ఈ శాస్త్రం వైపు రావడం మంచి దని శ్రీ శంకరభగవత్పాదులు ప్రథమసూత్రవ్యాఖ్యలోనే విశదీకరించారు. సాధనాలు కొరవడినా శాస్త్రగురూపదేశాలమీద పరిపూర్ణశ్రద్ధ కలవారు శాస్త్రాధ్యయనం చేసి శాస్త్రోక్తజీవనవిధానం గడుపుతూంటే వెంటనే కాకపోయినా కాలాంతరంలోనైనా లాభం పొందవచ్చును. అంతేనే కాని తాను కూడ పూర్తిగా ద్వైతప్రపంచకంలోనే,

భేదవ్యవహారంలోనే, ఉంటూ ద్వైతుల్ని దూషించడం యుక్తం కాదు. అందుచేతనే అద్వైతి సాధారణంగా ఎవరైనా రెచ్చగొటితే తప్ప ఇతరసంప్రదాయదూషణం చెయ్యడు. ఏ సంప్రదాయాన్నీ ద్వేషించడు. ప్రతిసంప్రదాయమూ ఏదో ఒక భూమికలో మానవునికి ఉపకరిస్తుందని అతని విశ్వాసం.

ప్రస్థానభేదః అనే ఒక చిన్న గ్రంథంలో మధుసూదనసరస్వతి - "సర్వేషామేవ శాస్త్రాణాం భగవత్యేవ తాత్పర్యం సాక్షాత్పరంపరయా వా" (అన్ని శాస్త్రాలకు సాక్షాత్తుగా గాని, పరంపరయా గాని భగవంతునియందే తాత్పర్యం) అని ప్రారంభించి అతి సంక్షిప్తంగా వివిధదర్శనాలను గూర్చి వివరించి చివరికి ఇలా అంటారు.

"సర్వేషాం చ సంక్షేపేణ త్రివిధ ఏవ ప్రస్థానభేదః; తత్రారమ్భవాద ఏకః, పరిణామవాదో ద్వితీయః, వివర్తవాదస్తృతీయః. పార్థివాప్యతైజసవాయవీయాశ్చతుర్విధాః పరమాణవో ద్వ్యణుకాదిక్రమేణ బ్రహ్మాణ్డపర్యన్తం జగదారభన్తే. అసదేవ కార్యం కారకవ్యాపారాదుత్పద్యతే ఇతి ప్రథమస్తార్కికాణాం, మీమాంసకానాం చ. సత్త్వరజస్తమోగుణాత్మకం ప్రధానమేవ మహదహంకారాదిరూపేణ జగదాకారేణ పరిణమతే. పూర్వమపి సూక్ష్మరూపేణ సదేవ కార్యం కారణవ్యాపారేణాభివ్యజ్యత ఇతి ద్వితీయః పక్షః సాంఖ్యయోగపాతఞ్జలపాశుపతానామ్. బ్రహ్మణః పరిణామో జగదితి వైష్ణవానామ్. స్వప్రకాశపరమానన్దాద్వితీయం బ్రహ్మ స్వమాయావశాన్మిథ్యైవ జగదాకారేణ కల్పత ఇతి తృతీయః పక్షో బ్రహ్మవాదినామ్. సర్వేషాం ప్రధానకర్తౄణాం మునీనాం వివర్తవాదపర్యవసానేన పరమేశ్వర ఏవ ప్రతిపాద్యే తాత్పర్యమ్. న హి తే మునయో భ్రాన్తాః; సర్వజ్ఞత్వాత్తేషామ్. కిం తు బహిర్విషయప్రవణానామాపాతతః పురుషార్థే ప్రవేశో న సంభవతీతి నాస్తిక్యవారణాయ తైః ప్రకారభేదాః ప్రదర్శితాః. తత్ర తేషాం తాత్పర్యమబుద్ధ్వా వేదవిరుద్ధేఽప్యర్థే తాత్పర్యముత్ప్రేక్షమాణాస్తన్మతమేవోపాదేయత్వేన గృహ్ణన్తో జనా నానాపథజుషో భవన్తి"

"ఈ అన్ని ప్రస్థానాలనూ మూడు ప్రస్థానాలుగా విభజించవచ్చును. వాటిలో ఆరంభవాదం ఒకటి. పరిణామవాదం రెడవది. వివర్తవాదం మూడవది. నాలుగువిధాలైన పృథివీ-జల-తేజో-వాయుపరమాణువులు ద్వ్యణుకాదిక్రమంలో కలిసి బ్రహ్మాండపర్యంతమైన జగత్తును పుట్టిస్తున్నాయి. అంతకు ముందు లేని కార్యం ఆ

యా కారకాల (కర్తృకరణాదుల) వ్యాపారంచేత పుడుతున్నది అనే మొదటి ఆరంభవాదం తార్కికులది, మీమాంసకులదీ కూడ. సత్త్వ-రజస్-తమోగుణాత్మకమైన ప్రధానమే మహదహంకారాది క్రమంచేత జగదాకారంలో పరిణామం చెందుతుంది. పూర్వం కూడ ఉన్నదే అయిన కార్యం కారకాల వ్యాపారంచేత అభివ్యక్తం అవుతుంది, అనగా అంతవరకు కనబడకుండా ఉన్నది కనబడుతుంది, అనే రెండవపక్షం సాంఖ్య-యోగ-పాతంజల-పాశుపతులది. జగత్తు బ్రహ్మయొక్క పరిణామం అని వైష్ణవుల మతం. స్వప్రకాశపరమానందరూపమైన బ్రహ్మ తన మాయచేత మిథ్యగానే జగద్రూపంలో కనబడుతున్నది అని మూడవ పక్షం బ్రహ్మవాదులది (అద్వైతవేదాంతులది). వివర్తవాదంలోనే అన్నివాదాలు పర్యవసానం చెందుతాయి గాన మునులందరికీ కూడ అద్వితీయమైన పరమేశ్వరుణ్ణి ప్రతిపాదించడంలోనే తాత్పర్యం, ఆ మునులందరూ సర్వజ్ఞులు. వాళ్లు భ్రాంతి చెందుతారు అనడానికి వీలులేదు. అయితే బాహ్యవిషయాసక్తులకు పురుషార్థంలో ప్రవేశం కలగదు అనే అభిప్రాయంతో, వాళ్లు నాస్తికులు కాకుండా ఉండాలని ఈ ప్రకారభేదా లన్నీ వారు చూపించారు. కాని మునుల తాత్పర్యం ఏమిటో తెలునుకొనకపోవడంతో కొందరు వేదవిరుద్ధార్థాలవిషయంలో కూడ వాళ్లకి తాత్పర్యం ఉన్నదనుకొని, ఆ మతాన్ని ఆశ్రయించి వేరు వేరు మార్గాలు అవలంబిస్తున్నారు."

నాస్తికదర్శనాల విషయంలో ఇలాచెప్పడం కుదరదు గాన, అనగా వాటికి కూడ చివరికి భగవంతునియందే తాత్పర్యం అని చెప్పడం కుదరదుగాన వాటిని ప్రస్తావించలేదు అన్నారు మధుసూదనసరస్వతి.

అప్పయదీక్షితులవారు సూచించిన మార్గాన్ని అనుసరించి శ్రీ పోలహం రామశాస్త్రిగారు 'చతుర్మతసామరస్యం' అనే చిన్న గ్రంథంలో ద్వైత-విశిష్టాద్వైత-(శ్రీకంఠప్రతిపాదిత) శైవ, అద్వైతాలకు సామరస్యం చూపుతూ మాధ్వమతంలోని కొన్ని విషయాలు అద్వైతులకు అంగీకార్యాలే, అందుచేత అద్వైతులకు మాధ్వులతో విరోధ ద్వేషాలు లేవు. మాధ్వంకంటె విశిష్టాద్వైతం ఇంకా అద్వైతానికి సంనిహితం, దాని కంటె కూడ సంనిహితం నీలకంఠశైవసంప్రదాయం. అందుచేత ఇవన్నీ అందరికీ గ్రాహ్యాలే అని ప్రతిపాదించారు.

ఇంకొక అడుగు ముందుకు వెడితే అన్ని మతాలకీ సామరస్యం చెప్పవచ్చును ఈ సందర్భంలో మా ఆర్యాశతకం నుండి కొన్ని శ్లోకాల ను ఉదాహరించడం అప్రస్తుతం కాదు.

"వేదా అపౌరుషేయాః పరమం తేఽతః ప్రమాణమిత్యేకే,
ఆగమనిచయస్యైవ ప్రామాణ్యం కలియుగే కిలేత్యన్యే"
"శైవా నిన్దన్తి హరిం శివమపి నిన్దన్తి వైష్ణవాః ప్రాయః,
శైవపురాణానాం కిల న ప్రామాణ్యం తమఃప్రధానత్వాత్"

"వేదాలు అపౌరుషేయాలు. అందుచేత అవే ప్రమాణం అని కొందరంటారు. కలియుగంలో ఆగమాలకే ఎక్కువ ప్రామాణ్యం అని కొందరంటారు."

"సాధారణంగా శైవులు విష్ణువును నిందిస్తూంటారు, వైష్ణవులు శివుణ్ణి నిందిస్తూంటారు. శైవపురాణాలన్నీ తామసాలు; అవి ప్రమాణం కాదని కొందరంటారు."

"శైవపురాణం యది తే నిన్దేయుః వైష్ణవం తథా శైవాః,
సున్దోపసున్దనయతో హ్యప్రామాణ్యం పురాణజాతస్య"

"వైష్ణవులు శైవపురాణాలనూ, శైవులు వైష్ణవపురాణాలను నిందిస్తే సుందోపసుందన్యాయంచేత అన్ని పురాణాలూ అప్రమాణాలని చెప్పవలసివస్తుంది.

"బౌద్ధార్హతాదిమతమిహ నాస్తికతావేదబాహ్యతాజుష్టమ్,
కిముతైస్లామక్రైస్తవమతాదికం యద్విదేశ్యమితి కేచిత్"

"జైనబౌద్ధాదిమతాలే వేదబాహ్యలైన నాస్తికమతా లన్నప్పుడు విదేశీయాలైన ఇస్లాం క్రైస్తవాదిమతాల మాట చెప్పాలా అని కొంద రంటూంటారు."

"దృశ్యన్తే హి మహాన్తో నైకే వేదోక్తమార్గపథికేషు,
బౌద్ధేష్వర్హత్సు తథా శైవేషు చ వైష్ణవేషు శాక్తేషు"

"వేదోక్తధర్మం ఆచరించేవాళ్లలోను, బౌద్ధులలోను, జైనులలోను, శైవులలోను, వైష్ణవులలోను, శాక్తులలోను కూడ ఎందరో మహాపురుషులు మనకు కనబడుతున్నారు"

"క్రైస్తవమహమ్మదీయాదిషు తత్తన్మతపరేషు చాన్యేషు,
బహవోఽద్భుతప్రభావా దృశ్యన్తే యోగిపుంగవా లోకే"

"క్రైస్తవమహమ్మదీయాదులలో కూడ మహా ప్రభావశాలులైన ఎందరో యోగిపుంగవులు

కనబడుతున్నారు.

"దేహాత్మవాదనిరతేష్వపి కేచిల్లోకధర్మమర్మ జ్ఞాః,
యాన్త్యున్నతిమతులామిహ బుద్ధిబలం స్వీయమేకమాశ్రిత్య.

"దేహాత్మవాదులలో కూడ చాలమంది లోకధర్మరహస్యాలు బాగా తెలుసుకొని కేవలం తమ బుద్ధిబలంచేతనే అత్యున్నత స్థితిని పొందుతున్న వాళ్ళు కనబడుతున్నారు"

"ఏవం స్థితేఽత్ర భగవన్ ప్రామాణ్యం కస్య కస్యా వా నేతి
కో వా నిశ్చినుయాదిహ యస్య యదిష్టం తదస్తు తస్య మతమ్"

"ఓ! పరమాత్మా! ఇలాంటి పరిస్థితిలో ఏ మతం గొప్పది, ఏది కాదు అని ఎవడు నిశ్చయించగలడు? మానవుడు ఏ మార్గాన్ని అనుసరించినా వానికి సిద్ధి లభిస్తుంది".

"సర్వే సర్వజ్ఞాః కిల మాయాసంస్థగితసహజసార్వజ్ఞ్యాః,
చిత్తైకాగ్ర్యాభ్యాసాదావరణం భవతి భగ్నమఖిలమపి.

"అందరూ సర్వజ్ఞులే కదా? వాళ్ల సర్వజ్ఞత్వం మాయచేత కప్పబడిపోయింది. చిత్తైకాగ్రత్వాన్ని అలవరచుకొంటే అందరికీ ఆ అవరణం భగ్నం అవుతుంది.".

"కర్మజ్ఞానం భక్తిర్యోగో వోపాసనం తథైవాన్యత్,
భఞ్జయతి కిలావరణం చిత్తస్యాతో ముధా మతద్వేషః"

కర్మగాని, జ్ఞానంగాని, భక్తికాని, యోగంకాని, ఏదైనా మరొక ఉపాసగాని చిత్తావరణాన్ని భగ్నం చేస్తుంది. అందుచేత మతద్వేషం అనవసరం.

తత్త్వం అనేది ఒకటే; రెండు తత్త్వాలుండవు. ఇతర సంప్రదాయ ద్వేషం లేకుండా ఏదో ఒక సంప్రదాయాన్ని శ్రద్ధగా అనుసరిస్తే అదే చివరికి ఏనాటికైనా అసలు తత్త్వాన్ని చేరుస్తుంది.

జగజ్జీవేశ్వరులకు సమానమైన సత్యత్వాన్ని, పరస్పరభేదాన్నీ అంగీకరించిన ద్వైతులైతే పరమేశ్వరుణ్ణి, అద్వైనా మేం చెప్పిన నామరూపాదులు గల పరమేశ్వరుణ్ణి, మేం చెప్పిన విధానంలో మాత్రమే సేవించాలి, అప్పుడే కృతార్థత్వం లభిస్తుంది అనే దురాగ్రహంతో ఉంటారు. అందరూ ఇలా ఉండక పోయినా ఇలా ఉండే వారి సంఖ్య వాళ్లల్లో అత్యధికంగా ఉంటుంది. అందుకు కారణం పుట్టినది మొదలు ఆ విధమైన ఆలోచనా ధోరణిలో పెరగడమే. అద్వైతసిద్ధాంతశ్రద్ధాళువులు కూడ ఇలాంటి దృక్పథం

అలవరచు కొనకుండా ఉండడం కొరకు శ్రీ శంకరభగవత్పాదులు అవకాశం వచ్చి నప్పుడల్లా మన సిద్ధాంతానికి విరుద్ధం కాని విషయాలను ఇతరసిద్ధాంతాలనుండి నిఃసంకోచగా పరిగ్రహించవచ్చును అని సూచిస్తూంటారు. సాంఖ్యయోగమతాలను ఖండించి చివర శ్రీ శంకరభగవత్యాదులు - "సాంఖ్యులూ యోగులూ కూడ ద్వైతులు, అందుచేత వాళ్ల మతంలో అద్వైతసిద్ధాంతానికి విరుద్ధమైన ఏ అంశాలున్నాయో వాటిని మాత్రమే మేం అంగీకరించం. మా సిద్ధాంతానికి విరుద్ధం కాని అంశాలను మాత్రం స్వీకరిస్తాం" అంటారు.

"ద్వైతినో హి తే సాంఖ్యా యోగాశ్చ, నాత్మైకత్వదర్శినః. యేన త్వంశేన న విరుధ్యేతే తేన త్విష్టమేవ సాంఖ్యయోగస్మృత్యోః సావకాశత్వమ్ తద్యథా "అసంగో హ్యయం పురుషః" ఇత్యేవమాదిశ్రుతిప్రసిద్ధమేవ పురుషస్య విశుద్ధత్వం నిర్గుణపురుషనిరూపణేన సాంఖ్యైరభ్యుపగమ్యతే. తథా చ యోగైరపి "అథ పరివ్రాట్ వివర్ణవాసా ముణ్డోఽపరిగ్రహః" ఇత్యేవమాదిశ్రుతిప్రసిద్ధమేవ నివృత్తినిష్ఠత్వం ప్రవ్రజ్యాద్యుపదేశేన అనుగమ్యతే" (బ్ర.సూ.భా. 2.1.4)

అణిమాద్యైశ్వర్యాలను ఇస్తుందని చెప్పే యోగశాస్త్రాన్ని కూడ అప్రమాణం అని కొట్టివేయడం సాహసమే అవుతుంది అని ఒకచోట అంటారు-"యోగోఽప్యణిమాద్యైశ్వర్యప్రాప్తిఫలః స్మర్యమాణో న శక్యతే సాహసమాత్రేణ ప్రత్యాఖ్యాతుమ్". (1.3.33).

ఇట్లే మరొక చోట "పరులమతాన్ని నిషేధించకపోతే అది మాకు అంగీకార్యం అన్నట్లే" అని అంటూ ఒక వాక్యానికి యోగశాస్త్రానుసారం అర్థం చెప్పారు-"ఏవం తర్హి "పరమతమప్రతిషిద్ధమనుమతం భవతి" ఇతి న్యాయాత్ ఇహాపి యోగశాస్త్రప్రసిద్ధాః మనసః పఞ్చ వృత్తయః పరిగృహ్యన్తే-'ప్రమాణవిపర్యయవికల్పనిద్రాస్మృతయః" (బ్ర.సూ.భా. 2.4.12).

ద్వితీయాధ్యాయంలోని ద్వితీయపాదం పూర్తిగా ఇతరమతఖండనానికి ఉద్దిష్టమైనది. దానిలో చివరి అధికరణం ఉత్పత్త్యసంభవాధికరణం. దీనికే పాంచరాత్రాధికరణం అని పేరు కూడ. దానిలో సూత్రకారులు పాంచరాత్రమతాన్ని ఖండించారు. ఈ మతం ప్రకారం పరమేశ్వరుడు ఉపాదానకారణమూ

నిమిత్తకారణమూ కూడ. ఈ అధికరణప్రారంభంలో శ్రీ శంకరభగవత్పాదులు ఈశ్వరుడు ఉభయాత్మకకారణం అని శ్రుతులు చెప్పుచున్నాయి కదా. శ్రుత్యనుసారియైన స్మృతి ప్రమాణమే కదా? అలాంటప్పుడు పాంచరాత్రాన్ని ఎందుకు నిరాకరిస్తున్నారు అని ఆశంకించుకొని ఆ విషయంలో వాళ్లతో మాకు విరోధం లేదు. కొన్ని ఇతరాంశాలు అవైదికాలుగా ఉన్నాయి. అందుచేత ఖండిస్తున్నాం అని సమాధానం చెపుతారు.

"నను శ్రుతిసమాశ్రయణేనాప్యేవంరూప ఏవేశ్వరః ప్రాఙ్నిర్ధారితః - ప్రకృతిశ్చాధిష్ఠాతా చేతి; శ్రుత్యనుసారిణీ చ స్మృతిః ప్రమాణమితి స్థితిః. తత్కస్య హేతోరేష పక్షః ప్రత్యాచిఖ్యాసిత ఇతి. ఉచ్యతే యద్యప్యేవంజాతీయకోంऽశః సమానత్వాన్న విసంవాదగోచరో భవతి, అస్తి త్వంశాన్తరం విసంవాదస్థానమిత్యతస్తత్ప్రత్యాఖ్యానాయారమ్భః". (బ్ర.సూ.భా. 2.2.42).

"అవ్యక్తంకంటె పరుడైన నారాయణుడు పరాత్మ; సర్వాత్మ. అతడు తననే అనేక విధంగా సృజించి ఉన్నాడు... ఆ భగవంతుణ్ణి భక్తిభావంతో సేవించి ఆతని అనుగ్రహానికి పాత్రులు కావాలి" ఇత్యాదివిషయాలు పాంచరాత్రసంప్రదాయంలో చెప్పబడ్డాయి. అవి కూడ మాకు అంగీకార్యాలే అంటారు శ్రీ శంకరభగవత్పాదులు - "తత్ర యత్తావదుచ్యతే యోऽసౌ నారాయణః పరోऽవ్యక్తాత్ప్రసిద్ధః పరమాత్మా సర్వాత్మా స ఆత్మనాత్మానమనేకధా వ్యూహ్యావస్థిత ఇతి - తన్న నిరాక్రియతే "స ఏకధా త్రిధా భవతి" ఇత్యాదిశ్రుతిభ్యః పరమాత్మనోऽనేకధాభావస్యాధిగతత్వాత్. యదపి తస్య భగవతోऽభిగమనాదిలక్షణమారాధనమజస్రమనన్యచిత్తతయాభిప్రేయతే తదపి న ప్రతిషిధ్యతే. శ్రుతిస్మృత్యోరీశ్వరప్రణిధానస్య ప్రసిద్ధత్వాత్. (బ్ర.సూ.భా. 2.2.42)

అదే విధంగా న్యాయశాస్త్రానికి సంబంధించిన కొన్ని అంశాలు అంగీకరించకపోయినా ఒకటి రెండు చోట్ల గౌతముని న్యాయసూత్రాలను సాదరంగా ప్రమాణంగా ఉదహరిస్తారు.

"స్వసిద్ధాన్తవ్యవస్థాసు ద్వైతినో నిశ్చితా దృఢమ్.
పరస్పరం విరుధ్యన్తే తైరయం న విరుధ్యతే" (మా.కా. 3.17)

అనే మాండూక్యకారికను శ్రీ శంకరభగవత్పాదులు ఈ క్రింది విధంగా వ్యాఖ్యానించారు.

"ఇతశ్చ మిథ్యాదర్శనం ద్వైతినాం రాగద్వేషాదిదోషాస్పదత్వాత్. కథమ్?

స్వసిద్ధాన్తవ్యవస్థాసు స్వసిద్ధాన్తరచనానియమేషు కపిలకణాదబుద్ధార్హతాదిదృష్ట్యనుసారిణో ద్వైతినః నిశ్చితాః. ఏవమేవైష పరమార్థో నాన్యథేతి తత్ర తత్రానురక్తాః ప్రతిపక్షం చాత్మనః పశ్యన్తః తం ద్విషన్త ఇత్యేవం రాగద్వేషోపేతాః స్వసిద్ధాన్తదర్శననిమిత్తమేవ పరస్పరమన్యోన్యం విరుధ్యన్తే. తైరన్యోన్యవిరోధిభిః అస్మదీయోఽయం వైదికః సర్వానన్యత్వాదాత్మైకత్వదర్శనపక్షో న విరుధ్యతే, యథా స్వహస్తపాదాదిభిః. ఏవం రాగద్వేషాదిదోషానాస్పదత్వాదాత్మైకత్వబుద్ధిరేవ సమ్యగ్దర్శనమిత్యభిప్రాయః''. (శంకరభాష్యమ్).

"ద్వైతుల దర్శనం (మతం) రాగద్వేషాదిదోషకలుషిత మైనది. అందువల్ల ఇది మిథ్యాదర్శనమే. ఎందువల్ల ననగా కపిల-కణాద-బుద్ధ అర్హతాదుల దృష్టిని అనుసరించిన ద్వైతులు తమ తమ సిద్ధాంతాలకు సంబంధించిన రచనానియమాల విషయంలో నిశ్చితబుద్ధి గలవారై "ఇదే పరమార్థం, మరొకటి కాదు" అని తమ మతాలపై రాగంతో మిగిలినవాళ్లందరినీ తమ శత్రువులనుగా చూస్తూ వాళ్లను ద్వేషిస్తూంటారు. ఈ విధమైన రాగద్వేషాలతో తమ తమ సిద్ధాంతాలను నిలబెట్టుకొనడం కోసం పరస్పరం కొట్లాడు కుంటుంటారు. పరస్పరవిరోధులైన వాళ్లతో మా పక్షానికి విరోధం ఏదీ లేదు. ఎందువల్ల ననగా ఇది వైదికం, వేదప్రామాణ్యంమీద నిలబెట్టబడిన పక్షం; ఆత్మైకత్వదర్శనాన్ని బోధిస్తుంది. అందుచేత ఒక దేహానికి సంబంధించిన హస్తపాదాదులు పరస్పరమూ ఏ విధంగా ద్వేషించవో అదే విధంగా వైదికమైన మా పక్షం ఏ ద్వైతపక్షంతోనూ విరోధించదు. (అందరూ మనవాళ్లే, అందరూ ఒకటే అని కదా ఆత్మైకత్వదర్శనంలోని తత్త్వం). ఈ విధంగా రాగద్వేషాదిదోషాలకు ఆస్పదం కాకపోవడంచేత ఆత్మై కత్వబుద్ధి ఒక్కటే సమ్యగ్జ్ఞానం అని అభిప్రాయం".

"యథా స్వహస్తపాదాదిభిః" అనే వాక్యానికి ఆనందగిరి ఈ విధంగా వ్యాఖ్యానించారు. "యథా స్వకీయకరచరణాదిభిరాఘాతే కదా చిదాచరితేఽపి ద్వేషో న జాయతే, పరబుద్ధ్యభావాత్తథా ద్వైతాభిమానిభిరుపద్రవే క్షుద్రే కృతేఽపి నాద్వైతినస్తేషు ద్వేషో జాయతే. సర్వానన్యత్వాత్పరబుద్ధ్యభావాదిత్యర్థః''.

"తనచేయి గాని కాలు గాని తగిలి గట్టిగా నొప్పి కలిగినా కూడ పురుషుడు

ఆ హస్తపాదాదులను ద్వేషించడు. అందుకు కారణం అవి కూడ నావే కదా అనే జ్ఞానం వాని కుండడం. అట్లే ద్వైతు లందరూ మీది మీదికి ఎగబడి వస్తూ క్షుద్రమైన ఉపద్రవాలు చేయడానికి ప్రయత్నించినా కూడ అద్వైతి, వాళ్లందరూ మనవాళ్లే కదా అనే విశ్వాసంతో, వాళ్ల మాట లేవీ పట్టించుకొనడు" అని భావం.

ఈ విధంగా అతివిశాలమైన దృక్పథం గల మహోత్తమదార్శనికులు శ్రీ శంకరభగవత్పాదులు. మా అద్వైతదర్శనం వైదికం అని చెప్పడంలో ఇతరములైన ఆగమాదులను ఆశ్రయించి ఎందరు ఎన్ని మతభేదాల సృష్టించినా వేదాన్ని మాత్రమే, ఉపనిషత్తులను మాత్రమే, ప్రమాణంగా అంగీకరించే ప్రతి ఒక్కరూ అద్వైతాన్నే అంగీకరించి తీరా లనే దృఢవిశ్వాసాన్ని శ్రీ శంకరభగవత్పాదులు ప్రకటించారు. కాని వైదికులమే అని చెప్పుకొంటూ, ఇతరాగమాదిసిద్ధాంతాలను కూడ ఔపనిషదసిద్ధాంతంలో చొప్పించి అద్వైతాన్ని వ్యతిరేకించడమే కాకుండా తనను అతికటువైన శబ్దాలతో దూషించడానికి వెనుకాడని వైదికద్వైతులు కూడా కాలాంతరంలో పుట్టబోతా రని శ్రీ శంకరభగవత్పాదులు ఊహించి ఉండరు. కాని అలాగే జరిగింది. శ్రీమద్రామానుజాచార్యమధ్వాచార్యాదులు అతి కటువులైన శబ్దాలతో శ్రీ శంకరభగవత్పాదులను వైయక్తికంగా దూషిస్తూ తావన్మాత్రంచేతనే అద్వైతాన్ని సమూలంగా పెకిలించవేయగలం అనీ, తమ సిద్ధాంతాన్ని నిలపగలం అనీ భ్రాంతిపడ్డారు. అలాంటి దేమీ జరగలేదు కదా అద్వైతం అచంచల శిలోచ్చయం వలె చెక్కుచెదరకుండా నిలచి ఉంది. ఈ ద్వైతమతాల లోని అంతర్గతవిరోధాలు, పరస్పరవిరోధాలు చూస్తుంటే, అవన్నీ నిర్జలమేఘశకలాల లాగ ఇటూ అటూ ఎగురుతూనే ఉంటాయి. అద్వైతసిద్ధాంతప్రచండభాస్కరుడు మాత్రం దేదీప్యమానంగా ప్రకాశిస్తూ ఉంటాడు అని స్పష్టం అవుతుంది.

భగవద్రామానుజులు తమ కున్న సుదీర్ఘసమాననిర్మాణచాతురి నంతనీ ప్రదర్శిస్తూ రఘువీరగద్యం ఫక్కికలో అద్వైతమతప్రతిష్ఠాపనాచార్యులు, ప్రపంచంలోని మహాధీసంపన్నులలో అగ్రగణ్యులుగా పేర్కొనబడుచున్నవారూ, స్మరణమాత్రంచేతనే

సకలపాపాలను దహించే పరమపవిత్రనామధేయులూ అయిన శ్రీ శంకరభగవత్పాదులను అనేక జన్మసంచితమహాపాపకలుషితాత్ములనుగా వర్ణించారు. "తదిదమౌపనిషదపరమపురుషవరణీయతాహేతుగుణవిశేషవిరహిణామనాది పాపవాసనాదూషితాశేషశేముషీకాణామనధిగతపదవాక్యస్వరూపతదర్థ యాథాత్మ్యప్రత్యక్షాదిసకలప్రమాణవృత్తతదితికర్తవ్యతారూపసమీచీనమార్గాణాం వికల్పాసహవివిధకుతర్కకల్కకల్పితమితి, న్యాయానుగృహీతప్రత్యక్షాదిసకలప్రమాణ వృత్తయాథాత్మ్యవిద్భిరనాదరణీయమ్." (భాష్యం 1.1.1)

ఏదో యుద్ధరంగంలో మనఃకల్పితుడైన ప్రతిపక్షిని నేలమీద పడవేసి వాని శరీరం ఇంకా ముద్గరంతో చితుక కొట్టినట్లు భావన చేస్తూ మధ్య మధ్య వీరు వాడే "ఇత్యలమనేన దిష్టహతముద్గరాభిఘాతేన" (దైవవశంచేతనే చచ్చిన వానిని ఇంకా ముద్గరంతో మర్దించి చాలును) ఇత్యాదివాక్యాలు చాల కనబడతాయి. ఇది ఆధ్యాత్మికవిషయవిచారమో భీరుభటుల శూన్యకదనరంగవిహారమో తెలియదు!

ఇంతకంటె ఒక ఆకు ఎక్కువ చదివిన ఆచార్యులు శ్రీమన్మధ్వాచార్యులు. వీరి దూషణవాక్యాలను అనువదించడానికి కూడ సంకోచించవలసి ఉంటుంది. గీతాభాష్యాంతంలో వీరు వ్రాసిన మహాకవితాసౌందర్యభరితమైన శ్లోకం చూడండి-

"శంకరాఖ్యస్య దుర్యోనేర్నిస్సృతేన రజస్వలా,

గీతానారీ సమీరేణ శోధితా హంసరూపిణా" (గీతాభాష్యాంతం)

ఇలాంటి నిరర్థకోద్గారాలన్నీ వారి వారి "మహోన్నతమానససంస్కారాన్ని" సూచిస్తాయి. ఇంకా ఆశ్చర్యకరమైన విషయం ఏమనగా ఈ సంప్రదాయాలకు చెందిన తరువాతివారిలో కూడ కొందరు (అందరూ కాదు) స్వీయగోష్ఠులలో ఇలాంటి వాక్యాలను ఉదాహరిస్తూ ఆహా మా ఆచార్యులు ఎంత బాగా అన్నారు అని సంతోషిస్తూంటారు. కొందరు సిగ్గుపడుతూంటారు.

ఇలాంటి నిందలు, ఆక్షేపణలు ఏ పద్మపాదాచార్యులవారి లేదా సురేశ్వరాచార్యులవారి దృష్టికైనా వెడితే వారు - "నాయనలారా ఎందుకు ఇంత

వృథాక్రోధావేశం? ఏమైనా మీరు నాకంటె చిన్నవాళ్లు. నా మాట వినండి. మీ తాతలు, ముత్తాతలూ కూడ మా ఆచార్యపాదులు స్థాపించిన అద్వైతమతాన్నే అనుసరించి, సాధనామార్గంలో ఉన్నంతకాలం వాళ్ల అభిరుచి ప్రకారం, శివుణ్ణో, కేశవుణ్ణో, దేవినో, గణపతినో మరే దేవతనో ఆరాధించి తరించారు. వాళ్లెవరూ నరకానికి వెళ్లినట్లు తార్కాణా లేవీ లేవు. అలాంటి దేదైనా జరిగితే వాళ్ల వంశాలలో మీవంటి మహామేధావులు, సదాచారసంపన్నులు పుట్టి ఉండరు. మీరు కూడా ప్రారంభంలో మా ఆచార్యచరణుల భాష్యాలే చదివారు కదా? ఉన్నది ఉన్నట్లుగా చెప్పడం మా ఆచార్యచరణుల పద్ధతి. ఏకాక్షరనిఘంట్వాదుల సహాయంతో ఉపనిషదర్థాలను ఇష్టం వచ్చినట్లు మార్చే పద్ధతి వారికి తెలియదు. మా అచార్యపాదులు పూర్వపక్షాలుగా చూపినవాటిని సిద్ధాంతాలుగా గ్రహించి వాటినే పట్టుకొని వ్రేలాడుతూ విషయం అర్థంకాకపోతే అర్థం చేసుకొనడానికి ప్రయత్నించాలి కాని ఎందుకు ఈ నిందావాక్యాలు. మీరు చేసే ప్రతి ఆక్షేపానికి, ప్రతీ ప్రశ్నకీ సమాధానాలు సుస్పష్టంగా మా ఆచార్య పాదుల భాష్యాలలోనే మీకు లభిస్తాయి కదా? అవి అర్థం కాకపోతే ప్రకరణగ్రంథాలు చదువుకొనండి. తరవాత భాష్యాల దగ్గరికి వెళ్లండి. వారి భావాలనే విశదీకరిస్తూ మేం అందరం వ్రాసిన వ్యాఖ్యానాలు, ఉపవ్యాఖ్యానాలు ఉన్నాయి కదా? ఇష్టసిద్ధి, తత్త్వదీపిక, ఖండనఖండఖాద్యం మొదలైన గ్రంథాలున్నాయి కదా? నిజానికి మీరు సిద్ధాంతాలుగా గ్రహించిన విషయా లన్నీ వాటిలోని పూర్వపక్షాలే కదా? ఇంత ఆవేశంతో వ్రాసిన గ్రంథాలు అహంకారాన్నీ, ద్వేషాన్నీ పెంచుతాయి కాని మనఃశాంతి నిస్తాయా?" అని అనేవారు.

ఇలాంటి దూషణవాక్యాలు, శ్లోకాలు చాలా ప్రమాదకరమైనవి. వీటిని పేర్లు, ప్రసంగాలు మార్చి ప్రయోగించినవారిమీదికే త్రిప్పికొట్టవచ్చు. అందుచేతనే సుందర పాండ్యుడు ఆర్యా అనే సూక్తిసముచ్చయంలో

"అప్రియముక్తాః పురుషాః ప్రయతన్తే ద్విగుణమప్రియం వక్తుమ్,
తస్మాదవాచ్యమప్రియమన్యప్రియవాక్యకామేన"

"ఎవరివిషయంలోనైనా అప్రియవాక్యం పలికిన ట్లయితే వాళ్లు రెట్టింపు

అప్రియంగా ఉండే పరుషవాక్యం పలకడానికి ప్రయత్నిస్తారు. అందుచేత ఇతరులు (తన విషయంలో) ప్రియవాక్యాలు పలకాలి అనుకొనే వాడు తా నెప్పుడూ అప్రియవాక్యం పలకకూడదు". అని అంటాడు. సరిగా ఇదే జరిగింది. ఎవరికి ఎవరు తీసిపోతారు! ఒకరు ఒకవిధంగా శ్లేషాదులతో నిందిస్తే మరికొందరు వాళ్లని అదే విధంగా దూషించడం ప్రారంభించారు. స్వతంత్రగ్రంథాలే బయలుదేరాయి. ఉదాహరణకి - మహావైయాకరణుడైన భట్టోదీక్షితులు అడుగడుగునా మధ్వసిద్ధాంతాన్ని ఖండిస్తూ బ్రహ్మసూత్రాలకు తత్త్వకౌస్తుభం అనే వ్యాఖ్యరచించాడు. ఇలాంటివి ఎన్నో. దీనివల్ల కలిగిన ఫలం ఏమయ్యా అంటే అసలు గ్రంథాల దాకా వెళ్లలేనివాళ్ల హృదయాలలో బహిర్జనాలాపకృతాలైన చిన్నచూపులే మిగిలాయి. ఇవన్నీ

**"అపథే పదమర్పయన్తి హి శ్రుతవన్తోఽపి రజోనిమీలితాః"**

"ఎంత విద్యావంతులైనా కూడ రజోగుణం కమ్మి చెడ్డమార్గంలో అడుగు పెడతారు" అనే కాళిదాసోక్తికి ఉదాహరణలు.

ఇదంతా ఒక విధంగా అప్రస్తుతమే. అప్రస్తుతమే కాదు కాళిదాసే చెప్పి నట్లు

**"న కేవలం యో మహతోఽపభాషతే శృణోతి తస్మాదపి యః స పాపభాక్"**

("మహాపురుషులను ఎవడైతే నిందిస్తాడో వానికే కాదు, ఆ నిందావాక్యాలు విన్నదానికి కూడ పాపం చుట్టుకొంటుంది"). ఇలాంటివి స్మరించడం పాపహేతువు కూడ. అయినా అధునికు లైనా ఇలాంటి పూర్వనిర్ణీతభావాలను దూరంగా పెట్టి శాస్త్రతత్త్వజ్ఞానం కోసం ప్రయత్నించాలని సూచించడం కోసం ఈ అప్రస్తుతప్రసంగం చేయబడింది. తన క్రమాగతసంప్రదాయాన్ని యథాశక్తిగా అనుసరిస్తూ, ఇతరసం ప్రదాయాలలో, అవి విదేశీయమతాలు కావచ్చు, నాస్తికమతాలు కావచ్చు, ఉన్న ఉత్తమాంశాలని కూడ స్వీకరించడవల్ల మానవునికి పరిపూర్ణత్వం లభిస్తుంది. ప్రధానసిద్ధాంతానికి విరుద్ధం కాని మంచి విషయాలను ఏ సంప్రదాయంనుంచి యైనా తీసుకుంటాం అని శ్రీ శంకరభగవత్పాదులు చూపిన మార్గాన్ని అనుసరించడమే

ఇందుకు ఏకైకోపాయం.

**ఉపనిషత్తులలో చెప్పిన ఉపాసనాదులు:** బ్రహ్మ ఒక్కటే సత్యమనీ, జగత్తు మిథ్యఅనీ అనగా సత్యమే కాని బ్రహ్మవలె సత్యం కాదనీ, ఉపనిషత్తుల సారాంశ మని చూచి ఉన్నాం. ఈ జగత్సృష్ట్యాదులకు కారణం మాయోపహితబ్రహ్మయే అని తెలుసుకొన్నాం. పారమార్థికభూమికవరకు వెళ్లిన తరవాత ఈ జగద్వ్యవహార మంతా బాధిత మైపోతుంది. కాని అంతవరకు, క్రింది భూమికలో, వ్యావహారికదశలో, జగద్వ్యవహారం అంతా సత్యమే అనే విషయం కూడ గుర్తించి ఉన్నాం. ఉపనిషత్తులలో చెప్పిన ప్రకారం ఈ జగత్తులో అనేకలోకా లున్నాయి. వీటిలో అన్నింటిలోకీ అత్యుత్తమమైన లోకం సగుణబ్రహ్మలోకం. కొంతకాలం భూమిమీద నివసించిన మానవుడు మరణానంతరం తన కర్మల ననుసరించి ఆ యా లోకాలకి ఏ విధంగా ప్రయాణిస్తాడో ఛాందోగ్య-బృహదారణ్యక-కౌషీతక్యాద్యుపనిషత్తులలోను తదనుసారం బ్రహ్మసూత్రాలలోను చెప్పబడింది.

**దేవయానము, పితృయాణము** అని రెండు మార్గా లున్నాయి. ఉత్తమము లైన ఉపాసనలు (సగుణోపాసనలు) చేసిన తపఃశాలులను దేవతలు దేవయానం ద్వారా బ్రహ్మలోకం చేరుస్తారు. వారు అక్కడ కూడ ఉపాసన నడిపిస్తూ ఉండి జ్ఞానం సంపాదించి చివరకు తల్లోకాధీశునితోపాటు ముక్తిపొందుతారు. ఇది క్రమముక్తి. ఇంక ఇష్టాపూర్తాదిపుణ్యకర్మలు చేసేవాళ్లని దేవతలు పితృయాణం ద్వారా చంద్రలోకం చేరుస్తారు. వాళ్లు అక్కడ చాలకాలం ఉండి మళ్లీ భూలోకంలో జనిస్తారు. వాళ్ల తరువాతి జన్మకు కారణమైన కర్మ పుణ్యకర్మయైతే మంచి జన్మ లభిస్తుంది; పాపకర్మ యైతే పాపజన్మ లభిస్తుంది. ఇంక ఉపాసనలు కాని కర్మలు గాని చేయనివారు ఈ భూలోకంలోనే అనేకవిధాలైన యోనులలో జన్మిస్తూ, మరణిస్తూ ఉంటారు.

వివిధలోకాలలోనికి లేదా శరీరాలలోనికి ప్రయాణం చేసేది సూక్ష్మశరీరం. ఈ సూక్ష్మశరీరంలో పచతన్మాత్రలు (పంచసూక్ష్మభూతాలు), పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియచాలు, మనస్సు, బుద్ధి అనేవి పదిహేడు ఉంటాయి. స్థూలశరీరం

పడిపోగానే జీవుడు సూక్ష్మశరీరంతో యతాయాతాలు చేస్తూంటాడు. నిజానికి జీవునికి యతాయాతాలు లేవు. ఇవి సూక్ష్మశరీరానికి మాత్రమే. ఈ సూక్ష్మశరీరం ఎక్కడికి వెడితే అక్కడ, ఘటం ఎక్కడికి వెడితే అక్కడ ఆకాశం ఉన్నట్లు, ఆత్మ ఉంటుంది. అక్కడ ఆ శరీరంతో సంబంధిస్తుంది.

సగుణబ్రహ్మోపాసనేష్టాపూర్తాదులతో సంతృప్తి పడకుండా సతతబ్రహ్మానుసంధానశీలులై అజ్ఞానబంధాన్ని తొలగించుకొని ఆత్మసాక్షాత్కారం సంపాదించుకొనగలిగినవారు ఇక్కడనే ముక్తి పొంద గలుగుతారు. శరీరం ఉన్నంతవరకు అది జీవన్ముక్తి. శరీరపాతానంతరం వాళ్ల సూక్ష్మశరీరం మళ్లీ ఎక్కడికీ వెళ్లడం అనేది ఉండదు. ఆ సూక్ష్మశరీరం ఇక్కడే నిలీనం అయిపోతుంది. అది విదేహముక్తి.

"యదా సర్వే ప్రముచ్యన్తే కామా యేఽస్య హృది శ్రితాః,

**అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మ సమశ్నుతే".** (ము. ఉ. 3.2.9)

(సర్వకామాలు విడచిన మర్త్యుడు అమృతుడై ఇక్కడనే బ్రహ్మను పొందుతాడు).

**"స యో హ వై తత్పరం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి"** (ము.ఉ. 3.2.9)

(పరబ్రహ్మసాక్షాత్కారం పొందినవాడు పరబ్రహ్మయే అవుతాడు)

వెనుక మనం చూచినట్లు ద్వివిధమార్గాల వర్ణనంలో గాని, జగత్సృష్ట్యాది వర్ణనంలో గాని శ్రుతికి తాత్పర్యం లేదు. బ్రహ్మజ్ఞానం సంపాదించుకొన్న వాడు ఈ గమనాగమనాలనుండి విముక్తుడై ఇక్కడనే మోక్షం పొందుతాడు. అందుకోసమే సాధకుడు ప్రయత్నం చెయ్యాలి అని చెప్పడంలోనే శ్రుతికి పరమతాత్పర్యం. శ్రుతులలో కనబడే వివిధమార్గాదివర్ణనం, జగత్సృష్ట్యాదివర్ణనం ఇవన్నీ వైరాగ్యోత్పాదనం కొరకే.

**"తమేవ విదిత్వా అతి మృత్యుమేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ"** (శ్వే. ఉ. .8)

(ఆత్మసాక్షాత్కారం పొందుతేనే మృత్యువును దాటకలుగుతాడు. మరొక మార్గం లేదు).

ఇత్యాద్యుపనిషద్వాక్యాలు ఆత్మజ్ఞానం తప్ప మోక్షానికి మరొక మార్గం లేదని స్పష్టంగా

చెపుతున్నాయి.

**అధ్యాత్మికసాధన:** ఉపనిషత్తులలో ఆత్మజ్ఞానానికి ఉపయోగించే అనేక సాధనాలు ప్రతిపాదింపబడ్డాయి. "కర్మలవల్ల లభించే లోకాలు కూడ నశ్వరములే అనే విషయాన్ని గ్రహించిన బ్రాహ్మణుడు (ఆత్మజ్ఞానసాధకుడు) వైరాగ్యం అలవరచుకోవాలి. కృత్రిమమైనవి (చేసి సంపాదించవలసిన కర్మలు) అకృత్రిమమైన, శాశ్వతమైన మోక్షరూపఫలాన్ని ఇవ్వజాలవు" అని ముండకోపనిషత్తు బోధిస్తున్నది.

**"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన"**

(ము. ఉ. 1.2.12)

బ్రహ్మజ్ఞానానికి కావలసిన - నిత్యానిత్యవస్తువివేకం, ఇహాముత్రార్థఫలభోగ విరాగం, శమదమాదిసాధనసంపద, ముముక్షుత్వం అనే నాలుగు సాధనాలలో వివేక-వైరాగ్యా లనే మొదటి రెండు సాధనాలు ఈ శ్రుతివాక్యంలో చెప్పబడ్డాయి. ప్రపంచకంలో అనేకమైన ఆకర్షణలు ఉంటాయి. అయితే అవన్నీ అశాశ్వతములే అనే విషయాన్ని గ్రహించడమే వివేకం. అప్పుడు వాటిమీద ఆసక్తి తొలగిపోతుంది. అది వైరాగ్యం.

"విజ్ఞానం లేనివాడై పరిశుద్ధ మైన మనస్సు లేక అపవిత్రమైన జీవనవిధానం గడిపేవాడు ఆ పరమపదాన్ని పొందజాలడు. సంసారంలోనే చిక్కుకొని ఉంటాడు. మనోనిగ్రహం కలిగి విజ్ఞానవంతుడై పవిత్రమైన జీవితం గడిపేవాడు ఆ పరమపదాన్ని పొందుతాడు. అతనికి పునర్జన్మ ఉండదు" అని కఠోపనిషత్తు జ్ఞానవైశిష్ట్యాన్ని స్పష్టీకరిస్తున్నది.

**"యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః సదాఽశుచిః,**

**న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి".**

**"యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః,**

**న తు తత్పదమాప్నోతి యస్మాద్భూయో న జాయతే".** (క. ఉ. 1.1.7, 8)

"ఈ విధంగా మనోనిగ్రహం ఉన్న విజ్ఞానవంతుడు వాక్కునూ, ఇతరేంద్రియాలనూ

మనస్సులో నిలీనం చేసుకోవాలి. మనస్సును బుద్ధిలో నిలీనం చేసుకోవాలి. బుద్ధిని మహత్తత్త్వంలో నిలీనం చేసి దానిని శాంతమైన ఆత్మలో నిలీనం చేసుకోవాలి". ఈ సాధన కూడ కఠోపనిషత్తులో చెప్పబడింది.

"యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేద్ జ్ఞాన ఆత్మని,

జ్ఞానమాత్మని మనసి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని" (క.ఉ. 3.13)

నిర్గుణాత్మజ్ఞానానికి ప్రథమసోపానంగా అనేకమైన సగుణోపాసనలు ఉపనిషత్తులలో చెప్పబడ్డాయి. ఓంకారోపాసన అనేకమైన ఉపనిషత్తులలో అతి విస్తృతంగా చెప్పబడింది. ఓంకారం పరమాత్మకు ప్రతీకం మాత్రమే కాదు; పదమాత్మవాచకం, తత్స్వరూపమూ కూడ.

"ఉపనిషత్తులలో చెప్పిన ధనస్సును గ్రహించి, ధ్యానంచేత వాడిగా చేయబడిన బాణం సంధించి, పరమాత్మమీద ఏకాగ్రంగా ఉన్న మనస్సుతో పరమాత్మ అనే లక్ష్యాన్ని గురి చూచి కొట్టాలి. ఓంకారమే ధనస్సు. ఆత్మ బాణం. బ్రహ్మ లక్ష్యం. ఆ లక్ష్యాన్ని ఏకాగ్రచిత్తంతో కొట్టిన ట్లయితే. బాణం లక్ష్యంలో కలిసి పోయినట్లు ఆత్మ (జీవాత్మ) ఆ బ్రహ్మతో కలిసిపోతుంది. అని అలంకారికభాషలో ముండకోపనిషత్తు వర్ణించింది:

"ధనుర్గృహీత్వౌపనిషదం మహాస్త్రం

శరం హ్యుపాసానిశితం సందధీత,

ఆయమ్య తద్భావగతేన చేతసా

లక్ష్యం తదేవాక్షరం సోమ్య విద్ధి"

"ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే.

అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్" (ము. ఉ. 2.2.3, 4)

శమం, దమం, ఉపరతి, తితిక్ష, సమాధానం, శ్రద్ధ అనేవి శమదమాది సాధనాలు. మొదటి ఐదు బృహదారణ్యకోపనిషత్తులో సూచించబడ్డాయి.

"ఏవంవిచ్ఛాన్తో దాన్త ఉపరతస్తితిక్షుః సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం

**పశ్యతి, సర్వమాత్మానం పశ్యతి"** (బృ.ఉ. 4.4.23)

ఆత్మ యొక్క యథార్థస్వరూపం తెలిసినవాడు శాంతుడై (అంతరింద్రియని గ్రహం కలవాడై), దాంతుడై (బాహ్యేంద్రియనిగ్రహం కలవాడై) ఉపరతుడై (కర్మలు విడచి, సంన్యసించి), తితుక్షువై (సుఖదుఃఖశీతోష్ణాదిద్వంద్వాలను సహిస్తూ), సమాహితుడై (స్థిరచిత్తం కలవాడై) ఆత్మను తన ఆత్మలోనే చూస్తాడు; సర్వమునూ ఆత్మగానే చూస్తాడు."

ఆరవదైన శ్రద్ధ - **"తస్మాచ్ఛాన్తో దాన్త ఉపరతస్తితిక్షుః శ్రద్ధావిత్తో భూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యేత్"** ఇత్యాదిశ్రుత్యంతరాలలో చెప్పబడింది.

ముముక్షుత్వం అనేది నాల్గవ సాధనం. తీవ్రమైన మోక్షేచ్ఛ ఉన్నవాడే బ్రహ్మజ్ఞానం కోసం ప్రయత్నిస్తాడు. సద్గురువును సేవించి సఫలప్రయత్ను డౌతాడు. **"తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛే త్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"** (ము. ఉ. 1.2.12) అని ముండకోపనిషత్తు గురూపసదానాన్ని బోధిస్తూన్నది. ఈ విధంగా ముముక్షువై, గురువును ఆశ్రయించి ఆయననుండి ఆత్మస్వరూపాన్ని గూర్చిన ఉపదేశం పొందిన సాధకుడు తాను విన్న విషయాన్ని గూర్చి మననం చెయ్యాలి. తగు యుక్తులచేత ఆ విషయం చక్కగా మనస్సుకు పట్టించుకొని ఆత్మస్వరూపాన్నే నిరంతరమూ ధ్యానం చేయడంచేత తత్సాక్షాత్కారం పొందుతాడు అని బృహదారణ్యకోపనిషత్తు చెపుతున్నది.

**"ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో, మన్తవ్యో, నిదిధ్యాసితవ్యో మైత్రేయ్యాత్మనో వా అరే దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేనేదం సర్వం విదితమ్"** (బృ.ఉ. 2.4.5)

బ్రహ్మయందు, గురువునందు పరిపూర్ణమైన శ్రద్ధాభక్తు లున్నవానికి ఉపదేశించిన విషయాలన్నీ వాటంతట అవే అర్థం అవుతాయట.

**"యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ,**
**తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః"** (శ్వే. ఉ. 6.23)

అందుచేత ఆత్మజ్ఞానం కావాలనే కోరిక గలవాడు అవసరమైన ఇతర

వాగ్వాదాలన్నీ విడిచిపెట్టి ఆత్మను గూర్చియే ధ్యానం చెయ్యాలి.

"తమేవైకం జానథ ఆత్మానమన్యా వాచో విముఞ్చథామృతస్యైష సేతుః"

(ము. ఉ. 2.2.5)

నువ్వు అన్వేషించే ఆత్మ దేశకాలాదిపరిచ్ఛిన్న మైతే, ఒక దేశంలో, ఒక కాలంలో, ఒక ఆకారంతో కూడినదైతే అది పూర్ణానందస్వరూపం కాజాలదు. పరిపూర్ణానందం ఇవ్వజాలదు. పరిచ్ఛిన్నవస్తువులలో ఆనందం లేదు; ఉన్నా అది పరిచ్ఛిన్నమే. ఆనందం అపరిచ్ఛిన్నవస్తువునందే, అద్వితీయాత్మతత్త్వంలోనే ఉంది అని ఛాందోగ్యోపనిషత్తు చెపుతున్నది.

"యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి భూమైవ సుఖం, భూమా త్వేవ విజిజ్ఞాసితవ్యః" (ఛా.ఉ. 7.23)

ఇక్కడ చెప్పిన భూమయే బ్రహ్మ బ్రహ్మయే భూమ. దీనిలో ఉన్న ఆనందం యొక్క అత్యల్పమైన అంశాన్ని గ్రహించి ఇతరభూతా లన్నీ ఆనందంతో జీవిస్తున్నాయి

"ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి" (బృ.ఉ. 4.4.32)

ఈ విధంగా అద్వితీయాత్మతత్త్వాన్ని బోధించి, తాదృశబ్రహ్మసాక్షాత్కారం కలవానికి ఈ ప్రపంచకమూ ఉండదు; దానితో ఏ విధమైన సంబంధమూ ఉండదు అని స్పష్టంగా చెపుతున్నాయి ఉపనిషత్తులు. ఈ జ్ఞానం కలిగిన తరవాత ఇతరజగత్తుతో పాటు ఉపనిషత్తులు కూడ పరిత్యాజ్యాలే నట. బియ్యం తీసికొన్న తరవాత ఊక ఎవరికి కావాలి?

గ్రన్థమభ్యస్య మేధావీ జ్ఞానవిజ్ఞానతత్త్వతః,
పలాలమివ ధాన్యార్థీ త్యజేద్గ్రన్థమశేషతః" (బ్రహ్మబిందూపనిషత్. 18)

ఇంత ధైర్యంతో ఇలా చెప్పగలిగిన సంప్రదాయం ఎక్కడైనా ఉంటుందా అని సందేహం.

ఈ విధంగా వేదాంతం మనకు అనాదికాలం నుంచీ పరిచితంగా వస్తూన్న ఈ ద్వైతప్రపంచాన్నే ఆధారంగా చేసుకొని క్రమక్రమంగా అద్వితీయాత్మతత్త్వసాక్షాత్కారం

పొందే ఉపాయాన్ని అనేక వాచోయుక్తులతో ప్రతిపాదిస్తున్నది. అలాంటి సాక్షాత్కారాన్ని కొందరు ఒక జన్మలో పొందవచ్చు, మరికొందరు పది జన్మలలో పొందవచ్చు, మరొకరు వేయి జన్మలలో పొందవచ్చు. ఎప్పటికి చేరగలిగినా అదే ఉత్తమగమ్య మనీ అంతకు ముందు లభించే వన్నీ అవస్థావిశేషాలు మాత్రమే అనీ వాటి భూమికలో వాటి ప్రాధాన్యం వాటికి ఉండనే ఉందనీ ఉపనిషత్తుల ఉపదేశం.

వేదాంతానికి సంబంధించిన ప్రధానమైన అంశాలను ఈ క్రింది విధంగా సంక్షిప్తరూపంలో చెప్పవచ్చును.

1. ఉన్న ఏకైకసత్యం బ్రహ్మమాత్రమే. అది నిర్గుణం; నిర్విశేషం, అది సద్రూపం (ఉనికి అనేది దానికే ఉంది). జ్ఞానరూపం. ఆనంద రూపం (సచ్చిదానందస్వరూపం).

2. అనిర్వాచ్యమైన మాయ అనే శక్తితో కూడిన, అనగా తన శక్తియే అయిన మాయ పనిచేసి నప్పుడు, ఆ బ్రహ్మయే సగుణబ్రహ్మ అని చెప్పబడుతుంది. ఆ స్వరూపానికి శివ-కేశవ-చతుర్ముఖాదినామధేయాలు ఎన్ని పెట్టినా పెట్టుకొనవచ్చును. మాయాసహితమైన బ్రహ్మయే జగత్సృష్ట్యాదులకు కారణం.

3. అద్వైతసిద్ధాంతం ప్రకారం జగత్తును మిథ్యా అని చెప్పినా ఈ మిథ్యాత్వం కేవలం పారిభాషికం. ఆత్మసాక్షాత్కారం కలిగే వరకు (ఇది కొన్ని వేల మంది సాధకులలో ఒకనికి కలుగుతుంది) ఈ జగత్తంతా ఇతరసంప్రదాయాల ప్రకారం ఎంత సత్యమో, అద్వైతసిద్ధాంతం ప్రకారం కూడ నూటికి నూరు పాళ్లు అంత సత్యమే. అందుచేత అంతా మిథ్యయే కదా అని ఏ అద్వైతీ స్వేచ్ఛగా, శాస్త్రవిరుద్ధంగా, ప్రవర్తించకూడదు. అయ్యో! ఈ జగత్తు ఏమైపోతుందో అని ఇతరులు బాధపడవలసిన పని లేదు. ఇది అందరినీ వెన్నంటియే ఉంటుంది.

4. క్రింది భూమికలో సాలోక్యం, సామీప్యం, సాయుజ్యం, సారూప్యం మొదలైన అన్ని రకాల ముక్తులూ కూడ అద్వైతికి అంగీకార్యములే. ఈ విషయాన్ని శ్రీశంకరభగవత్పాదులు ముండకోపనిషద్భాష్యంలో విశదీకరించారు-

"ప్రయాన్తి ప్రకర్షేణ యాన్తి. యత్ర యస్మిన్ సత్యలోకాదౌ అమృతః పురుషః ప్రథమజో హిరణ్యగర్భః.... ఏతదన్తాస్తు సంసారగతయః అపరవిద్యాగమ్యాః. నన్వేతం మోక్షమిచ్ఛన్తి కేచిత్? న. "ఇహైవ సర్వే ప్రవిలీయన్తే కామాః"; "తే సర్వగం సర్వతః ప్రాప్య ధీరాః యుక్తాత్మానః సర్వమేవావిశన్తి" ఇత్యాదిశ్రుతిభిః"

(ము.ఉ. భాష్యం. 1.11)

"వాళ్లు అమృతపురుషుడైన, మొట్టమొదటి జీవుడైన హిరణ్యగర్భుని లోకమైన సత్యలోకం వంటి లోకాలకు వెడతారు. అపరవిద్యచేత, అనగా సగుణ బ్రహ్మోపాసనచేత పొందదగిన స్థానాలలో అత్యుత్తమమైన స్థానం ఇదే. (ప్రశ్న) కాని ఇదే మోక్షం అని కొందరంటారు కదా? కాదు. మోక్షం అంటే ఎక్కడికో వెళ్లడం కాదు. "ఇహైవ..కామాః" ఆ కామా లన్నీ ఇక్కడనే నశించి పోతాయి". "తే సర్వగం .... ఆవిశన్తి" "సర్వవ్యాప్తమైన బ్రహ్మను సాక్షాత్కరించుకొన్న ధీరులు, ఆ బ్రహ్మలోనే ప్రవేశిస్తారు. అనగా ఆ బ్రహ్మగానే ఉంటారు" అని శ్రుతులు చెప్పుచున్నవి కదా?"

ఇంకొక విషయం ఏ మనగా - సాంఖ్య-యోగ-న్యాయ-వైశేషిక-మీమాంస కాది ప్రాచీనాస్తికదర్శనాలలో గాని, చివరికి నాస్తికదర్శనా లని చెప్పే బౌద్ధాది దర్శనాలలోగాని మోక్షం అంటే మరొక లోకం చేరి అక్కడ మళ్లీ భగవత్సేవాదికం ప్రారంభించడం అని అంగీకరించలేదు. జైనులు కూడ జీవుడు ఒంటరిగా నిరంతరం అలోకాకాశంలో హాయిగా పైకి ఎగురుతూండడమే మోక్షం అని అంటారు. ఈ దార్శని కుల మతాల ప్రకారం ప్రతీ సాధకుడు ఇక్కడనే మోక్షం పొందుతాడు. భక్తునికి ఆరాధ్యుడైన భగవంతుని స్థానం చేరుకోవడమే మోక్షం అని అంగీకరించిన వాళ్లు తరువాతి కాలంలో వచ్చిన దార్శనికులే. సాధకుడు ఇక్కడనే మోక్షం పొందుతాడు అని అంగీకరిస్తూనే అద్వైతులు "వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థాః" ఇత్యాదిశ్రుతివాక్యాల ప్రామాణ్యాన్ని అనుసరించి, కొందరు సగుణోపాసకులు మాత్రం సత్యలోకం చేరి అక్కడనే చాల కాలం ఉండి, మహాప్రళయాంతంలో ఆ సత్యలోకం కూడ నిలీనం అయిపోయినప్పుడు, ఆ సగుణబ్రహ్మతో కలిసి మోక్షం పొందుతారు అని నిర్ణయించారు.

శ్రీ శంకరభగవత్పాదులు ఉపనిషదాదులలో ఉద్ఘోషిత మైన మాయావాదాన్ని స్వీకరించి తాత్పర్యంతో జగజ్జీవేశ్వరుల స్వరూపాలను, వాటి పరస్పరసంబంధాన్ని చక్కగా నిరూపించారు. ఈ మాయావాదాన్ని అన్వయించుకుంటూ పోగా పోగా సగుణ బ్రహ్మ అని చెప్పే శివకేశవాదులకు కూడ పారమార్థికసత్త్వం లేదనీ, నిర్గుణమూ నిర్విశేషమూ అయిన నిర్గుణబ్రహ్మయే, ఉపనిషత్తుల ప్రకారం, ఏకైకపారమార్థిక సత్యమనీ తేల్చవలసివచ్చింది. మామూలుగా అందరూ అంగీకరించే తత్తద్దేవతాసన్నిధి ప్రాప్తి కూడ పూర్తి మోక్షం కాదనీ, సత్యలోకాదులు కూడ నశ్వరము లనీ తేలింది. దానితో తమ తమ ఆరాధ్యదేవతలకు కూడ అపారమార్థికత్వాన్ని ప్రతిపాదించే ఈ సిద్ధాంతంమీద, తత్ప్రవర్తకులమీద ద్వైతు లందరికీ పట్టరాని కోపం కలగడం సహజమే. పదిమంది కౌమారవయస్కులైన బాలులు మాటలాడుకుంటూండగా ఒకడు ఈ దేశంలో అందరికంటె గొప్పవాడు ఎవడు అని ప్రశ్నించాడట. మరొకడు అందరికంటె గొప్పవాడు రాజు అన్నాడట. మూడవవాడు లేచి, రాజుకాదు, అందరికంటె గొప్పవాడు మా నాన్న అన్నాడట. రెండవ వాడు అలా కాదనడంతో మూడవవాడు క్రోధావేశంతో అక్కడ నున్న దండంతో వానికి కపాలభంజనం చేశాడట. ఆ పరిస్థితులలో అది సహజంగా జరిగే పనియే. ద్వైతుల ఆక్షేపణలూ, నిందలూ కూడ ఇలాంటివే అని పిస్తుంది.

నిజం పరిశీలిస్తే ప్రపంచకంలో అందరూ ద్వైతులే. అద్వైతు లని చెప్పుకొనేవాళ్లు సైద్ధాంతికంగా మాత్రమే అద్వైతులు. వ్యవహారంలోనికి వచ్చేసరికి వీరందరూ శ్రీ శంకరభగవత్పాదులు చెప్పిన "పశ్వాదిభిశ్చావిశేషాత్" ఇత్యాదివాక్యాలకు ఉదాహరణభూతులే. ఆ తత్త్వాన్ని ఆకళించున్నవాడు వెయ్యి మంది సాధకులలో (సాధకులలో మాత్రమే) ఒక డుండవచ్చును. ఎవ్వరూ తమ విశ్వాసాలను విడవవలసిన పని లేదు; తమ సంప్రదాయాలను యథావిధిగా అనుసరిస్తూ ఉండవచ్చును. కాని ఒక్క సారి నిష్పక్షపాత మైన, పూర్వనిర్ణయదుషితం కాని మనస్సుతో పరిశీలిస్తే ఈ సిద్ధాంతం ఎంత గంభీరమైనదో, దీనికి ఈ రూపం ఇచ్చిన ఆ మహాపురుషుడు ఎంతటి

మహామేధానంపన్నుడో అర్థం అవుతుంది. ఆనందం కలుగుతుంది.

పాశ్చాత్యతత్త్వశాస్త్రం వలె భారతీయతత్త్వశాస్త్రం కేవలం సిద్ధాంతప్రధానం కాదు. విశ్రాన్త్యాసనవిచారణీయసిద్ధాంతం (Arms-Chair Philosophy) కాదు. ప్రతీ దర్శనాచార్యుడూ కూడ తాను బోధించిన సిద్ధాంతంలోని సత్యాన్ని కనుగొనడానికి తగిన సాధనామార్గాన్ని కూడ నిర్దేశించి ఉన్నాడు. ఇది ఆస్తికదర్శనాలలో ఎంత సత్యమో నాస్తికదర్శనాలలో కూడ అంత సత్యమే. అందుచేత ఏ దర్శనంలో ఆస్థ ఉన్న వారైనా, ఏ సంప్రదాయానికి చెందిన వారైన తమ మార్గాన్ని విడవకుండానే అద్వైతసిద్ధాంతజ్ఞానం సంపాదించుకొని తజ్జనితానందం కూడ పొందవచ్చును.

5. అయితే వేదాంతాధ్యనంవల్ల కొంతవరకు నూతనవిషయజ్ఞానజనిత మైన ఆనందం కలగవచ్చు నేమో; నిజమైన ప్రయోజనం ఏ కొద్దిమందికో మాత్రమే కలుగుతుంది. ప్రథమసూత్రానికి అర్థం చెపుతూ ప్రారంభంలోనే శ్రీ శంకరభగవత్పాదులు ప్రతిఒక్కడు ఈ వేదాంతం జోలికి రావద్దని, సాధన చతుష్టయసంపత్తి ఉన్న దనుకొన్నవాడే ఏతచ్ఛాస్త్రాధ్యయనం చెయ్యాలనీ హెచ్చరిస్తారు. అంతే కాదు ఈ జన్మలోనే ఆత్మ సాక్షాత్కారం కావాలంటే సంన్యాసాశ్రమం తీసికోవాలని భాష్యాంతరాలలో వివరించారు. ఈ మాట వినగానే మాకు మాత్రం అధికారం ఎందుకు లేదు అని మనకు అహంకారోపరక్తమైన ఆగ్రహం కలగవచ్చును. కాని అత్యల్పమైన ఈ ఆయుర్దాయకాలంలో చాల వరకు సమయం లౌకికకార్యాలలో వెచ్చించి వేదాంతాధ్యయనఫలితం లభించాలంటే అంత సులభంగా లభిస్తుందా? అందుచేతనే వారు ఆ నియమం విధించారు. సంన్యాసాశ్రమం గ్రహించకపోయినా నిరంతరాత్మానుసంధానం చేసికొంటాం అంటే వారికి కూడ అభ్యంతరం ఉండకపోవచ్చు. శీఘ్రఫలలాభం కోసమే సన్న్యాసాశ్రమస్వీకారం మంచి దని చెప్పారు. కొంచెం మాత్రమే సాధించినా ఉత్తరజన్మలలో దీని ఫలితం ఉంటుంది. "న హి కల్యాణకృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి" అని శ్రీ కృష్ణుడిచ్చిన అభయహస్తం మన కుండనే ఉంది.

కార్ల్. హెచ్. పాట్టర్ అనే విద్వాంసుడు "ఎన్‌సైక్లోపీడియా ఆఫ్ ఇండియన్

ఫిలాసఫీస్" అనే గ్రంథంలో అద్వైతసిద్ధాంతానికి సంబంధించిన ప్రధానాంశాలను చక్కగా విశ్లేషించి ఈ క్రింది విధంగా ప్రతిపాదించాడు.

"అద్వైతవేదాంతాన్ని మనం, తాత్కాలికంగా మన నిర్ణయాన్ని ఉపయోగించి, సైద్ధాంతికమైన ఆధారంమీద Theoritical basis, ఔపయోగికమైన స్థితి Practical Basis మీద, రెండు మార్గాలలో విభజించవచ్చును. సైద్ధాంతికాధారం మీద చేసే కల్పనలు ఇవి.

1. తత్త్వశాస్త్రం సంసారబంధాలనుండి విముక్తి లభించే మార్గం చూపించాలి.

2. బంధం కేవలం అవిద్యవల్ల ఏర్పడింది. వాస్తవలంలో ఆత్మకు బంధమూ లేదు, దేహాంతరలోకాంతరగమనాగమనాదులూ లేవు. ఇది ఎల్లప్పుడూ ముక్తమే.

3. బంధానికి ఆది అంటూ లేదు; అవిద్య తొలగించబడేవరకు ఇది అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే ఉంటుంది.

4. బంధం అజ్ఞానంవల్ల కలిగినది గాన, అజ్ఞానానికి విరుద్ధమైన విద్యను (జ్ఞానాన్ని) సంప్పాదించుకుంటే అజ్ఞానం తొలగిపోతుంది; అప్పుడు ముక్తి లభించి నట్లు కనబడుతుంది.

5. అజ్ఞానం వాస్తవంలో లేని, ఆపాతతః కనబడే, భేదబుద్ధిని కలిగించడం ద్వారా పనిచేస్తూంటుంది.

6. అందుచేత జ్ఞానం అనగా - అన్ని భేదాలు, విశేషించి, తెలుసుకొనేవాడు, తెలియబడేది, అనే భేదం, కాల్పనికమైనవే, దే, అని గ్రహించడమే.

7. దృక్ (చూచేది) దృశ్యం (చూడబడేది) అనే భేదంతో శూన్యమైన జ్ఞానమే మోక్షదాయకమైనది; అది సాక్షాత్తు చైతన్యరూప మైనది; అనుభవం.

8. ఆ పరిశుద్ధమైన చైతన్యమే ఆత్మ, అది లేకుండా దేనినీ తెలుసుకొనే అవకాశం లేదు.

9. సత్యమైన ఈ ఆత్మ, శుద్ధచైతన్యం, బ్రహ్మకంటె భిన్నం కాదు. బ్రహ్మ స్వజ్ఞానానికి విషయం అని అన్నట్లయితే అప్పుడు జ్ఞాత, జ్ఞేయం అనే భేదాన్ని

అంగీకరించిన ట్లవుతుంది. ఈ భేదం పైన చెప్పి నట్లు అజ్ఞానకల్పితం.

10. అజ్ఞానకల్పితాలైన వన్నీ ఇది సత్యం కాదు, ఇది సత్యం కాదు అని భాధితము లవుతూంటాయి. అలా బాధితం కానిదే నిజమైన సత్యం.

11. సత్యత్వాన్ని నిర్ణయించడంలో నిర్ధారక ప్రమాణాన్ని critarion ఉపయోగించి చూస్తే శుద్ధచైతన్యం మాత్రమే సత్యమైన దని తెలుస్తుంది. ఎందువల్ల ననగా ఇది అజ్ఞానకృతమైన భేదబుద్ధిచేత కలుషితం కాదు; ఎన్నడూ బాధించబడదు; ఇది లేదు అని నిరాకరించబడదు; బాధించడానికి కూడ చైతన్యం ఉండాలి కదా?

12. మనకు శుద్ధచైతన్యంయొక్క అనుభవం సుషుప్తిలో కలుగుతుంది. దానినుండి మేల్కొన్న తరవాత మనం ప్రసన్నులంగా ఉంటాం. దీనిని పట్టి శుద్ధచైతన్యం ఆనందస్వరూపం అని నిర్ణయించవచ్చును.

13. భేదా లన్నీ అజ్ఞానకల్పితాలే గాన మోక్షానికి మార్గం ఇదే అని నిశ్చితంగా ఏ మార్గం చూపినా, దానిలో భేదబుద్ధికి అనుప్రవేశం ఉన్నతవరకూ, చివరికి అది కూడ (ఆ మార్గం కూడ) అసత్యమే అవుతుంది.

14. అయితే కొన్ని మిథ్యాదృష్టులు false views మిగిలినవాటికంటె కొంతవరకు మంచివి కావచ్చును; అవి అంతగా అమార్గప్రదర్శకాలు కాకపోవచ్చును. చెడ్డ దృష్టులను విమర్శించి పరిహరించగా పరిహరించగా క్రమంగా మంచివాటిని చేరవచ్చును.

15. ఉదాహరణకి - కార్యం కారణం కంటె పూర్తిగా భిన్నమైనది అని చెప్పే అసత్కార్యవాదంకంటె కార్యానికీ కారణానికీ వాస్తవంలో భేదం లేదని చెప్పే సత్కార్యవాదం మంచిది. సత్కార్యవాదంలో కూడ కారణం కార్యంగా మార్పు చెందుతుంది అని చెప్పే పరిణామవాదం కంటె కారణమే కార్యరూపంలో కనబడుతుంది అని చెప్పే వివర్తవాదం మంచిది. అదే విధంగా కార్యకారణభావాన్ని గూర్చిన అన్ని అభిప్రాయాలకంటె కూడ (మాండూక్యకారికలలో చెప్పినట్లు) అసలు దేనికీ పుట్టుక అనేదే లేదని చెప్పే అజాతివాదం మంచిది; ఎందువల్ల ననగా కార్యకారణభావంలో

భేదం అనుగతమై ఉంటుంది.

16. ఏదైన ఒక జ్ఞానాన్ని గూర్చి ఇది ప్రమాణమా అప్రమాణమా అని తెలుసుకోవా లంటే మరొక నిర్ణాయకజ్ఞానం ఉండాలి అని చెప్పే పరతఃప్రామాణ్యంవాదం కంటె ఒక జ్ఞానం పుట్టిన దంటే అది ప్రమాణమే. ఇది ప్రమాణమా అప్రమాణమా అని నిర్ణయించడానికి మరి యొక జ్ఞానం అవసరం ఏదీ లేదని చెప్పే స్వతః ప్రామాణ్యవాదం మంచిది. అయితే సత్యం అనేది నిర్ణయాల (judgements) చేత తెలియబడదు; పారమార్థికసత్యాన్ని ఎవ్వడూ కూడ ప్రమాణాల ద్వారా తెలుసుకొనజాలడు అని చెప్పే సిద్ధాంతం దృష్ట్యా పై రెండు వాదాలు కూడ చెడ్డవే.

17. ఈశ్వరాస్తిత్వాన్ని అంగీకరించే ఆస్తికదృష్టికంటె నాస్తికత్వం భౌతికవాదం చెడ్డది. ఆస్తికత్వంలో కూడ ఏకేశ్వరవాదం కంటె అనేకేశ్వరవాదం తక్కువది. చివరికి అన్ని రకాలైన ఆస్తికత్వాలకంటె అద్వైతం మంచిది.

18. శబ్దప్రామాణ్యాన్ని అంగీకరించేవాళ్లందరి దృష్టికంటె చార్వాకుల దృష్టి చెడ్డది. శబ్దప్రమాణం అంగీకరించేవాళ్లలో కూడ వేదప్రామాణ్యాన్ని అంగీకరించకుండా, ఇతరమైన ఆగమాదుల ప్రామాణ్యాన్ని అంగీకరించేవాళ్ల (జైనబౌద్ధాదుల) దృష్టికంటె వేదప్రామాణ్యాన్ని అంగీకరించేవాళ్ల దృష్టి మంచిది. వేద ప్రామాణ్యాన్ని అంగీకరించేవాళ్లలో కూడ కర్మకాండవిధాయకవేదభాగానికే ప్రామాణ్యం, మిగిలినదానికి లేదు అనే వాళ్ల దృష్టికంటె రెండు భాగాలకూ సమానమైన ప్రామాణ్యం ఉంది అని అంగీకరించేవాళ్ల దృష్టి మంచిది. మోక్షానికి రెండు భాగాలూ కూడ సమప్రాధాన్యం కలవే అనే దృష్టికంటె పూర్వభాగం స్వర్గాదులను మాత్రమే ఇస్తుంది, ఉత్తరభాగమే మోక్షానికి ఉపయోగిస్తుంది అనే దృష్టి మంచిది. చివరికి ఈ భాగం కూడ ప్రత్యక్షంగా మోక్షమార్గం చూపజాలదు, "ఇది కాదు ఇది కాదు" అని అంటూనే పరతత్త్వాన్ని చూపుతుంది అనే దృష్టి అత్యుత్తమం".

ఈ విధంగా పైన కొన్ని అద్వైతసిద్ధాంతానికి సంబంధించిన ప్రధానాంశాలు, వాటికి ఉపోద్బలకాలైన, అద్వైత్యంగీకృతాలైన వాదాలు సూచించబడ్డాయి.

శ్రీ శంకరభగవత్పాదులు ప్రస్థానత్రయం, ఏకశ్లోకీ మొదలు సహస్రాధిక శ్లోకప్రమాణం గల అనేక ప్రకరణగ్రంథాలు రచించి అద్వైతసిద్ధాంతాన్ని అచంచలములైన మూలాధారస్తంభాలమీద నిలబెట్టిన ఆ సుముహూర్తం ఎట్టిదో కాని, నాటినుండి నేటివరకు అద్వైతతత్త్వప్రతిపాదకాలు, వివిధాక్షేపపరిహారరూపాలు అయిన ఎన్నో గ్రంథాలు వందల సంఖ్యలో, వేలసంఖ్యలో ఆవిర్భవిస్తూనే ఉన్నాయి. సంస్కృతభాషలోనే కాక అనేకమైన ఇతరభారతీయభాషలలోను, పాశ్చాత్యభాషాదులలోను కూడ ఆవిర్భవిస్తున్నాయి. వీటిలో కొన్ని వ్యాఖ్యోపవ్యాఖ్యారూపమైనవి. కొన్ని స్వతంత్రగ్రంథాలు. మరికొన్ని మళ్లీ ఆ స్వతంత్రగ్రంథాల వ్యాఖ్యోపవ్యాఖ్యారూపమైనవి. ఇంత విశాలమైన వాఙ్మయం ఏ ఇతరసంప్రదాయంలోను వెలవడలేదు. అందుచేత కూడ వేదాంతం అనగానే అద్వైతం అని మాత్రమే పండితులు మొదలు పామరుల వరకు, మొదట మనస్సులో స్ఫురిస్తుంది.

బ్రహ్మసూత్రశాంకరభాష్యంమీద బయలుదేరిన కొన్ని వ్యాఖ్యోపవ్యాఖ్యానాలను గూర్చి వెనుక చూచి ఉన్నాం. ఇక్కడ కొన్ని ప్రధానమైన ఇతరగ్రంథాల నామధేయమాత్రనిర్దేశం జిజ్ఞాసువులకు ఉపకారకంగా ఉత్సాహవర్ధకంగా ఉంటుం దనే అభిప్రాయంతో చేయబడుచున్నది. విద్యారణ్యులు (1350) వివరణప్రస్థానంలోని విశేషాలను స్పష్టీకరిస్తూ వివరణప్రమేయసంగ్రహం అనే గ్రంథం రచించారు. ఈయన రచించిన దృగ్దృశ్యవివేకం, జీవన్ముక్తివివేకం, పంచదశి, అనుభూతిప్రకాశ మొదలైన గ్రంథాలు గొప్ప మననగ్రంథాలు. సురేశ్వరాచార్యులు భగవత్పాదుల ప్రధానశిష్యచతుష్టయంలో ఒకరు. వీరు నైష్కర్మ్యసిద్ధి రచించారు. వీరి బృహదారణ్యకోపనిషద్భాష్యవార్తికం శ్లోకరూపంలో ఉన్న అతి విస్తృతమైన వ్యాఖ్య. దాదాపు 12000 శ్లోకా లున్నాయి. ఇట్లే ఈయన తైత్తిరీయోపనిషద్భాష్యవార్తికం కూడ రచించారు. జ్ఞానోత్తమమిశ్రుడు నైష్కర్మ్యసిద్ధికి వ్యాఖ్య రచించాడు. సర్వజ్ఞాత్మముని (900) శాంకరభాష్యసిద్ధాంతాలను క్రోడీకరిస్తూ శ్లోక రూపంలో సంక్షేపశారీరకం రచించారు. దీనికి రామతీర్థులు వ్యాఖ్యానం రచించారు. 1190 ప్రాంతానికి చెందిన

శ్రీహర్షుడు అద్వైతవేదాంతవాదగ్రంథాలలో అతిప్రసిద్ధమైన **ఖండనఖండఖాద్యం** రచించి నైయాయికాదులు ఆ యా పదార్థాలకు చెప్పిన లక్షణాలను ఖండించి అనిర్వచనీయతావాదాన్ని స్థాపించారు. తరవాత నాతిచిరకాలానికే చెందిన చిత్సుఖాచార్యులు ఖండనఖండఖాద్యానికి వ్యాఖ్య రచించారు. ఈయన **తత్త్వదీపిక** అనే ఒక స్వతంత్రవాదగ్రంథం కూడ రచించారు. దీనికి ప్రత్యగ్రూపాచార్యులు నయప్రసాదిని అనే వ్యాఖ్య రచించారు. శంకరమిశ్రులు, రఘునాథుడు కూడ ఖండనఖండఖాద్యానికి వ్యాఖ్యలు రచించారు. 1350 ప్రాంతానికి చెందిన ఆనందపూర్ణసరస్వతి **'ఖండనఫక్కికావిభజనీ'** అనే సువిస్తృతవాఖ్య రంచించారు. దీనికే విద్యాసాగరీ అని కూడ పేరు. గ్రంథకర్తకు విద్యాసాగర అనే బిరుదు ఉండడంచేత ఈ వ్యాఖ్యకు ఆ పేరు ప్రసిద్ధిలోనికి వచ్చినది. ఇది చక్కని హిందీ అనువాదంతో 1979లో వారాణసినుండి ప్రకటించబడింది. 1550 ప్రాంతానికి చెందిన ధర్మరాజాధ్వరీంద్రుడు అద్వైతులు అంగీకరించిన ప్రత్యక్షాదిప్రమాణాలను, అద్వైతసిద్ధాంతాన్నీ వివరించే **వేదాన్తపరిభాష** అనే గ్రంథం రచించాడు. దీనికి అయన కుమారుడు రామకృష్ణాధ్వరి **శిఖామణి** అనే మంచి ప్రామాణికమైన వ్యాఖ్య వ్రాశాడు. దీనికి అమరదాస అనే మహాపండితుడు **మణిప్రభ** అనే వ్యాఖ్య రచించాడు. అద్వైత వాదగ్రంథాలలో అతిప్రసిద్ధమైనది **అద్వైతసిద్ధి**. దీని రచయిత మధుసూదనసరస్వతి, 16-17 శతాబ్దాల ప్రాంతంవాడు. ఇది మాధ్వమతగ్రంథమైన న్యాయామృతాన్ని ఖండించడానికి రచించిన గ్రంథం. దీనికి గౌడబ్రహ్మానంది (లఘుచంద్రిక), విట్ఠలేశోపాధ్యాయి, సిద్ధివ్యాఖ్య అనే మూడు వ్యాఖ్యానా లున్నాయి. సదానందవ్యాసుడు **అద్వైతసిద్ధిసిద్ధాంతసారం** అనే గ్రంథంలో అద్వైసిద్ధిలో చెప్పిన విషయాలను సంగ్రహంగా వివరించాడు. సదానందవ్యాసుడు రచించిన ప్రకరణ గ్రంథం **వేదాన్తసారం**. దీనికి సుబోధిని, విద్వన్మనోరంజని అనే రెండు వ్యాఖ్యానా లున్నాయి. సదానందయతి అనే పండితుడు **అద్వైతబ్రహ్మసిద్ధి** రచించాడు. మధుసూదనసరస్వతి శ్రీ శంకరభగవత్పాదకృత దశశ్లోకికి **సిద్ధాన్తతత్త్వబిన్దుః** అనే అద్వైసిద్ధాంతప్రతిపాదక వ్యాఖ్య రచించాడు. గౌడబ్రహ్మానందులు

దీనికి కూడ వ్యాఖ్య రచించాడు. ఇలి కాక మధుసూదన సరస్వతి రచించిన **అద్వైతరత్నరక్షణం** అనే గ్రంథం,గీతాభాష్యవ్యాఖ్య మొదలైనవి సుప్రసిద్ధములు. **న్యాయమకరందం** అనే గ్రంథంలో ఆనందబోధభట్టాచార్యులు మాయావాదం మొదలైన అనేక అద్వైతసిద్ధాంతవిషయాలను చర్చించారు. ప్రకాశానందులు **వేదాన్తసిద్ధాన్తముక్తావలి** అనే గ్రంథంలో, అజ్ఞానం, దీనికీ చిత్‌కూ సంబంధం, దృష్టిసృష్టివాదం మొదలైన ఎన్నో సూక్ష్మవిషయాలను చర్చించారు. అద్వైతాచార్యులు తమ గ్రంథాలలో చూపిన వివిధఫక్కికలను క్రోడీకరించి అప్పయదీక్షితులు రచించిన సిద్ధాంతలేశసంగ్రహం చాల ప్రాధాన్యం గల గ్రంథం. **న్యాయరక్షామణి** అనే వీరి గ్రంథంలో బ్రహ్మసూత్రభాష్యంలోని ప్రథమాధ్యాయానికి సంబంధించిన విషయాలు చర్చించబడ్డాయి. **వేదాన్తతత్త్వదీపిక, సిద్ధాంతతత్త్వం** అనే గ్రంథాలు వేదాంతసిద్ధాంతజ్ఞానానికి చాల ఉపయుక్తమైనవి. **నృసింహాశ్రమముని** రచించిన **భేదధిక్కారం** గొప్ప వాద గ్రంథం.

పూర్వాశ్రమంలో మండనమిశ్రు డనే పేరు గల మీమానకుడు సురేశ్వరాచార్యులనే పేరుతో శ్రీ శంకరభగవత్పాదుల శిష్యుడయ్యా డని కొందరి నమ్మకం. అది కాదని కొంద రంటారు. మండనమిశ్రుడు రచించిన బ్రహ్మసిద్ధి చాలవరకు శ్రీ శంకరభగవత్పాదోక్తరీతిలో అద్వైతాన్ని ప్రతిపాదించే ప్రామాణిక గ్రంథం. దీని ప్రభావం వాచస్పతిమిశ్రులపై అధికంగా కనబడుతుంది. ఈయన దీనికి వ్యాఖ్య **తత్త్వసమీక్ష** రచించాడు. దీనికి శంఖపాణి అనే పండితుడు కూడా వ్యాఖ్య రచించాడు. అద్వైతవేదాంతంలో **ఆనందబోధయతి** స్థానం చాలగొప్పది. ఈయన **న్యాయమకరందం, న్యాయదీపావలి, ప్రమాణమాల** అనే గ్రంథత్రయం రచించాడు. వాటిమీద కూడ వ్యాఖ్యోపవ్యాఖ్యానాలు బయలుదేరాయి. 1200 ఎ డి. ప్రాంతానికి చెందిన విముక్తాత్మ **ఇష్టసిద్ధి, ప్రమాణవృత్తినిర్ణయం** అనే గ్రంథాలు రచించాడు. మొదటి గ్రంథానికి చిత్సుఖాచార్యుల గురువైన జ్ఞానోత్తమాచార్యులు **ఇష్టసిద్ధివ్యాఖ్యా** అనే పేరుతో ఒక వ్యాఖ్య వ్రాశారు. దీనికే **ఇష్టసిద్ధివివరణం** అని కూడ పేరు. ఇది గొప్ప వాదగ్రంథం. 1300 ప్రాంతానికి చెందిన రామాద్వయయతి **వేదాంతకౌముది** అనే గ్రంథం రచించారు. దీనికి తానే వ్యాఖ్య రచించారు. నృసింహాశ్రమని (1500) **అద్వైతదీపిక,**

అద్వైతపంచరత్నం, అద్వైతబోధదీపిక, అద్వైతవాదం, భేదధిక్కారం, వాచారమ్భణమ్, వేదాన్తతత్త్వవివేకం, మొదలైన అనేకస్వతంత్రగ్రంథాలు రచించడమే కాక పంచపాదికా వివరణ- సంక్షేపశారీరకాదులమీద వ్యాఖ్యలు కూడ రచించారు. శ్రీ మ.మ. యస్. అంతకృష్ణ శాస్త్రి అనేక ప్రాచీనవేదాంతగ్రంథాలను సంపాదించడమే కాక వేదాంతదేశికులు రచించిన శతదూషణి ఖండిస్తూ శతభూషణి అనే గ్రంథం, ఇంకా కొన్ని గ్రంథాలు రచించారు. ఈ శతాబ్దిలో కూడ ఇలా పండితులు ఎందరో భారతదేశంలో అవిర్భవించారు. ఈ విధంగా అద్వైతసిద్ధాంతానికి సంబంధించిన ఎన్నో వాదగ్రంథాలు, ప్రకరణగ్రంథాలు నిరంతరమూ అసఖ్యాకంగా వెలువడుతూనే ఉన్నాయి. ఆంధ్రదేశంలో అవిర్భవించిన శ్రీ బెల్లంకొండ రామారావు గారు గొప్ప వేదాంతపండితులు. ఇరవై శతాబ్దానికి చెందిన ఆంధ్రదేశీయవేదాంతపండితులలో అగ్రగణ్యులు. అద్వైతసిద్ధాంతాన్ని సమర్థిస్తూ, ఇతరసిద్ధాంతాలను, ఇంచుమించుగా వా రేవిధ మైన భాష ఉపయోగించి అద్వైతదూషణానికి, మూలపురుషుల దగ్గరనుండీ ఒక సంప్రదాయబద్ధమైన రీతిలో పూన్కొంటున్నారో అదే భాషలో ఖండిస్తూ శతాధికగ్రంథాలు రచించారు. వీటిలో కొన్ని వ్యాఖ్యానరూపమైనవి. కొన్ని స్వతంత్ర వాద గ్రంథాలు. కొన్ని ప్రకరణగ్రంథాలు. ఈ విధంగా శ్రీ శంకరభగవత్పాదముఖకమల నిర్గతమైన అద్వైతామృతలహరి నాటినుండి నేటి వరకు ఎంతో మందిని జన్మజరామరణాదిరూపసంసారదూరులనుగా చేసి అమర్త్యులను చేస్తూన్నది.

బ్రహ్మసూత్రాలకు శ్రీ శంకరభగవత్పాదులు రచించిన భాష్యాన్ని అనుసరించి కేవల సూత్రార్థప్రతిపాదనైకదృష్టితో కొన్ని వృత్తులు రచింపబడ్డాయి. వాదప్రతివాదా లన్నీ విడచి కేవలం అధికరణాదిస్వరూపప్రతిపాదనం వీటి లక్ష్యం. ఇలాంటి వృత్తులలో రామకింకరుడు రచించిన "బ్రహ్మామృతవర్షిణి", శంకరానందులు రచించిన దీపిక, అన్నంభట్టు రచించిన మితాక్షర (ఈయన ఇదే పేరుతో అష్టాధ్యాయికి కూడ వృత్తి రచించాడు) మొదలైనవి ప్రధానమైనవి. ఇలాంటి వృత్తులు, శ్లోకరూపంలో ఉన్న శారీరకభాష్యన్యాయబోధక గ్రంథాలు దాదాపు ఇరవైయైదు దాకా లభిస్తున్నాయి. ఇవన్నీ శంకరభాష్యానుసారిగ్రంథాలే. శ్రీ కంచికామకోటిపీఠాధిపతులు శ్రీ జయేంద్రసరస్వతీ

స్వాముల వారు "గురుప్రియా బ్రహ్మసూత్రవివృతిః" అనే పేరుతో ఒక వృత్తి సుబోధమైన చక్కని భాషలో రచించారు.

శంకరభాష్యానంతరం వెలువడిన ఇతర భాష్యాలు: శ్రీ శంకరభగవత్పాదులకు పూర్వం ఉన్నవారు బ్రహ్మసూత్రాలకు వ్రాసిన వృత్తులు కాని, తదితరవ్యాఖ్యానాలు కాని, ఉపనిషత్తులపై వ్రాసిన వృత్తులు కాని, వ్యాఖ్యానాలు కాని, భగవద్గీతకు వ్రాసిన వృత్తివ్యాఖ్యానాదులు కాని ఇప్పుడు లభించడం లేదనీ, శ్రీ భగవత్పాదులభాష్యాలు ఆవిర్భవించిన నాతిచిరకాలానికే ఆ ప్రాచీనగ్రంథాలన్నీ కథామాత్రశేషా లయ్యాయనీ వెనక చూచి ఉన్నాం.

శ్రీ భగవత్పాదల తరవాత ఆ యా కాలాలలో బ్రహ్మసూత్రాలకు కొన్ని భాష్యాలు వెలువడ్డాయి. ఇవన్నీ ద్వైతవాదప్రధానమైన భాష్యాలే. శంకరమతానికి విరుద్ధంగా ఉన్న తమ వాదాలను గూర్చి వ్రాసేటప్పుడు తప్ప ఇతరస్థలాలలో ఈ భాష్యా లన్నీ, చాలవరకు శంకరభాష్యాన్నే అనుసరించి వ్రాయబడ్డాయి. శ్రీ చిద్ఘనానన్దపురీ అనే యతీంద్రుడు రచించి కాశీనుంచి 1943 లో ప్రకటించిన శ్రీమద్ భగవద్బాదరాయణవ్యాససంమతబ్రహ్మసూత్రభాష్యనిర్ణయః అనే గ్రంథంలో ఆయన పది భాష్యాలను గూర్చి ముచ్చటించి అధికరణరచన, సూత్రపాఠం, సూత్రసంఖ్య మొదలైన విషయాలలో ఆ యా భాష్యకారులలో ఉన్న మతభేదాలను చర్చించి శాంకరభాష్యమే సూత్రానుగుణంగా ఉంది అని తేల్చారు. అయితే ఇతరసంప్రదాయాలవారు కూడ ఈ విధంగా పరిశీలించి గ్రంథాలు వ్రాస్తే బాగుంటుం దని ఆయన ఒక చోట అన్నారు. ఆయన పేర్కొన్న భాష్యాల పేర్లు, వాటి కాలాలు ఈ విధంగా ఉన్నాయి.

| | | | |
|---|---|---|---|
| 1. శాంకరభాష్యం. క్రీ.శ. | 703 | 2. భాస్కరభాష్యం | 709 |
| 3. రామానుజభాష్యం | 1089 | 4. నింబార్కభాష్యం | 1129 |
| 5. మాధ్వభాష్యం | 1249 | 6. శ్రీ కంఠభాష్యం | 1271 |
| 7. శ్రీకరభాష్యం | 1401 | 8. వల్లభభాష్యం | 1501 |
| 9. విజ్ఞానభిక్షుభాష్యం | 1601 | 10. బలదేవభాష్యం | 1716 |

శ్రీ చిద్ఘనానందపురి ఈ పది భాష్యాలను పరిశీలించారు. ఇది కాక మరి కొన్ని భాష్యాలు కూడ ఉండవచ్చును. లక్ష్మీవిశిష్టాద్వైతభాష్యం అనే పేరుతో కొంతకాలం క్రితం తెలుగులిపిలో ముద్రించిన భాష్యం ఒకటి ఉన్నది.

భాస్కరాచార్యుడు శ్రీ శంకరభగవత్పాదులకు సమానకాలీనుడై ఉంటాడు. అయితే శ్రీ శంకరభగవత్పాదుల గ్రంథాలు ఇతడు చదివి ఉంటాడు కాని ఇతని గ్రంథాలు శ్రీ భగవత్పాదులు చూచి ఉండరు. ఇతడు భేదాభేదవాది. జీవునికి బ్రహ్మకూ భేదమూ ఉంది అభేదమూ ఉంది అనే మతాన్ని అంగీకరించినవాడు. బ్రహ్మకు పరిణామాన్ని అంగీకరిస్తాడు. శ్రీ శంకరభగవత్పాదులకు పూర్వం ఉన్న ఆచార్యులలో భర్తృప్రపంచుడు మొదలైవాళ్లు కూడ భేదాభేదవాదులే. ఆ మతాన్ని శ్రీ శంకరభగవత్పాదులు అనేకస్థలాలలో ఖండించారు. అయినా ఆ మతాన్నే అవలబించి ఈతడు బయలుదేరాడు. రామానుజాదులు కూడ కొంతవరకు భేదాభేద మతానుయాయులే. దీనిని పట్టి ఒక్క విషయం అర్థం అవుతూన్నది. ఈ ఆచార్యులలోను ఆ యా శాస్త్రకారులలోనూ కూడ ఎవరి వాదం వాళ్లదే కాని ఎదుటివాడు చెప్పినది సరిగా వినడం, అర్థం చేసుకొనడానికి ప్రయత్నించడం అనేది ఉండేది కాదని తోస్తుంది. తా మేవో సిద్ధాంతాలు, స్వకల్పితాలో, పూర్వాచార్యాగతాలో, ముందుగానే నిర్ణయించుకుని పరిహాసపూర్వకంగా, అధిక్షేపబహులంగా, ఎదుటివాళ్లని, వాళ్ల సిద్ధాంతాలనూ చులకన చేయడమే వీళ్ల ధ్యేయం.

శ్రీ శంకరచార్యులు బౌద్ధమతానికి సంబంధించిన విజ్ఞానవాద మధ్యమవాదాల ప్రభావంలో పడి తన మతాన్ని స్థాపించారని అన్న వాళ్లలో బహుశా ఈ భాస్కరాచార్యులు మొదటివాడై ఉంటాడు. అందుకు కులుకుతూ ఇతరాచార్యులు కూడ ఈయనకు ప్రచ్ఛన్నబౌద్ధు డనే బిరుదాన్ని ఇచ్చారు. శ్రీ శంకరభగవత్పాదులను ప్రచ్ఛన్నబౌద్ధుడనాలా, బౌద్ధులను ప్రచ్ఛన్నౌ పనిషదులనాలా అనే వివేకం లేకపోవడంచేత మాటలాడే మాట లివి. శ్రీ శంకరభగవత్పాదులు అనేకమతాలను విమర్శిస్తున్న సందర్భాలలో ఎవరి విషయంలోనూ ఉపయోగించని పరుషవాక్యాలు బౌద్ధుల

విషయంలో ఉపయోగించారు. "ఔను,నువ్వు అలాగే అంటావు; నీ నోటికి అడ్డేమీ లేదు కదా?" అని ఒక చోట ఒక బౌద్ధవాదిని ఆక్షేపిస్తారు. "ఈ వైనాశికసమయం పరిశీలించినకొలదీ ఇసుకనేలలో నుయ్యి త్రవ్వుతున్నపుడు, ఒక మూలత్రవ్వుతూంటే మరొక మూలనుండి కూలిపోతున్నట్లు కూలిపోతున్నది" అంటారు. అట్లే మరొక చోట బౌద్ధ మతప్రవర్తకుడైన బుద్ధుణ్ణే ఉద్దేశించి "ఏమిటి ఈ విధంగా ఒకదానికీ ఒకదానికీ సంబంధం లేని వేరు వేరు సిద్ధాంతాలను ప్రతిపాదించడం? ఇది అసంబద్ధ ప్రలాపిత్వాన్నే సూచిస్తున్నది. ప్రజలు ఏమైతే అవుతారులే అని వాళ్లమీద ద్వేషమా" అని తీవ్రంగా ఆక్షేపిస్తారు. అలాంటి ఆచార్యులు ఆ మతంనుండి విషయాలు గ్రహిస్తారు అనేది ఎంతవరకు సమంజసమో ఊహించుకొనవచ్చును. "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" ఇత్యాద్యుపనిషద్వాక్యాలు ఆత్మ విజ్ఞానాత్మక మైనది; అదే పరమసత్యం అని ఉద్ఘోషిస్తూంటే తరవాత ఎప్పుడో వచ్చిన బౌద్ధుల విజ్ఞానవాదాన్ని శ్రీ శంకరభగవత్పాదులు తాము వ్యాఖ్యానిస్తున్న ఉపనిషత్తుల నుండి కాక బౌద్ధులనుండి గ్రహించా రనేదీ, ఇంకా ఇలాంటి మిథ్యారోపణా లన్నీ ఎంతవరకు సమంజసమో జాగర్తగా ఆలోచించుకుంటే తెలుస్తుంది. అందుచేతనే ఈ ప్రచ్ఛన్నబౌద్ధత్వవాదాన్ని ప్రస్తావించి కార్ల్‌హెచ్. పాట్టర్, ఇంతకంటె అర్థరహితమైన వాదం మరొకటి ఉండదన్నాడు.

"The greatest notoriety has surrounded alleged Buddhist influence on Sankara's Advaita. On the face of it the charge is absurd. Sankara not only shows no self conscious leanings towards Buddhism, he saves some of his choicest disrespectful language for the Buddhists". (Encyclopedia of Indian philosophies, Vol. III P. 20)

ఇతడే మరొక చోట ఇలా అంటాడు

There is little reason to doubt that Sankara viewed Buddhism as one of the worst of heresies and criticised it as roundly as any opposing Philosophy of which he was aware. The issue, more than any of the others discussed in the

scholarly literature, has raised as much heat as light" (Ibid. P. 13)

భాస్కరాచార్యుడు పునఃప్రారంభించిన ఈ భేదాభేదవాదాన్ని పంచపాదికాకారుడు ఒక చోట ఖండించాడు. దీనిని పట్టియే ఇతడు శ్రీ శంకరభగవత్పాదుల సమకాలికు డని ఊహ. వాచస్పతిమిశ్రుడు కూడ ఈ వాదాన్ని భామతిలో ఖండించాడు. వివరణకారులైన ప్రకాశాత్మయతి భాస్కరుడు శ్రీ శంకరభగవత్పాదుల విషయంలో చేసిన బౌద్ధమతానుసారిత్వాక్షేపణకు చాల తీవ్రంగా ప్రతిస్పందించి ఇలా వ్రాశారు.:

"యత్కిఞ్చిత్సామ్యేన చ సిద్ధాన్తసాంకర్యే మన్త్రార్థవాదేతిహాసపురాణ ప్రామాణ్యానభ్యుపగమాత్, క్షణికప్రమాణసంబన్ధస్య క్షణికస్యైవ సత్త్వాభ్యుపగమాత్ లోకాయతబౌద్ధాంశద్వయపరిణతః ప్రాభాకరః. భేదాభేదాభ్యుపగమాత్ మన్త్రాద్యప్రామాణ్యాచ్చ లోకాయతక్షపణకాంశద్వయపరిణతో వార్తికకారః. యస్తు కశ్చిత్-క్షపణకపాదావనతశిరోబిమ్బః, తత్త్వదర్శన - తన్నిష్ఠపరమహంసప్రద్వేష తీవ్రవాయువిక్షిప్తవివేకవిజ్ఞానలవః, స్వపరపక్షగుణదోషవిభాగదూరీకృతవిజ్ఞానః, భేదాభేదాభ్యాం బన్ధమోక్షాదిసంకరమివ కుర్వన్ దుర్జనరమణీమాం వాచం జల్పతి సుగతవిజ్ఞానవాదసమానోఽయం వేదాన్తవాద ఇతి, స సంప్రదాయశ్రవణపరిచయ శూన్యతయా దర్శనవివేకమనవబుధ్యమానః నాపవాద్యః; కి తు శోచనీయ ఇత్యుపేక్షణీయో విద్వద్భిః.

నను విజ్ఞానే ప్రపఞ్చస్య కల్పితత్వం తవ తస్య చ తుల్యమ్? సత్యమ్. విజ్ఞానే ప్రతిభాస్యమానత్వం చ తవ తస్య చ తుల్యమ్ ఇతి విజ్ఞానవాదస్త్వదీయం దర్శనం కిం న స్యాత్? సత్యపి ప్రతిభాస్యత్వే సత్యమిథ్యావిభాగోఽస్తీతి చేత్ ఇహాపి సత్యపి మిథ్యాత్వేఽర్థక్రియాసమర్థసత్త్వాసత్త్వవిభాగోఽస్త్యేవ. కల్పితత్వే నేయం విభాగసిద్ధిరితి చేత్, ప్రతిభాస్యత్వేఽపి న సత్యమిథ్యావిభాగసిద్ధిః. దృశ్యతేఽయం విభాగ ఇతి చేత్; తదేవ విభాగదర్శనం మమ కిం న స్యాత్? ఘటాదేర్మిథ్యాత్వమప్రసిద్ధమితి చేత్, న. ప్రతిభాస్యసత్యత్వస్యాప్యప్రసిద్ధత్వాత్. శుక్తిరజత ఘటయోరర్థక్రియా భావాభావసత్త్వాసత్త్వ విభాగదర్శనాచ్చ. దృశ్యతే మాయా

ప్రీతిద్వేషాదికారణమ్. శ్రూయతే చ దేవాసురనం గ్రామాదిషు మాయావి నిర్మితశస్త్రభేదానాం దాహచ్ఛేదభేదాదిహేతుత్వమిత్యలమతి ప్రసఙ్గేన. (నవవ్యాఖ్యాసహితశాంకరభాష్యమ్. పేజి. 400, 401)

"ఏదో కొంచెం సామ్యం ఉన్నంతమాత్రంచేత సిద్ధాంతాలకు సాంకర్యం కలుగుతుం దని అంటే మంత్ర-అర్థవాద-పురాణ-ఇతిహాసాలకు ప్రామాణ్యం అంగీకరించకపోవడంచేత, దేవతలను, స్వర్గాన్ని, ఈశ్వరుణ్ణి, మోక్షాన్ని అంగీకరించకపోవడంచేత, క్షణికప్రమాణసంబంధం క్షణికంగా మాత్రమే ఉంటుంది అని అంగీకరించడంచేత ప్రభాకరుడు, లోకాయతికకులు బౌద్ధులు అనే రెండు అంశాలుగా మారిపోయాడని చెప్పాలి. భేధాభేదాలను అంగీకరించడంవల్ల, మంత్రాదులకు అప్రామాణ్యాన్ని అంగీకరించడంవల్ల వార్తికకారుడు (కుమారిలభట్టు) లోకాయతులు జైనులు అనే రెండు అంశాలుగా మారిపోయా డని చెప్పాలి. (భేదాభేదవాదాన్ని అంగీకరించడం ద్వారా) జైనుల పాదాలమీద శిరస్సును ఉంచినవాడు, తత్త్వదర్శనం విషయంలోను, ఆ తత్త్వదర్శనంమీద నిష్ఠ గల పరమహంసల విషయంలోను, ప్రద్వేష మనే తీవ్రమైన వాయువుచేత ఎగురగొట్టివేయబడిన, ఉన్నదే కొంచె మైన, వివేక జ్ఞానం కలవాడు, స్వపక్షంలోను పరపక్షంలోను ఉన్న గుణదోషాలను వేరు వేరుగా చూడజాలనివాడు, భేదాభేదాలచేత బంధమోక్షాల సాంకర్యాన్ని చేయడానికి ఉద్యుక్తుడైనట్లు కనబడుతూన్నవాడు అయిన ఏ ఒకానొకడు (భాస్కరుడు) వేదాంతవాదం బౌద్ధుల విజ్ఞానవాదంతో సమానము అని దుర్జనులు మాత్రమే మెచ్చుకొనే ఏ మాటలు పలుకుతున్నాడో, సంప్రదాయాన్ని వినడం గాని, దానితో పరిచయం కాని లేకపోవడంచేత దర్శనాల మధ్య ఉన్న భేదాన్ని గుర్తించజాలకుండా ఉన్న అతడు, పాపం! నిందింపదగిన వాడు కాదు; వానిని గూర్చి జాలిపడాలి. అందుచేత వానిని విద్వాంసులు ఉపేక్షించాలి. (ప్రశ్న) ప్రపంచం విజ్ఞానంలో కల్పితమైనది అనే విషయం నీకు వానికి (బౌద్ధునికి) కూడ తుల్యమే కదా? (ఎదురు ప్రశ్న) నిజమే. విజ్ఞానంలో ప్రతిభాసించడం అనేది నీకు (భేదాభేదవాదికి) వానికీ (బౌద్ధునికీ) కూడ సమానమే గాన నీ దర్శనం విజ్ఞానవాదమే ఎందుకు కాదు?

(ఆశంక) ప్రతిభాస్యత్వం ఉన్నా కూడ సత్యము, మిథ్య అనే విభాగం ఉంది కదా అన్నట్లయితే (సమాధానం) మిథ్యా అయినా కూడ అర్థక్రియాసత్త్వం, అసత్త్వం అనే విభాగం ఉండనే ఉంది. కల్పితమైతే ఈ విభాగం సిద్ధించదు అని అంటే ప్రతిభాస్యం అయినా కూడ సత్యమిథ్యావిభాగసిద్ధి కుదరదు. ఈ విభాగం కనబడుతున్నది కదా అని అంటే - ఆ విభాగదర్శనం నా విషయంలో మాత్రం ఎందుకు ఉండదు? ఘటాదుల మిథ్యాత్వం అప్రసిద్ధం అన్నట్లయితే ప్రతిభాస్యంయొక్క సత్యత్వం కూడ అసిద్ధమే. శుక్తిరజత - ఘటాల మధ్య అర్థక్రియలు ఉండడం లేకపోవడం అనే సత్త్వాసత్త్వాల రూపమైన భేదం కనబడుచున్నది. మాయ కూడ ప్రీతిద్వేషాదులకు కారణం అవడం కనబడుచున్నది. దేవాసురసంగ్రామాదులలో మాయానిర్మితాలైన శస్త్రవిశేషాలు దహనం, ఛేదనం, భేదనం మొదలైన పనులకు హేతువులుగా ఉండడం వింటున్నాం కదా? ఇంక అతి ప్రసంగం చాలును".

పైన ఉదహరించిన వాక్యాలలో కొన్ని తత్తత్సిద్ధాంతాలకు సంబంధించిన అంశాలు బాగా వివరిస్తే కాని అర్థం కావు. అయితే అది గ్రంథవిస్తరకారి అవుతుంది; ప్రస్తుతానికి ఉపయుక్తం కూడ కాదు. ఈషత్సామ్యమాత్రంచేత సిద్ధాంతసాంకర్యాక్షేపం అజ్ఞానవిలసితమే అని చెప్పడానికి మాత్రమే ఆ విద్యద్వరేణ్యుని వాక్యాలను ఉదాహరించడం జరిగింది.

ఈ మధ్య కొందరు మేధావులు భారతదేశంలోని భక్తి సంప్రదాయానికి మూలం క్రైస్తవ-మహమ్మదీయమతాలనీ, అందులోనూ వైష్ణవమతంలోని ప్రపత్తి ఇస్లాం మీద ఆధారపడినదనీ, అద్వైతవేదాంతానికి మూలం సూఫీసిద్ధాంతం అనీ ప్రచారం ప్రారంభించారు. మన సెక్యులర్ నాయకులు తమ ఉపన్యాసాలలో, ఇతర మతస్థులను సంతోషపెట్టడం కొరకు, ఈవాదాలను ధ్రువీకరిస్తున్నారు. శ్రీ శంకరభగవత్పాదుల విషయంలో చేసే ప్రచ్ఛన్నబౌద్ధత్వప్రచారం ఇలాంటిదే.

శ్రీ శంకరభగవత్పాదుల భాష్యం కొన్ని చోట్ల సూత్రాక్షరానుగుణంగా లేదని కొందరు ఆక్షేపిస్తుంటారు. ఆ ఆక్షేపం అచింతితరమణీయం. సూత్రకారు డెక్కడైనా ఒక విధంగా చెప్పవలసిన విషయాన్ని మరొక విధంగా చెప్పినప్పుడు దానిని

## ఆ యా అధ్యాయాలలోను పా దోను ఉన్న సూత్రాల సంఖ్య

| అధ్యాయం | 1. పాదం | 2. పాదం | 3 ం | 4. పాదం | అధ్యాయంలో మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. | 31 | 32 | | 28 | 134 |
| 2. | 37 | 45 | | 22 | 157 |
| 3. | 27 | 41 | | 52 | 186 |
| 4. | 19 | 21 | | 22 | 78 |
| | | | | | 555 |

## ఆ యా అధ్యాయా: ఽధికరణాల సంఖ్య

| అధ్యాయం | 1.పాదం | 2.పాదం | 3 ౨ | 4.పాదం | అధ్యాయంలో మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. | 11 | 7 | | 8 | 39 |
| 2. | 13 | 8 | | 8 | 47 |
| 3. | 6 | 8 | | 17 | 67 |
| 4. | 14 | 11 | | 7 | 38 |
| | | | | | 191 |

నాలుగు అధ్యాయాలలోను అధికరణప్రధా: ణాలు - 191

నాలుగు అధ్యాయాలలోను ఇతర సూత్రాల - 364

## బ్రహ్మసూత్రాలలో పేర్కొన్న ఋషులు - ఆ పేర్లున్న సూత్రాలు

1. ఆత్రేయుడు (1) 1. స్వామినఃఫలశ్రుతేరిత్యాత్రేయః. 3.4 44

2. ఆశ్మరథ్యుడు (1) 1. ప్రతిజ్ఞాసిద్ధేర్లిఙ్గమిత్యాశ్మరథ్యః. 1.4.20

3 ఔడులోమి (3) 1. ఆర్త్విజ్యమౌడులోమిస్తస్మైహిపరిక్రీయతే. 3.4.45

2. ఉత్క్రమిష్యత ఏవంభావాదిత్యౌడులోమిః. 1.4.21

3. చితి తన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః. 4.4 6

4. కార్ష్ణాజిని (1) 1. చరణాదితి చేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినిః. 3.1.9

5. కాశకృత్స్నుడు (1) 1. అవస్థితేరితికాశకృత్స్నః. 1.4.22

6. జైమిని (10) 1. అన్యార్థం తుజైమినిఃప్రశ్నవ్యాఖ్యానాభ్యామపిచైవమేకే. 1.4.18

2. తద్భూతస్యతునాతద్భావో జైమినేరపి నియమాతద్రూపాభావేభ్యః. 3.4.40

3. ధర్మంజైమినిరత ఏవ. 3.2.40

4. పరంజైమినిర్ముఖ్యత్వాత్. 4.3.12

5. పరామర్శం జైమినిరచోదనాచాపవదతిహి. 3.4.18

6. బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః. 4.4.5

7. మధ్వాదిష్వసంభవాదనధికారంజైమినిః. 1.3.31

8 శేషత్వాత్పురుషార్థవాదోయథాన్యేష్వితి జైమినిః. 3 4.2

9. సంపత్తేరితి జైమినిస్తథాహిదర్శయతి. 1.2.31

10. సాక్షాదప్యవిరోధం జైమినిః. 1.2.28

7. బాదరాయణుడు(9) 1. అధికోపదేశాత్తుబాదరాయణస్యైవంతద్దర్శనాత్. 3.4.8

2. అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః. 3.4.19

3. ఏవముపన్యాసాత్పూర్వభావాదవిరోధంబాదరాయణః. 4.4.7

4. తదుపర్యపిబాదరాయణఃసంభవాత్. 1.3.26

5. ద్వాదశాహవదుభయంబాదరాయణోఽతః. 4.4 12

6. పురుషార్థోఽతఃశబ్దాదితిబాదరాయణః. 3.4.1

7. పూర్వంతుబాదరాయణోహేతువ్యపదేశాత్. 3.2.41

8. అప్రతీకాలమ్బనాన్నయతీతి బాదరాయణ ఉభయథాదోషాత్తత్క్రతుశ్చ 4.3.15

9. భావంతుబాదరాయణోఽస్తిహి. 1.3.33

8. బాదరి(3) 1. అనుస్మృతేర్బాదరిః. 1.2.30

2. అభావంబాదరిరాహహ్యేవమ్. 4.4.10

3. సుకృతదుష్కృతేఏవేతితుబాదరిః. 3.1.11

శ్రీః

## అనుబంధం - 2

# బ్రహ్మసూత్రభాష్యోదాహృతానాం శ్రుత్యాదివాక్యానామ్ అకారాదిక్రమేణ సూచీ

[redacted]



ఏ

ద

ర



ల

శ

హ



శుభం భూయాత్

శ్రీ :

## అనుబంధం - 3

# కొన్ని పదాలకు అర్థాలు

**అకార్త్స్న్యమ్** పరిపూర్ణం కాకపోవడం. అసంపూర్ణత్వం. పూర్తిగా ఉండకపోవడం.

**అకృతాభ్యాగమః** చేయని పనికి ఫలం లభించడం.

**అక్షరమ్** (1) బ్రహ్మ. నాశరహితమైనది. (2) అవ్యక్తం. మాయ. ప్రకృతి.

**అఖ్యాతి:** ఒక తెల్లని వస్తువును చూడగానే ఇది అనే జ్ఞానం కలుగుతుంది. తెల్లగా ఉన్న దానిని చూడడంవల్ల వెండి స్మరించబడుతుంది. ఇది అనే ప్రత్యక్షవస్తువునీ స్మరించబడే వెండినీ, వాటి కున్న భేదాన్ని గుర్తించకపోవడంచేత ఒకటిగా చేసి ఇది వెండి అనే లోక వ్యవహారం కనబడుతుంది. అఖ్యాతి అనగా ప్రత్యక్షవస్తు - స్మర్యమాణవస్తువుల భేదాన్ని గుర్తించకపోవడం. అందుచేత నిజంగా భ్రమ అనేది లేదు అని ప్రాభాకరులంటారు.

**అఙ్గాఙ్గిభావః** ఒకటి అవయవంగాను (అప్రధానంగాను) మరొకటి అవయవిగాను (ప్రధానంగాను) ఉండడం.

**అజీవః** అచేతనం.

**అతన్త్రమ్** (1) అంగీకరింపబడనిది. (2) అంతగా ప్రధానం కానిది. అవసరం లేనిది.

**అతిదేశః** ఒక చోట చెప్పిన దానికి మరొకచోట ప్రవర్తింపచేయడం. (ఇలా చేయడానికి కారణం రెండింటి మధ్యా పోలిక ఉండడం).

**అతిప్రసంగః** ఒక వాదం లేదా నియమం ప్రవర్తించకూడని చోట కూడ ప్రవర్తించడం.

**అతిశయః** (1) ప్రధానమైన భేదం లేదావిశేషం. (2) సూక్ష్మమైనవిశేషం (3) ఒక విశిష్టత్వం (4) నొక్కి చెప్పడం.

**అతీన్ద్రియ** ఇంద్రియగోచరం కానిది.

**అధర్మః** (1) ధర్మవిరుద్ధమైనది (2) స్థితికి ఉపకరించేది (జై.మ.)

**అధికారః** (1) అర్హత (2) ప్రకరణం, సందర్భం.

**అధికృతాధికారః** ఒక కర్మ చేయడానికి అధికారం ఉన్నవానికే మరొక కర్మచేయ డానికి అధికారం ఉండడం.

**అధిష్ఠాతృ** ఒక విషయాన్ని నడిపించేవాడు దానిని తన వశంలో ఉంచుకొన్నవాడు.

**అధిష్ఠానమ్** (1) ఎక్కడ ఉండి పని చేస్తాడో అది. ఆధారం. (2) మూర్తీభవించి ఉండడం.

**అధిష్ఠేయ** ఎక్కడ ఉండి పని చెయ్యాలో అది.

**అధ్యాసః** (1) ఒక వస్తువును (పొరబాటున) మరొక వస్తువుగా చూడడం. (2) ఒక వస్తువు మీద మరొక వస్తువుయొక్క ధర్మాలను ఆరోపించడం. (3) (ఉపాసనలో) ఆలంబనాన్ని ప్రధానంగా ధ్యానించడం.

ఉదా : మనస్సే బ్రహ్మ అని ధ్యానించి నప్పుడు మనస్సు ఆలంబనం. ఈ ధ్యానంలో మనస్సుకు ప్రాధాన్యం గాన ఇది అధ్యానరూపమైన ఉపాసన. దీనికే 'ప్రతీకోపాస' అని కూడ పేరు.

**అధ్యాత్మమ్** (1) ఆత్మతో సంబంధించిన (2) శరీరంలో ఉన్న.

**అధ్యారోపః** లేనిదానిని ఆరోపించడం, ఉదా. బ్రహ్మమీద, నిజానికి లేని, జగ్తు ఉన్నట్లు చెప్పడం.

**అధ్యారోపిత** లేకపోయినా, కావాలని, ఉన్నట్లు చూపబడినది.

**అనాగతసంబన్ధాదతీతసంబన్ధో బలవాన్.** (ఇదొక న్యాయం - సామెత) రాబోయే సంబంధం కంటె అంతకు ముందే ఉన్న సంబంధం ఎక్కువ బలం గలది.

**అన్ధపఙ్గున్యాయః** (ఇదొక న్యాయం) కాళ్ళు లేని వాడు గ్రుడ్డివాని బుజం ఎక్కి దారి చూపుతుండగా ఇద్దరూ కలిసి వెళ్ళి గమ్యస్థానం చేరడం.

**అన్ధపరమ్పరాన్యాయః** గ్రుడ్డివాళ్ళందరూ ఒకని వెనుక ఒకడు నడిచివెడుతూ అందరూ ఏ గోతిలోనో పడతం.

**అనపేక్ష** దేని అపేక్షా లేకుండా నిశ్చితంగా తనంతతానే ప్రమాణ మైనది.

**అనవకాశ** చోటు లేకుండా పోయినది.

**అనవస్థా** అంతం అంటూ లేకపోవడం ("విత్తు ముందా చెట్టు ముందా" ఇత్యాదులలోవలె)

**అనాక్షేపః** సారం లేని ఆక్షేపం,

**అనిర్వచనీయ** దీని స్వరూపం ఇది అని చెప్ప శక్యం కాని.

**అనిర్వచనీయఖ్యాతి** భ్రమస్థలంలో తాడుమీద కనబడిన సర్పం మొదలైనవి, ఉన్నవని కాని లేవని కాని చెప్పడం శక్యం కాదు అనిచెప్పే అద్వైతుల మతం.

**అనుగ్రహీతృత్వమ్** సహాయపడడం. అవలంబనం ఇవ్వడం.

**అనుగ్రాహికా** సంరక్షించేది. ఉపకరించేది.

**అనుపపత్తి** కుదరకపోవడం. ఇది ఇలాగే అని చెప్పడానికి వీలు కాకపోవడం.

**అనుపమర్దః** చెడిపోకుండా ఉండడం. చెడగొట్టకపోవడం.

**అనుబన్ధచతుష్టయమ్** ప్రతీ గ్రంథానికీ ప్రారంభంలో (1) దీనిలోని విషయం ఏమిటి (2) విషయానికి గ్రంథానికీ సంబంధం ఏమిటి (3) ఇది చదవటానికి అధికారి ఎవరు (4) చదువుతే ప్రయోజనం ఏమిటి అనే నాలుగు విషయాలు సూచించాలి. ఇవే అనుబన్ధచతుష్టయం.

**అనుమానమ్** (1) ఒక ప్రమాణం, పొగను చూచి నిప్పు ఉన్నట్లు తెలుసుకొనడం మొదలైనది (2) సాంఖ్యుల ప్రధానం.

**అనుయాయిన్** ముందుకు కూడా సాగుచున్న.

**అనుశయః** ఒక కర్మకు ఫలంగా స్వర్గాదులకు వెళ్లిన తరవాత మరొక జన్మకు కారణంగా తన ఫలాన్ని ఇవ్వడానికి ప్రారంభించిన మరొక కర్మ.

**అనుషంగః** సంబంధం

**అనుష్ఠానమ్** (ధర్మాదులను)ఆచరించడం.

**అనుష్ఠేయ** చేయదగినది.

**అనుష్ఠేయరూప** నిశ్చితమైన కార్యవిధానంగల

**అనుస్మృతి** గడచినదానిని స్మరించడం.

**అనేకాత్మక** అనేక స్వరూపస్వభావాలుగల.

**అన్ధగోలాఙ్గూలన్యాయః** ఎద్దు తోక ఒక గ్రుడ్డివాని చేతిలో పెట్టి దీనిని పట్టుకొని వెళ్ళు అని ఎవడో కొంటెవాడు చెప్పగా ఆ మాటలు నమ్మి అతడు ఏ విధంగా కష్టాలకు లోనౌతాడో అట్లు అనే సామెత

**అన్నమయకోశః** ఆత్మను కప్పి ఉన్న, అన్నంతో తయారైన ఒర (అనగా దేహం).

**అన్యథాఖ్యాతిః** ఎదుట తళతళలాడుచున్న ముత్యపు చిప్పమీద ఎక్కడనో వెండి కొట్టులో ఉన్న వెండి ఉన్నట్లు కనబడడం అన్యథాఖ్యాతి అని నైయాయికులు.

**అన్వయః** (1) అనుస్యూతంగా ఒకదానిలో ఉండడం (2) ఏకరూపత్వం.

**అన్వయవ్యతిరేకాలు** ఇది ఉంటే అది ఉంటుంది అని చెప్పడానికి వీలుంటే అన్వయం. ఉదా. ధూమం ఉంటే అగ్ని ఉంటుంది అని చెప్పడానికి వీలవుతుంది గాన అది అన్వయం. ఇది లేకపోతే అది ఉండదు అని చెప్పడానికి వీలుంటే వ్యతిరేకం. ఉదా. అగ్ని లేకపోతే ధూమం ఉండదు అని చెప్పడానికి వీలుంది గాన అది వ్యతిరేకం.

**అన్వయ్యవిచ్ఛేదః** అనుస్యూతంగా వస్తున్న కారణాదులలోని అంశాలు కార్యాదులులో అవిచ్ఛిన్నంగా ఉండడం.

**అపకర్ష** కనీసపు స్థితి లేదా అవయవాదులు. కనీసం. కనిష్ఠత్వం.

**అపచయః** తరిగిపోవడం.

**అపదేశః** (1) వంక. మిష (2) చెప్పడం.

**అపరిగ్రహః** ధనాదులు ఏవీ నిలవచేసి కొనుకుండా ఉండడం.

**అపరిచ్ఛిన్న** ఇంత అని కొలవశక్యం కాని, కొలవబడని.

**అపవర్గః** మోక్షం.

**అపవాదః** (1) సామాన్యంగా చెప్పిన ఒక విషయాన్ని బాధించే మరొక విషయం. (EXCEPTION)(2) నింద, నిరాకరణం (3) అధ్యారోపం చేసి, తరవాత, వాస్తవంలో అది లేదని చెప్పడం(చూ.అధ్యారోపః).

**అపవాదాభావే ఉత్సర్గ ప్రసిద్ధిః** (ఇది ఒక న్యాయం) అపవాదం లేకపోతే సామాన్య శాస్త్రం ప్రవర్తించడం.

**అపీతి** (ప్రపంచ) ప్రలయం. కార్యం తన కారణంలో లీనం అయిపోవడం (కుండ మట్టిలో లీనం అయిపోయి నట్లు).

**అప్రతిహత:** ఏ అర్థంకులూ లేకపోవడం.

**అప్రతిష్ఠానమ్** ఒక చోట నిలకడ లేకపోవడం. ఉదా. తర్కాప్రతిష్ఠానం - తర్కానికి ఒక నిలకడ, అంతం, లేకపోవడం.

**అప్రతిసంఖ్యానిరోధః** పదార్థసంతానం దానంతట అదే నిలిచిపోవడం (బౌ.మ).

**అప్రదేశత్వమ్** విభజించడానికి తగిన ప్రదేశం (అవయవాలు) లేకపోవడం.

**అప్రవృత్తిః** (ప్రమాణాదులు)

ప్రవర్తించకపోవడం

**అభావాన్విత:** అభావంతో కూడిన, అభావం కలిసి ఉన్న.

**అభిగమనమ్** తీర్థ - దేవాలయాదులకు యాత్ర.

**అభిజ్వలనమ్** ఉద్రేకం చెందడం.
ఉదా చిత్తాభిజ్వలనమ్.

**అభిధ్యా** అంతర్మననం.

**అభిధ్యానమ్** ధ్యానం.

**అభిభవ:** అణగిపోవడం.

**అభియుక్త:** విద్యావంతుడు.

**అభిమానిదేవతా** పృథివ్యాదులను అధిష్ఠించి ఉండే చైతన్యం గల దేవత.

**అభిమానివ్యపదేశ:** అభిమానిదేవతల నిర్దేశం

**అభేద:** భేదం లేకపోవడం (రెండు పాత్రలలో ఉన్న నీళ్ళు కలిపితే కలిసిపోయి నట్లు).

**అభౌతిక** పంచభూతాలకు సంబంధించని. వాటి వల్ల పుట్టని

**అభ్యుపగమవిరోధ:** (తన) సిద్ధాంతానికే విరోధం.

**అభ్యుచ్చయ:** చాలావాటి యొక్క కలయిక

**అభ్యుపాయ:** (1) ఉపాయం (2) పద్ధతి.

**అభ్యుపేతహాని:** ముందు అంగీకరించిన దానిని (వాదాన్ని) విడిచిపెట్టడం.

**అయుతసిద్ధ** ఒక దాని నుండి ఒకటి విడదీయరాని విధంగా కలిసి ఉన్నవి. ఉదాహరణకి అవయవం - అవయవి, గుణం-ద్రవ్యం, కార్యం - కారణం మొ.

**అర్థయాథాత్మ్యమ్** ఒక వస్తువుయొక్క యథార్థ స్వరూపం.

**అర్థవాద:** ఏదైన ఒక విషయాన్ని స్తుతిస్తూ లేదా నిందిస్తూ చెప్పిన వాక్యం అర్థవాదం. ఇది మూడు విధాలు. ప్రత్యక్షాది విరుద్ధంగా ఉంటే గుణవాదం. ఉదా ' ఆదిత్యో యూప:. యూపస్తంభం సూర్యుడు కాజాలదు గాన ఇది నిగనిగలాడడం వంటి గుణాన్ని పట్టి చెప్పిన అర్థవాదం. "అగ్నిర్హిమస్య భేషజమ్" (అగ్ని చలికి మందు) ఇది తెలిసిన విషయమే చెపుతున్నది అందుచేత అనువాదరూపమైన అర్థవాదం. ఈ రెండు రకాలకీ చెందని 'ఇన్ద్రో వృత్రాయ వజ్రముదయచ్ఛత్" (ఇంద్రుడు వృత్రుని మీదికి వజ్రం ఎత్తాడు) ఇత్యాదికం భూతార్థవాదం.

**అర్థాపత్తి** ఇదొక ప్రమాణం. "దేవదత్తుడు బలిసి ఉన్నాడు. పగలు భోజనం చేయడు" అన్నప్పుడు అసలు భోజనం చేయకపోతే బలిసి ఉండడం కుదరదు గాన రాత్రి భోజనం చేస్తాడు అని ఊహిస్తాం. ఇలా ఊహించడం అర్థాపత్తి.

**అర్ధజరతీన్యాయ:** వృద్ధురాలి సగం శరీరమే కావాలి మిగిలిన సగం వద్దు అన్నట్లు అనే సామెత. గ్రహిస్తే అంతనీ గ్రహించాలి కాని సగం గ్రహించి సగం విడవకూడదు అనడానికి చెప్పే న్యాయం (చూ-ఆనందమయాధికరణం)

**అర్ధవైనాశిక:** సగం శూన్యవాది. (వైశేషికునికి ఆక్షేపపూర్వకంగా పెట్టిన పేరు)

**అవచ్ఛేదవాద:** ఆకాశం ఒక్కటే అయినా గదులు, ఘటాలు మొదలైన వాటిచేత వేరు చేయబడినట్లు కనబడుతూ

అపవరకాకాశం, ఘటాకాశం ఇత్యాది భేదాలు పొందినట్లు, సర్వవ్యాప్తమైన ఆత్మ అంతఃకరణాదులలో ఇమిడి వేరు వేరుగా కనబడుచున్నది అనేవాదం.

**అవభాస్యావభాసకభావః** ప్రకాశింపచేయదగినది ప్రకాశింపచేసేది అనే ధర్మం.

**అవయవః** ఒక భాగం. ఉదా. కొమ్మ చెట్టు యొక్క అవయవం.

**అవయవావయవి విభాగం** ఇది అవయవం ఇది అవయవి అనే విభాగం.

**అవయవీ** అవయవాలు కలది. ఉదా. మొత్తం చెట్టు (చూ. **అవయవః**).

**అవష్టమ్భః** : (1) ముందుకు వెళ్ళకుండా అడ్డుకొనడం (2) పట్టు, ఆధారం.

**అవస్థితిః** కొంత కాలం ఉండడం. మన్నిక.

**అవికార్య** మార్చడానికి శక్యం కాని.

**అవికృత** మార్పు లేని ఆకారం గల.

**అవిచ్ఛేదః** మధ్యలో తెగిపోకుండా, ఆగిపోకుండా ఉండడం

**అవిద్యా** అజ్ఞానం, మాయ, అధ్యాస.

**అవిద్యాకల్పిత** (వాస్తవంలో లేకపోయినా) అజ్ఞానంచేత కల్పించబడిన.

**అవిద్యానివృత్తిః** అజ్ఞానం తొలగిపోవుట.

**అవిద్యాప్రత్యుపస్థాపిత** అజ్ఞానంచేత ఏర్పరుపబడిన.

**అవిద్యోపప్లవ** అజ్ఞానంవల్ల కలిగిన ఉపద్రవం లేదా చిత్తవిభ్రమం.

**అవ్యక్త** వ్యక్తం కాని, పైకి కనబడని నామరూపాలు లేకుండా సూక్ష్మంగా ఉన్న.

**అవ్యతిరేక** వేరుగా లేకపోవడం.

**అవ్యాకృత** నామరూపాలతో విభజించబడనిది. సూక్ష్మరూపంలో ఉన్నది. సృష్టికి పూర్వం గూఢంగా ఉన్న జగత్తు. (ఇదే మాయ యొక్క ఒక అవస్థ)

**అష్టకా** ఒక శ్రాద్ధకర్మ

**అసత్** లేనిది.

**అసత్ కార్యవాదః** పుట్టడానికి పూర్వం కార్యం లేదు. అది క్రొత్తగా పుడుతుంది అనే వాదం (నైయాయికాదుల వాదం).

**అసత్‌ఖ్యాతి** (భ్రాంతి స్థలంలో) అక్కడ లేనిదే కనబడుతుంది అని చెప్పే మతం (శూన్యవాదిబౌద్ధుల మతం).

**అసమఞ్జస** యుక్తిసంమతం కాని.

**అసమవాయికారణమ్** సహజసిద్ధం కాని కారణం ఉదా.పటానికి దారాల సంయోగం అసమవాయి కారణం (దారాలు సమవాయికారణం).

**అస్తికాయః** పదార్థం. (జై.మ).

**అస్మత్ప్రత్యయః** 'నేను' లేదా 'మేము' అనేభావం.

**అహంశ్రేయస్** స్వప్రాధాన్యం. నేనే గొప్ప అనే భావం

**అహంకారః** 'నేను' అనే భావన.

## ఆ

**ఆకాఙ్క్షా** మరొకదాని అవసరం. 'వస్తున్నాడు' అనగానే ఎవరు? అని ప్రశ్న కలుగుతుంది. ఇలాంటి ప్రశ్నకు అవకాశం ఉండడం ఆకాంక్ష.

**ఆకాశః** ఆకాశం. అవకాశం చోటు.

**ఆకాశఘటాకాశన్యాయః** అంతటా వ్యాపించి ఉన్న ఆకాశం ఘటంలో ఉన్న ఆకాశం అనే పద్ధతి.

**ఆకృతిః** (1) ఆకారం (2) జాతి.

**ఆక్షేపః** (1) ఏదైనా చెప్పినప్పుడు ఇది ఎలా కుదురుతుంది అని ప్రశ్నించడం. (2) ఉన్న దానిని, చూచిన దానిని పట్టి చూడనిదానిని ఊహించి తెలుసుకొనడం.

**ఆగమః** శాస్త్రం (వేదాదికం)

**ఆతివాహికః** మరణానంతరం జీవుణ్ణి, కూడా ఉండి, మరొక లోకానికి చేర్చే దేవతాపురుషుడు.

**ఆత్మఖ్యాతి** (భ్రాంతి స్థలంలో), లోపలనున్న విజ్ఞానరూపమైన ఆత్మయే బైట నున్న వస్తువుగా భాసిస్తున్నది అని చెప్పే విజ్ఞానవాది బౌద్ధుల మతం.

**ఆత్మలాభః** ఒక పదార్థం తన వైయక్తిక స్వరూపంతో ఆవిర్భవించడం. ఉనికి కలది అవడం. పుట్టడం.

**ఆత్మన్** (1) జీవాత్మ (2) పరమాత్మ (3) మనస్సు (4) బుద్ధి (5) అంతఃకరణం (6) శరీరం.

**ఆత్మాతిశయ** అతర్గతమైన సార యొక్క సూక్ష్మరూపం. తనలోనే ఉన్న ఒక గొప్పతనం.

**ఆత్యన్తిక** పరిపూర్ణమైన. దానికి (తనకు) మించినది లేని.

**ఆధారః** ఒక వస్తువును నిలబెట్టేది.

**ఆధేయ** మరొకదానిమీద నిలబడేది. ఉదా. ఘటం ఆధారం ఉదకం ఆధేయం.

**ఆధ్యాత్మిక** (1) ఆత్మకు సంబంధించిన (2) శరీరంలో ఉన్న.

**ఆనన్దమయకోశః** అజ్ఞానసమష్ట్యుపహిత చైతన్యం.

**ఆనర్థక్యమ్** ప్రయోజనం లేకపోవడం.

**ఆనుమానిక** అనుమానప్రమాణంచేత ఊహించబడిన పదార్థం (సాంఖ్యుల ప్రధానం).

**ఆభాసః** (పైకి) ఉన్నట్లుగా కనబడడం.

**ఆయతనమ్** ఉండే స్థానం, ఆధారం.

**ఆయతనభావః** ఆధారంగా ఉండడం.

**ఆరమ్భణ** ఆరంభించడం, పుట్టించడం.

**ఆరమ్భకత్వ** పుట్టించే వ్యాపారం, పని.

**ఆరమ్భః** లేని వస్తువు కొత్తగా పుట్టడం, అంతవరకూ లేని ఘటం కులాలాదుల వ్యాపారంచేత క్రొత్తగా పుడుతుంది.

**ఆర్షజ్ఞాన** ఋషుల దివ్యదృష్టి.

**ఆలయవిజ్ఞానమ్** 'నేను నేను' అనే జ్ఞానం యొక్క ప్రవాహం. ఇదే బౌద్ధుల జీవాత్మ.

**ఆవరణశక్తిః** సత్యాన్ని మరుగుపరిచే శక్తి. మాయలో ఉన్న శక్తి.

**ఆవరణాభావః** ఆవరణం లేకపోవడం. పరిమితి లేకపోవడం.

**ఆవిర్భావః** (అంతవరకు కనబడనిది కొంతకాలానికి) పైకి కనబడడం.

**ఆశయః** గ్రహించే విజ్ఞానం. ఆలయవిజ్ఞాన ప్రవాహం. అవిచ్ఛిన్నమైన విజ్ఞానప్రవాహం.

**ఆశ్రయః** ఆధారం. ఆధారపడి ఉండడం.

**ఆశ్రయాశ్రయిభావః** ఇది ఆధారం ఇది ఆధేయం (దాని మీద ఉండేది) అనే ధర్మం.

**ఆసనమ్** యోగశాస్త్రంలో చెప్పిన కూర్చునే విధానం.

**ఆస్రవః** (1) లోపలికి చేరే ప్రవాహం (2) కర్మ (జైన) (3) ఇంద్రియాలు విషయాభిముఖంగా ప్రవర్తించడం.

**ఆహవనీయః** హోమం చేసే అగ్ని

ఇ

ఇజ్యా యాగం. పూజ.

ఇతరేతరప్రత్యయత్వమ్ : కార్యంగాను కారణం గాను (రెండు పదార్థాల మధ్య నున్న) పరస్పర సంబంధం.

ఇతరేతరభావ: ఇది అదిగాను అది ఇది గాను అవడం లేదా కనబడడం.

ఇతరేతరాధీనత్వమ్ (రెండు వస్తువులు) ఒకదాని మీద ఒకటి ఆధారపడి ఉండడం.

ఇతరేతరాశ్రయత్వమ్ అది దీనినీ ఇది దానినీ ఆశ్రయించి ఉండడం.

ఇన్ద్రియసంనికర్ష: ఇంద్రియాలకు అవి గ్రహించే విషయాలతో సంబంధం (కలవడం)

ఇయత్తాపరిచ్ఛిన్న ఇది ఇంత అని కొలవబడిన

ఈ

ఈశితవ్య ఎవనిమీద లేదా దేనిమీద అధికారం చెలాయించవచ్చునో వాడు లేక అది.

ఈశితృ అధికారం ఉన్నవాడు. నియమించ గలవాడు.

ఈశిత్రీశితవ్యభావ ఒకడు నియామకుడు ఒకడు నియమించదగినవాడు అనే ధర్మం.

ఈశ్వరప్రణిధానమ్ ఈశ్వరునిపై మనస్సు నిలపడం.

ఉ

ఉత్తరపక్ష: ప్రతివాది ఆక్షేపణలను ఖండించి ప్రతిపాదించబడిన సిద్ధాంతం.

ఉత్పత్తికారణమ్ పుట్టడానికి కారణం.

ఉత్పత్తిహేతు: పుట్టడానికి హేతువు.

ఉత్సర్గ: : (1) సామాన్యశాస్త్రం "మా హింస్యాత్సర్వా భూతాని" ఏ ప్రాణుల్నీ హింసించకూడదు. అనేది సామాన్యశాస్త్రం. "అగ్నీషోమీయం పశుమాలభేత" "అగ్నిషోమయాగంలో పశువును హింసించాలి" అనేది అపవాదశాస్త్రం (2) విడవడం సృష్టించడం.

ఉద్భవాభిభవౌ పైకి రావడం అణగిపోవడం. ప్రధానంగా ఉండడం అప్రధానంగా అయిపోవడం.

ఉపకారకం మరొకదానికి ఉపకరించేది.

ఉపకార్యమ్ మరొకదానినుండి ఉపకారం పొందేది.

ఉపకార్యోపకారకభావ: ఉపకరించతగినది ఉపకరించేది అనే సంబంధం.

ఉపక్రమ: ప్రారంభం. ఒక ఘట్టం ప్రారంభంలో చెప్పిన విషయం.

ఉపక్రమే సందిగ్ధార్థస్య తచ్ఛేషాన్నిర్ణయన్యాయ: ఉపక్రమంలో ఏ విషయాన్ని గూర్చి ఇలా చెప్పాలా అలా చెప్పాలా అని సందేహం ఉంటుందో దానిని తరవాత చెప్పినదానిని పట్టి నిర్ణయించాలి అని చెప్పే న్యాయం.

ఉపగమ: అంగీకారం.

ఉపచయ: (ఆకారాదులలో) పెరుగుదల.

ఉపచార: ఏదో పోలిక మొదలైన దానిని పట్టి ఒక వస్తువును మరొక వస్తువునుగా (కావాలనే) చెప్పడం. ఉదా. సింహాని కున్న శౌర్యధైర్యాదుల వంటి శౌర్యధైర్యాలున్న వానిని చూపి 'ఇతడు సింహం' అనడం.

**ఉపచిత** అవయవవృద్ధి పొందిన

**ఉపజీవన** ధ్రువీకరించేది ప్రమాణంగా నిలచేది

**ఉపన్యాసః** ఏదైన విషయాన్ని ముందు ఉంచడం, చెప్పడం.

**ఉపపత్తిః** చెప్పిన విషయం యుక్తంగా, యుక్తియుక్తంగా ఉండడం. సమర్థనం.

**ఉపప్లవః** ఉపద్రవం, బాధ.

**ఉపమర్దః** ఉన్నది ఉన్నట్లుండకుండా పూర్తిగా మారిపోవడం. ఉదా. స్వరూపోపమర్దః = అసలు రూపం చెడిపోవడం.

**ఉపరతి** కర్మసంన్యాసం

**ఉపలమ్భ** (1) పొందడం. (2) తెలియడం

**ఉపసంహారంః** (1) వినాశం (2) సాధన సామగ్రిని సమకూర్చుకొనడం (3) వెనుకకు తీసికొనడం.

**ఉపసంహారకారణమ్** వినాశానికి లేదా వెనుకకు తీసికొనడానికి కారణం.

**ఉపలబ్ధిః** జ్ఞానం, తెలుసుకొనడం

**ఉపాదానమ్** (1) ఏ వస్తువుతో కార్యాన్ని తయారు చేస్తామో ఆ వస్తువు ఆ కార్యానికి ఉపాదానకారణం. ఉదా. మట్టి కుండకి, బంగారం కుండలానికి ఉపాదానం, (2) ప్రయత్నం (3) (పూజాదులకు) వస్తువులు సేకరించడం.

**ఉపాధిః** (1) విస్తృతమైనదానిని సంకుచితం చేసే వస్తువు. ఉదా. ఆకాశానికి ఘటం ఉపాధి. ఇది విశాలమైన ఆకాశాన్ని సంకుచితం చేస్తున్నది. అనంతమైన ఆత్మకు దేహం ఉపాధి. (2) మార్పు కలిగించేది

**ఉపాయనమ్** వెళ్ళి మరొకదానితో చేరడం.

**ఉపాయోపేయభావః** ఒక కార్యాన్ని సాధించడానికి సాధనం, సాధించబడే కార్యము అనే సంబంధం.

**ఉపాసనమ్** ఏకాగ్రచిత్తంతో సేవించడం లేదా ధ్యానించడం.

ఏ

**ఏకాన్తః** తప్పకుండా వర్తించే నియమం.

**ఐకాన్తిక** తప్పనిసరి యైనది.

**ఐతిహ్యమ్** 'ఇది ఇలాగట' అని చెప్పేమాట.

**ఐదమ్పర్యమ్** పరమతాత్పర్యం

**ఐశ్వర్యమ్** సర్వశక్తత్వం. ఏదైనా చేయగల సామర్థ్యం.

**ఔత్సుక్యనివృత్తిః** అత్యాసక్తి తొలగడం.

**ఔపచారిక** ఉపచారంచేత, ఆరోపించడంచేత చెప్పినది.

క

**కరణగ్రామః** ఇంద్రియాల సముదాయం.

**కరణాయతనమ్** ఇంద్రియా లుండే స్థానం అనగా దేహం.

**కర్మకాణ్డః** యజ్ఞాదికర్మల సముదాయం.

**కర్మవిపాకః** కర్మ ఫలం ఇవ్వడానికి పరిపక్వం అవడం.

**కర్మేన్ద్రియాణి** ఆ యా పనులు చేసే వాక్ - పాణి - పాద - పాయు - ఉపస్థ లనే ఐదు ఇంద్రియాలు

కల్పః జగత్సృష్టి. కొన్ని లక్షల సంవత్సరాల అతిదీర్ఘకాలం.

కామ్యకర్మ స్వర్గాదులు కావాలనే కోరికతో చేసే జ్యోతిష్టోమయాగాదికర్మ

కాయః శరీరం.

కారకమ్ కర్త, కర్మ, కరణం మొదలైన ఒక పని చేయడానికి కావలసినది.

కారణశరీరమ్ (1) అవిద్య (2) అజ్ఞాన సమష్ట్యుపహితచైతన్యమైన ఈశ్వరుడే కారణశరీరం.

కారకోపసంహారః సాధనసామగ్రి సమకూర్చుకొనుట.

కార్యకరణసంఘాతః శరీరేంద్రియాల సముదాయం, ఇంద్రియహితమైన శరీరం.

కార్యకరణాని శరీరేంద్రియాలు.

కార్యవైచిత్ర్యమ్ సృష్టిలోని కార్యాల (సృష్టించబడిన వస్తువుల) వైవిధ్యం.

కుణ్డబదరన్యాయః కుండలో రేగిపళ్ళు పోసినట్లు అనే సామెత.

కూటస్థ మార్పు లేకుండా స్థిరంగా ఉన్న.

క్రతుః (1) సంకల్పం, ధ్యానం, ఉపాసన (2) యజ్ఞం

క్రత్వర్థ యజ్ఞానికి ఉపకరించేది. యజ్ఞం పరిపూర్ణం అవడానికి కావలసినది.

క్రియాకారకఫలలక్షణ పనులు, వాటి సాధనాలు, పనుల ఫలితాలు అనే స్వరూపంగల. (జగత్తనగా ఈ మూడే)

క్షణిక ఒక్క క్షణం మాత్రమే ఉండి మరు క్షణంలో నశించేది

క్షేత్రజ్ఞ శరీరాన్ని గుర్తించే జీవుడు.

ఖ

ఖ్యాతిః జ్ఞానం.

గ

గుణః (1) సత్త్వం, రజస్సు, తమస్సు అనే గుణాలు (2) రూపం, రసం మొదలైన వైశేషికులు అంగీకరించిన గుణాలు. (3) శౌర్యం, ధైర్యం మొదలైన గుణాలు.

గుణిన్ గుణాలు ఉన్నది.

గుణగుణికల్పనా గుణాలు, వాటికి ఆశ్రయమైన గుణి అనగా ద్రవ్యం అని కల్పించడం.

గుణత్రయం సత్త్వరజస్తమోగుణా లనే మూడు గుణాలు.

గుణప్రధానభావః ఇది అప్రధానము (సహకరించేది) ఇది ప్రధానము అని రెండు వస్తువుల మధ్య నున్న సంబంధం (2) ఒకటి లొంగి ఉండడం రెండవది ప్రధానంగా ఉండడం.

గుణవృత్తమ్ గుణాల వ్యాపారం లేదా స్వభావం.

గుణవైషమ్యమ్ గుణాలలో హెచ్చుతగ్గులు కలగడం.

గౌణం (1) అప్రధానం (2) గుణాలను పట్టి (పోలికలను పట్టి) ఏర్పడినది.

గ్రాహ్యగ్రాహకత్వమ్ తెలుసుకొనదగినది తెలుసు కొనేవాడు అనే సంబంధం

చ

చతురణుకమ్ నాలుగు ద్వ్యణుకాల సముదాయం.

చరణమ్ (1) వేదశాఖ (2) ఆచారం (3) చూ, అనుశయః

చిత్తాభిజ్వలనమ్ చిత్తం ప్రజ్వలించడం అనగా చిత్తంలో వేరు వేరు ఆలోచనలు పుట్టడం.

చైత్తమ్ చిత్తానికి సంబంధించినది.

చైత్తికమ్ చిత్తానికి సంబంధించిన రాగాది స్కంధపంచకం.

చోదనా విధి. ఇలా చెయ్యాలి అని వేదాదులలో ఉన్న వాక్యం.

జ

జాగరితమ్ జాగ్రదవస్థ.

జాతిః మనుష్యత్వం, వృక్షత్వం మొదలైనది. మనుష్యత్వం మనుష్యులందరిలోను ఉంటుంది. అట్లే వృక్షత్వం. మనుష్యుడు అనిత్యమైనా మనుష్యత్వం నిత్యం. ఇలాంటి 'మనుష్యత్వం' మొదలైనవాటికి జాతి లేదా సామాన్యం అని పేరు.

జిజ్ఞాసా తెలుసుకోవాలనే కోరిక

జీవాస్తికాయః జీవు డనే పదార్థం.

జ్ఞానవైచిత్ర్యమ్ జ్ఞానాలలో ఉన్న వైవిధ్యం. అనేక రకాలైన జ్ఞానాలు.

జ్ఞానేన్ద్రియాణి ఆ యా వస్తువుల జ్ఞానం కలిగించే త్వక్ - చక్షుః - శ్రోత్ర - ఘ్రాణ - రసనేంద్రియాలు.

త

తత్త్వావ్యవస్థానమ్ : తత్త్వాన్ని గూర్చి నిశ్చితాభిప్రాయం లేకపోవడం.

తన్తుపటన్యాయః : దారాలు సమవాయికారణం, పటం వాటి కార్యం అనే న్యాయం.

తన్త్రమ్ (1) సిద్ధాంతం (2) వి. అధీనమైన

తప్తపరశుగ్రహణమ్ అపరాధి అని సందేహించిన వాని చేతిలో ఎఱ్ఱగా కాల్చిన గొడ్డలి పెట్టగా వాని చెయ్యి కాలితే అతడు దోషి అన్నట్లు, కాలకపోతే నిర్దోషి అన్నట్లు నిర్ణయించేవారట. పూర్వకాలంలో ఉన్న దివ్యపరీక్షలలో ఒకటి.

తప్యతాపకభావః ఒకటి తపింప చేయబడేది మరొకటి తపింపచేసేది అనే స్థితి

తప్యః (1) జీవుడు (2) తపింపబడేవాడు

తన్మాత్రాణి ప్రత్యక్షంగా కనబడుతున్న పృథివ్యాదిస్థూలభూతాలకు కారణమైన వాటి సూక్ష్మరూపాలు.

తర్కాప్రతిష్ఠానమ్ తర్కానికి (కేవలయుక్తులకు) నిలకడ లేకపోవడం.

తర్కావష్టమ్భః తర్కబలం. తర్కాన్ని ఊతగా తీసికొనడం.

తాత్పర్యం ప్రధానంగా చెప్పదలచిన విషయం. ఒక విషయాన్ని ప్రధానంగా చెప్పాలనే కోరిక.

తాదాత్మ్యమ్ ఇదీ అదీ ఒకటే అవడం. కొంచెం భేదం పాలు ఉన్న అభేదం. పాలు నీళ్ళు కలపగా ఆ రెండింటికీ ఏర్పడినది తాదాత్మ్యం.

తాపకః (1) బాధించేవాడు. బాధించేది (2) సంసారం.

తితిక్షా శీతోష్ణాదులను సహించడం.

తిరోభావః పైకి కనబడకపోవడం. ఆవిర్భవించకుండా ఉండడం.

తీర్థకరః ఏదైన ఒక సిద్ధాంతాన్ని, మతాన్ని స్థాపించినవాడు.

తైజసః స్వప్నావస్థలో ఉన్న జీవుడు.

తుచ్ఛ చెవులపిల్లి కొమ్ము వలె అసలే లేనిది

త్రివృత్కరణమ్ అగ్ని, జలం, పృథివి అనే మూడు సూక్ష్మభూతాలలో ఒకొక్కదానిని రెండేసి అర్థాలు (సగభాగాలు) చేసి, ఒకభాగం ప్రక్కన ఉంచి, రెండవభాగం మళ్ళీ రెండు సగాలు చేసి, ఆ సగాలను మిగిలిన భూతాల అర్ధభాగాలతో కలపగా అన్నిభూతాలలోను మూడు భూతాల పాళ్ళు ఉంటాయి. ఇలా చేయడం త్రివృత్కరణం.

ద

దమః ఇంద్రియనిగ్రహం.

దర్శనమ్ (1) వేదవాక్యం (2) తత్త్వసాక్షాత్కారం (3) తత్త్వాన్ని గూర్చిన సిద్ధాంతం.

దార్ష్టాన్తికమ్ దేనిని విశదీకరించడం కోసం దృష్టాంతం చూపబడుతుందో అది.

దీర్ఘమ్ త్ర్యణుకాదులలో ఉండే పరిమాణం.

దృక్శక్తిః చూచే శక్తి. ఒక వస్తువును తెలుసుకొనే శక్తి. చైతన్యం.

దృష్టాచ్చాదృష్టసిద్ధిః (న్యాయం) చూచినదానిని పట్టి చూడనిదానిని తెలుసుకొనవలె ననే పద్ధతి.

దృష్టాన్తః ప్రకృతమైన ఒక విషయాన్ని స్పష్టీకరించడానికి చూపబడే దానితో పోలిక గల మరొక విషయం.

దోషానుషఙ్గః దోషం తగలడం. దోషం ప్రసక్తం అవడం.

ద్వ్యణుకమ్ రెండు అణువుల కలయిక వలన ఏర్పడినది.

ద్వయాయత్త రెండింటిమీద ఆధారపడిన.

ద్వైతిన్ జీవునికి పరమాత్మకు, జీవునికి జీవునికీ, జగత్తులో ఉన్న సకల పదార్థాలకీ మధ్యనున్న భేదం సత్యమే అని అంగీకరించేవాడు.

ధ

ధర్మ (1) చలనానికి ఉపకరించేది (జైన) (2) పుణ్యం (3) లక్షణం (4) వేదవిహిత కర్మాదికం.

ధర్మధర్మివ్యవహారం ఇది దాని ధర్మం (లక్షణం) ఇది ధర్మంకలది అనే వ్యవహారం.

ధర్మాస్తికాయః ధర్మం అనే పదార్థం.

ధాతుః పదార్థం.

ధారణా ఏకాగ్రధ్యానం.

న

నామరూపే పేరు రూపము.

నిగ్రహీతృత్వమ్ శిక్షించకలిగి ఉండడం.

నిత్యకర్మ తప్పక చేయవలసిన సంధ్యావందనం అగ్నిహోత్రం మొదలైన కర్మ.

నిదిధ్యాసనమ్ నిరంతరంగా మననం. ధ్యానం చేయడం.

నిమిత్తమ్ (1) వాదాదులకు తగిన ఆధారం (2) ఒక వస్తువును తయారు చేయడానికి కారణం. ఉదా. కుండకు కుమ్మరివాడు. నిమిత్త కారణం.

నిమిత్తనైమిత్తికభావః దీనికి ఇది నిమిత్తం దాని వలన ఇది పుట్టినది (నైమిత్తికం) అనే సంబంధం.

నియన్తృత్వమ్ నియమించే శక్తి.

నియమకారణమ్ ఇది ఇంతే అని నియమించ దానికి కారణం.

నియమహేతుః నియమించడానికి హేతువు.

నియామకమ్ : ఇది ఇలాగే, ఇంతే అని నియమించేది.

నిరఞ్జనజ్ఞానమ్ నిర్మలమైన జ్ఞానం

నిరతిశయ (1) దేనికంటె గొప్పది లేదో అది (2) ఏదీ చేర్చడానికి గాని తీసివేయడానికి గాని వీలులేనిది.

నిరన్వయ తన వెనుక ఏ చిహ్నములూ విడిచిపెట్టని. జాడతెలియని

నిరపేక్ష దేనిమీదా ఆధారపడని. దేని అవసరమూ లేని, స్వతంత్రమైన

నిరవయవ అవయవాలు లేని.

నిరాకరణమ్ అట్లు కాదని స్థాపించడం. ఒక క్లిష్టస్థితినుండి బైటపడే మార్గం.

నిరాత్మక సారంలేని

నిరాలమ్బతా సరియైన ఆధారం లేకుండా ఉండుట.

నిరుపాఖ్య మాటలలో చెప్ప శక్యం కాని, ఏ లక్షణాలూ లేని (2) వెనక ఏ గుర్తులూ విడవని

నిరోధః అణగిపోవుట, నాశము.

నిర్జర పాపాలను నశింపచేసే తప్త శిలారోహణాదికం (జై.మ).

నిర్గుణ ఏ గుణాలూ లేనిది.

నిర్ణయకారణ ఇది ఇలాగే అని నిర్ణయించడానికి తగిన ఆధారం.

నిర్ధారణమ్ ఇది ఇంతే అనే నిర్ణయం.

నిర్విశేష విశేషాలు, గుణాలు లేనిది.

నివృత్తినిష్ఠః నివృత్తి మార్గంలో, జ్ఞాన మార్గంలో ఉన్నవాడు.

నిఃశ్రేయసమ్ అత్యుత్తమమైన లక్ష్యం (మోక్షం)

నిషిద్ధకర్మ : చేయకూడ దని నిషేధించబడిన ప్రాణిహింసాదికం.

నిష్కల అవయవాలు లేని. భాగాలు లేని.

నిష్ఠా అత్యుత్కృష్టమైన స్థితి. అత్యున్నత స్థితి. లేదా లక్ష్యం

నైమిత్తికకర్మ ఏదో ఒక నిమిత్తాన్ని పట్టి చేయవలసిన కర్మ. ఉదా. పుత్రుడు కలిగినప్పుడు చేయవలసిన జాతేష్ట్యాదికం.

నైరాత్మ్యవాదః ఆత్మలేదనే వాదం

న్యాయః సామెత. లోకోక్తి (2) శాస్త్రీయ నియమం (3) యుక్తి

న్యాయవిద్ న్యాయంలో ప్రవీణుడు.

న్యాయాభాసం పైకి న్యాయం వలె కనబడేది

## ప

పఞ్చస్కన్ధీ రూప - విజ్ఞాన - వేదనా - సంజ్ఞా - సంస్కారాలు అనే ఐదు స్కంధాల సముదాయం.

పఞ్చాత్మక ఐదింటి స్వరూపంగల, ఐదింటితో తయారైన

పఞ్చీకరణమ్ ఐదు మహాభూతాలలో ఒక్కొక్కదానిని రెండేసి సమభాగాలుగా చేసి వాటి మొదటి ఐదు సమభాగాలను వేరు వేరుగా ఉంచి, మిగిలిన సమభాగాలను ఒక్కొక్కటి నాలుగు భాగాలుగా చేసి, ఇతర భూతాల అర్ధభాగాలలో కలపగా అన్ని భూతాలలోను అన్ని భూతాల పాళ్ళూ ఉంటాయి. ఇది పంచీకరణం. ఉదాహరణకి పృథివిని రెండు అర్ధాలుగాచేసి, ఒక అర్ధాన్ని మళ్ళీ నాలుగు భాగాలుచేసి, ఆ నాలుగు భాగాలను ఆకాశ వాయు - అగ్ని - జలాల సగభాగాలలో కలపగా ఆ భూతాలలో కూడ పృథ్వీభాగం కలుస్తుంది. ఇట్లే ఇతర భూతాల విషయంలో.

పరిగ్రహః (1) అంగీకారం (2) సొత్తు. శయ్యాసనాదికం.

పరిచ్ఛిన్నః గుర్తించతగినది. ఇంత అని కొలవదగినది.

పరిచ్ఛేదః ఇది ఇంత అని కొలత. పరిమితత్వం.

పరిణామః మార్పు. ఉదా. మట్టి ఆకారంలో ఒక మార్పు చేస్తే అది కుండ అవుతుంది. ఆ మార్పే పరిణామం. ఇలాంటి చోట కారణమైన మట్టికీ కార్యమైన కుండకీ ఒకే విధమైన సత్త ఉంటుంది. అనగా కారణం సత్త కంటె కార్యం సత్త తక్కువది కాదు.

"సతత్త్వతోఽన్యథాప్రథా వికార ఇత్యుదీరితః"

పరిణామప్రక్రియా పరిణామాన్ని గూర్చిన విధానం.

పరినిష్పన్న తయారైనది, సిద్ధమైనది.

పరిభాషా ఒక శాస్త్రానికి సంబంధించిన విశిష్టమైన పద్ధతి. పడికట్టు.

పరిమణ్డల అణుపరిమాణం (అత్యల్పమైన గుండ్రని పరిమాణం)

పరిమితత్వ ఇది ఇంత అని చెప్పడానికి వీలుగా ఉండడం.

పరిశుద్ధి నిర్దోషత్వం

పరిశేషన్యాయః కొన్ని వస్తువులు చూపి వీటిలో ఇవి మంచివి అన్నట్లయితే మిగిలినవి కావని అర్థం. (ఉదా : ఇద్దరిని చూపి ఈ ఇద్దరిలో ఇతడు బుద్ధిమంతుడు అంటే రెండవవాడు కాదని అర్థమవుతుంది). ఇది పరిశేషన్యాయం.

పరిహారః నిరాకరించడం. ఒక సమస్యకు సమాధానం.

పరిస్పన్దితమ్ అత్యల్పమైన కదలిక.

పర్యాయేణ ఒకదాని తరవాత ఒకటి చొప్పున. (2) వరుసగా.

పాఞ్చభౌతికమ్ పంచభూతాలతో ఏర్పడిన.

పారమార్థికసత్తా మూడు కాలాలలోను ఎట్టి మార్పూ లేని ఉనికి. అలాంటి సత్త కేవలం బ్రహ్మకు మాత్రమే ఉంది.

పారిమాణ్డల్యమ్ పరిమండల ప్రమాణం.

పుద్గలః (1) దేహం (2) అణువు

పుద్గలాస్తికాయః పరమాణుసముదాయాత్మకమైన దేహం

పురుషతన్త్ర పురుషుని ఇచ్ఛమీద ఆధారపడి ఉన్నది.

పురుషార్థః (1) పురుషుడు సంపాదించుకొనవలసిన లక్ష్యం. (2) పురుషునికి ఉపయోగించేది.

పూర్వపక్షః వాదంలో మొదటి పక్షం. సాధారణంగా 'నను'తో ప్రారంభమై 'చేత్'తో ముగుస్తూంటుంది.

ప్రకృతిః (1) మూలకారణం (2) ఉపాదానకారణం.

ప్రకృతివికారభావః కారణం కార్యం అనే సంబంధం.

ప్రక్రియా ఒక విషయాన్ని ప్రతిపాదించే లేదా తయారు చేసే పద్ధతి.

ప్రచయః (1) అవయవాలు శిథిలంగా ఉండడం వల్ల (దూదిపింజె మొదలైన వాటివలె) పెద్దదిగా కనబడడం. (2) కొత్త అవయవాలు చేరి పెద్దదిగా అవడం.

ప్రణిధానమ్ మనస్సును ఏకాగ్రంగా ఉంచడం.

ప్రతిఘాతః ఎదుర్కొనడం. ఢీకొనడం.

ప్రతిజ్ఞా (1) ఇది ఇట్లు అని నిశ్చిత భావంతో చెప్పడం. (2) అంగీకరించబడిన సిద్ధాంతం.

ప్రతిపత్తిః (1) తెలుసుకొనడం (2) గుర్తిం చుట (3) పొందుట (4) గుర్తించే చైతన్యం.

ప్రతిబోధనమ్ (1) తెలుపుట (2) మేల్కొలుపుట.

ప్రతిషేధః (1) నిషేధించడం (2) అట్లు కాదు అని చెప్పడం.

ప్రతిసంఖ్యానిరోధః ఉన్నపదార్థాన్ని లేని దానిని గా చేస్తాను అని ప్రయత్నపూర్వకంగా చేసిన పదార్థాల నిరోధం. వాటి ప్రవాహాన్ని అడ్డుకొనడం.

ప్రతిసంధానమ్ : (1) ఏకత్వాన్ని గుర్తించుట. (2) రెండింటిని కలుపుట.

ప్రతీకోపాసనమ్ ఒక వస్తువును మరొకదానినిగా భావించి ఉపాసించుట (శిలాప్రతిమను విష్ణువుగా పూజించినట్లు) ఇదే అధ్యాసోపాసన.

ప్రతీతిః జ్ఞానం (ఇంద్రియాదులవల్ల కలిగినది)

ప్రతీత్య రెండింటినీ కలిపి పరిశీలిం చిన తరవాత

ప్రత్యగాత్మన్ జీవాత్మ.

ప్రత్యయః (1) జ్ఞానం (2) కారణం.

ప్రత్యయవైచిత్ర్యమ్ జ్ఞానాలలో వైవిధ్యం.

ప్రత్యాఖ్యానమ్ నిరాకరించుట, ఖండించుట.

ప్రత్యాయితవ్యపక్షః విశ్వసించతగిన సిద్ధాంతం.

ప్రత్యాసత్తిః సామీప్యం ప్రసంగం.

ప్రథిమన్ స్థూలంగా ఉండడం. పెరగడం.

ప్రధానమ్ (1) సాంఖ్యులు జగన్మూలకారణం అని చెప్పే ప్రకృతి (2) అన్నింటికంటె గొప్పది.

ప్రధానమల్లనిబర్హణన్యాయః మల్లులలో ప్రధానుణ్ణి ఓడిస్తే అందరినీ ఓడించినట్లే అనే న్యాయం.

ప్రబోధః జాగ్రదవస్థ

ప్రభవః ఉత్పత్తిస్థానం. కారణం.

ప్రమాణమ్ జ్ఞానం కలగడానికి సాధనం - ఇంద్రియాలు, అనుమానం మొదలైనవి

ప్రమాతృ ప్రమాణాల సాహాయ్యంతో తెలిసికొనేవాడు.

ప్రమాణప్రమేయఫలలక్షణ ప్రమాణాలు, ప్రమేయాలు, ఫలమూ అనే లక్షణం గల

ప్రమాణప్రమేయఫలవ్యవహారః ప్రమాణాలకు, ప్రమేయాలకు, ఫలానికి సంబంధించిన లోకవ్యవహారం.

ప్రమాణప్రవృత్త్యప్రవృత్తిపూర్వక ప్రమాణాలు ప్రవర్తించడం ప్రవర్తించకపోవడం అనేదాని మీద ఆధారపడిన.

ప్రమితిః (ప్రమాణావల్ల కలిగిన) జ్ఞానం.

ప్రమేయ : ప్రమాణాలచేత తెలుసు కొనదగిన (విషయాదికం).

ప్రయోజనవత్త్వమ్ ప్రయోజనం కలిగి ఉండడం.

ప్రవర్తక ప్రవర్తించేటట్లు చేసేది.

ప్రవర్తనవ్యాపారః ప్రవర్తింపచేయడం అనే పని.

ప్రవర్త్యప్రవర్తయితృత్వమ్ ప్రవర్తింపచేయ దగినది ప్రవర్తింపచేసేది అనే ధర్మం.

ప్రవృత్తిః ప్రవర్తించడం. వ్యవహారం.

ప్రవృత్తివిజ్ఞానమ్ పనిచేసే విజ్ఞానం. విజ్ఞానంలో ఉన్న ప్రవృత్తిరూపాంశం.

ప్రవృత్తిశక్తిః ప్రవర్తించే, పనిచేసే, శక్తి.

ప్రవృత్తిసాతత్యమ్ ప్రవృత్తి నిరంతరంగా కొనసాగడం.

ప్రవృత్త్యాశ్రయః దేనియందు ప్రవృత్తి ఉందో అది

ప్రవ్రజ్యా సన్యసించి ఇల్లు విడచి వెళ్లిపోవుట.

ప్రసక్తః ఒక విషయాన్ని చెప్పవలసి ఉండడం.

ప్రాజ్ఞః (1) పరమాత్మ (2) బుద్ధిమంతుడు.

ప్రాణమయకోశః ఆత్మను కప్పి ఉన్న ప్రాణం అనే ఒక ఒర. కర్మేంద్రియాలతో కూడిన ప్రాణ - అపాన - వ్యాన - ఉదాన - సమానాలు ప్రాణమయకోశం.

ప్రాజ్ఞః సూక్ష్మశరీరసమష్ట్యుపహితచైతన్యం.

ప్రాణాః (1) పంచప్రాణాలు (2) ఇంద్రియాలు.

ప్రాతిభాసికసత్తా త్రాడుచూచి పాము అనుకొన్నప్పుడు ఆ క్షణంలో అక్కడ పాము ఉంది. ఆ ఉనికి ప్రాతిభాసికసత్త.

ప్రాప్తిరహిత (ఒకచోట) చెప్పడానికి లేదా రావడానికి అవకాశం లేని.

ప్రాయశ్చిత్తమ్ ఏవైనా పాపాలు చేస్తే అవి తొలగిపోవడం కోసం చేసే కర్మలు - చాంద్రాయణవ్రతం మొదలగునవి.

ప్రేక్షా జాగర్తగా పరిశీలించుట.

ఫ

ఫలవత్సన్నిధౌ అఫలం తదఙ్గమ్ ఫలం ఉన్న దానిదగ్గర చెప్పబడిన ఫలం లేనిది ఆ ఫలం ఉన్నదానికి అంగం అవుతుంది.

బ

బాధకజ్ఞానమ్ ముందు కలిగిన జ్ఞానాన్ని ఇది సరియైనది కాదు అని బాధించే తరవాత కలిగిన జ్ఞానం.

బిమ్బప్రతిబిమ్బవాదః ఘటాదులలో ఉన్న జలాలలో ప్రతిబింబించిన సూర్యుడు వేరు వేరుగా కనబడినట్లు అంతః కరణాదులలో ప్రతిబింబించిన పరమాత్మయే వేరు వేరు జీవులవలె కనబడుచున్నారు అని చెప్పే వాదం

బీజాఙ్కురన్యాయః బీజం ముందా అంకురం ముందా అనే న్యాయం.

బుద్ధిః ఇది ఇలా చెయ్యాలి, ఇది ఇంతే అని నిశ్చయరూపమైన అంతః కరణం.

బుద్ధాన్తః జాగ్రదవస్థయొక్క అసలు స్వరూపం.

బుద్ధిసంతానః బుద్ధిప్రవాహం.

బ్రహ్మాత్మతాప్రతిబోధః : నేనే బ్రహ్మను అనే జ్ఞానం.

భ

భవః పుట్టుక.

భావః పదార్థం.

భావవికారాః జాయతే (పుడుతుంది). అస్తి (ఉంది). వర్ధతే (పెరుగుతుంది). విపరిణమతే (మార్పులు చెందుతుంది) అపక్షీయతే (క్షీణిస్తుంది). నశ్యతి (నశిస్తుంది) అనే ప్రతి పదార్థానికి (భావానికి) కలిగే ఆరు వికారాలు.

భావనా ఆవేశపూర్వకంగా మనస్సుతో ఆలోచించుట.

భావయాథాత్మ్యమ్ పదార్థాల యథార్థస్వరూపం.

భావాత్మనా ఎట్లున్నదో అట్టి స్వరూపంచేత.

భూతాని పంచమహాభూతాలు.

భూతభౌతికసంహతిః భూతాలయొక్క వాటి నుండి పుట్టినవాటియొక్క సముదాయం.

భేదవ్యవహారః జగత్తులో వివిధభేదాలతో కూడిన వ్యవహారం.

భోగః సుఖదుఃఖాల అనుభవం.

భౌతిక భూతాలనుండి పుట్టిన.

మ

**మననమ్** విన్న విషయాన్ని గూర్చి తిరిగి ఆలోచించుట.

**మనస్** ఇంద్రియాల ద్వారా విషయాలను గ్రహించే అంతఃకరణం.

**మనోమయకోశః** ఆత్మను అచ్ఛాదించి ఉన్న మనోరూపమైన ఒర. జ్ఞానేంద్రియ సంహితమైన మనస్సు మనోమయకోశం.

**మాత్రా** (1) ఆకారం (2) పరిమాణం.

**మాయా** అజ్ఞానం, అవిద్య.

**మాయావేశః** మాయ ఆవేశించుట. మాయా ప్రభావం.

**మిథ్యాజ్ఞానమ్** (1) అసత్యమైన వస్తువును గూర్చిన జ్ఞానం. భ్రాంతి (2) మిథ్యయైన అజ్ఞానం.

**మీమాంసా** పూజించదగిన ఉత్తమమైన విచారం.

**మూర్త్యుపచయః** ఆకారంలో పెరుగుదల లావెక్కడం.

య

**యాథాత్మ్యమ్** యథార్థస్వరూపం. అసలు స్వరూపం.

**యుక్తిః** వాదంలో చూపిన తగిన హేతువు.

**యుతసిద్ధ** వేరు వేరుగా ఉండగలిగిన.

**యుష్మత్ప్రత్యయః** 'నువ్వు' లేదా 'మీరు' అనేభావం.

**యూపః** యజ్ఞంలో బలి ఇవ్వవలసిన పశువును బంధించే పవిత్రమైన స్తంభం.

**యోగః** తీవ్రమైన ధ్యానం.

ర

**రచనా** తయారు చేయుట. ఏర్పాటు చేయుట.

**రాద్ధాన్తః** సిద్ధాంతం.

**రూపస్కన్ధః** విషయాలు, ఇంద్రియాలు.

ల

**లిఙ్గమ్** గుర్తు. ఊహించడానికి సాధనం (అగ్ని ఉన్నదని ఊహించడానికి సాధనం ధూమం) (2) శాస్త్రంలో ఉన్న నిర్దేశం.

**లిఙ్గశరీరమ్** పైకి కనబడే పాంచభౌతికమైన స్థూలశరీరంలో ఉన్న సూక్ష్మశరీరం. దీనిలో పంచజ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి అనే పదిహేడు పదార్థాలుంటాయి. కొందరు పంచప్రాణాలకు బదులు పంచసూక్ష్మభూతాలు (భూతతన్మాత్రలు) చెపుతారు. వివిధ స్థూలదేహాలలో ప్రవేశిస్తూ వివిధలోకాలలో సంచరించేది ఈ లింగశరీరమే.

**లోకయాత్రా** లోకపు పోకడ.

**లోకవ్యవహారః** లోకంలో జరిగే వ్యవహారం.

వ

**వస్తుతన్త్ర** (1) వస్తువుమీద ఆధారపడినది. (2) ఉన్న సత్యాన్ని నిర్దేశించేది.

**వస్తువృత్తమ్** సత్యస్వరూపం, సత్యస్వభావం.

**వాక్యనిరపేక్ష** శాస్త్రవాక్యం అపేక్ష లేని.

**వాక్యశేషః** వాక్యంలోని చివరి భాగం. ఉపసంహారంలోని వాక్యం.

**వాచారమ్భణ** కేవలం మాటతో ఏర్పడిన, కేవలం మాటకి సంబంధించిన.

**వాసకః** క్షణాంతరంలోని భావానికి తన రంగు పూసేది.

**వాసనా** లోపల నిగూఢంగా ఉన్న భావాల సూక్ష్మరూపం. సంస్కారం.

**వాసనాధాన** వాసనలను కల్పించుట లేదా పుట్టించుట.

వాసనావైచిత్ర్యమ్ వాసనల వైవిధ్యం. వాసనలు విచిత్రంగా ఉండడం.

వాసనాశ్రయః వాసనలు దేనిమీద ఏర్పడతాయో అది.

వాస్య పూర్వక్షణానికి చెందిన భావం యొక్క వాసనలచేత వాసితమైన ఉత్తరక్షణభావం.

వికరణ ఇంద్రియాలు లేని.

వికారః కార్యం. కారణంయొక్క పరిణామవిశేషం.

వికృతిః వికారం.

విక్షేపశక్తిః లేని వస్తువును చూపించే (మాయలో ఉన్న) శక్తి. మాయ ఆవరణశక్తిచేత, ముందుగా ఉన్న యథార్థస్వరూపం కప్పివేసి విక్షేపశక్తిచేత లేనిదానిని చూపిస్తుంది.

విజ్ఞానమ్ భావం. జ్ఞానం.

విజ్ఞానమయకోశః ఆత్మను కప్పి ఉన్న విజ్ఞానం అనే కోశం. జ్ఞానేంద్రియసహితమైన బుద్ధి విజ్ఞానమయకోశం.

విజ్ఞానవాదిన్ విజ్ఞానమే యథార్థ మని అనేవాడు (ఒక బౌద్ధవాది).

విజ్ఞానసాక్షిన్ విజ్ఞానానికి సాక్షియైనది. విజ్ఞానాన్ని గుర్తించేది.

విజ్ఞానాస్తిత్వమాత్రవాదిన్ విజ్ఞానంమాత్రమే సత్యమైనది అని అంగీకరించేవాడు.

విజ్ఞానస్కన్ధః 'నేను' అనే ఆలయ విజ్ఞాన ప్రవాహం, 'ఇది' అనే ప్రవృత్తివిజ్ఞానం ఈ రెండూ విజ్ఞానస్కంధం.

విజ్ఞానైకస్కన్ధవాదః విజ్ఞానస్కంధమే సత్య మనే వాదం.

విద్యా జ్ఞానం, ఆత్మజ్ఞానం.

విద్వాన్ (1) ఆత్మజ్ఞాని (2) సగుణ బ్రహ్మోపాసకుడు

విధానమ్ కర్మాచరణపద్ధతి.

విధిప్రతిషేధశాస్త్రమ్ ఇలా చెయ్యాలి అనేది విధి శాస్త్రం. ఇలా చేయకూడదు అని చెప్పేది నిషేధశాస్త్రం.

విపర్యయః తారుమారగుట

విప్రకర్షః దూరం, రెండు వస్తువుల స్వభావాలలో చాల దూరం.

విప్రతిపత్తిః అభిప్రాయభేదం.

విప్రలమ్భకత్వమ్ మోసగించే స్వభావం.

విభూతిః అద్భుత శక్తిగల వస్తువు.

విరాట్ స్థూలశరీరసమష్టి స్థూలశరీరసమష్ట్యుపహితచైతన్యమ్.

విలక్షణత్వమ్ స్వరూపంలోభేదం. వేరువేరు లక్షణాలు కలిగి ఉండడం.

వివక్షా చెప్పాలనే కోరిక, ప్రతిపాదించే అభిప్రాయం.

వివర్తనం వేరువేరు విధాల అవిర్భవించుట.

వివర్తః త్రాడుమీదసర్పం కనబడి నట్లు ఒక వస్తువుపై మరొక వస్తువు పుట్టడం. ఈ రెండింటికి సత్తలలోభేదం ఉంటుంది. కనబడేదాని సత్త తక్కువది. "అతత్త్వతోఽన్యథా ప్రథా వివర్త ఇత్యుదీరితః". జగత్తు బ్రహ్మవివర్తం.

వివసనః దిగంబరుడు.

విశేషః (1) లక్షణం (2) అసాధారణ మైన లక్షణం.

విశేషణమ్ ఒక వస్తువును ఇతర వస్తువులనుండి వేరు చేసే లక్షణం లేదా గుణం.

విశేష్యమ్ విశేషణంచేత ఇతర వస్తువులనుండి వేరుచేయదగినది.

విషయః బాహ్యపదార్థం. అనుభవించ బడేది. తెలుసుకొనబడేది.

విషయిన్ బాహ్యపదార్థాన్ని తెలుసు కొనేది. ఆత్మ అనగా అంతఃకరణోపహితచైతన్యం.

విషయవిషయిభావ: తెలుసుకొనబడేది తెలుసుకొనేది అనే సంబంధం.

విషయసారూప్యమ్ విషయానికి ఏ రూప మున్నదో అలాంటి రూపాన్ని పొందడం.

విసంవాద (అభిప్రాయాదులలో) ఏకత్వం లేదా సామ్యం లేకపోవడం. పొత్తు కుదరకపోవడం.

విస్పృష్టి: సృష్టి. అంతర్గతంగా ఉన్న దానిని బహిర్గతం చేయుట.

వీప్సా ఒకే దానిని రెండుమాట్లు చెప్పడం. ఆవృత్తి.

వృత్తి: అర్థాన్ని బోధించే వ్యాపారం.

వేద: (యజ్ఞాదులలో ఉపయోగించే) దర్భలకట్ట.

వేదనాస్కంధ: సుఖదుఃఖాద్యనుభవం.

వైధర్మ్యమ్ భేదం. ధర్మాలలో భేదం.

వైనాశిక: అంతా పూర్తిగా నశిస్తుందని చెప్పే శూన్యవాది.

వైరూప్యమ్ భేదం.

వైలక్షణ్యమ్ భేదం, స్వభావంలో భేదం.

వైశ్వరూప్యమ్ రూపాలలో అత్యధికమైన భేదం.

వైశ్వానర: లేదా విశ్వ: జాగ్రదవస్థలో ఉన్న జీవుడు.

వైషమ్యమ్ (1) భేదబుద్ధి. ఫలాదులను ఇవ్వడంలో పక్షపాతం (2) భేదం.

వైషమ్యోపగమయోగ్య వైషమ్యం పొందడానికి తగిన.

వ్యతిరేక: (1) భిన్నంగా ఉండడం (2) ఒకటి లేకపోతే రెండవది లేకపోవడం. ఉదా. అగ్ని లేకపోతే ధూమం ఉండదు.

వ్యక్తి: ఒక వస్తువు. (ఒక చెట్టు, ఒక మనిషి ఇత్యాదులందు వలె)

వ్యపదేశ: నిర్దేశించడం. పేరు పెట్టడం.

వ్యపాశ్రయ ఆధారపడి ఉన్న.

వ్యవహార: ఆ యా పనులు నడిపించడం.

వ్యష్టి: విడివిడిగా (గ్రహించబడిన) వస్తువులు. ఉదా. వనంలో చెట్లను వేరువేరుగా చూస్తే అది వ్యష్టిని చూడడం.

వ్యాకరణమ్ విడదీయుట. విడదీసి చూపుట.

వ్యాకృత (1) దీనికి ఇది రూపం, ఇది పేరు అని విభజించి చూపబడిన (2) లోపల అణగి ఉండి పైకి ఆవిర్భవించేటట్లు చేయబడిన.

వ్యాఘాత: అద్భుతగులుట.

వ్యాపార: పని. పని జరుగుట.

వ్యావహారికసత్తా లోక వ్యవహారం నడుస్తూ న్నంతకాలము, బ్రహ్మజ్ఞానం కలిగేవరకు, ఈ జగత్తు సత్యంగానే కనబడుతుంది. ఆ సమయంలో దీని సత్త వ్యావహారికసత్త.

వ్యుదాస: నిరాకరించుట, ఖండించుట.

వ్యూహ: ఆకారము, ఒక రూపము.

## శ

శబ్దకోప: శాస్త్రవాక్యానికి భంగం కలగడం.

శమ: మనోనిగ్రహం.

శారీరక: శరీరంలో ఉన్న జీవుడు.

శాశ్వతిక అన్నికాలాలలోను ఉండేది.

శాస్త్రార్థపరిశుద్ధి: శాస్త్రవిషయాన్ని నిర్దుష్టంగా ఉన్నట్లు ధ్రువీకరించుట.

శిష్ట: అధ్యయనాచారాదిసంపన్నుడు.

శేష: అంగం, అవయవం.

శేషిన్ అంగి, అవయవి.

శ్రద్ధా శాస్త్రాచార్యాదులమీద పరిపూర్ణవిశ్వాసం.

శ్రవణమ్ వేదాంతవాక్యాలను శ్రద్ధా పూర్వకంగా వినుట.

ష

షడాయతన ఆరు ఇంద్రియాల స్థానాలు.

స

సంయోగసంబన్ధః రెండు మూర్తవస్తువుల కలయిక. ఉదా. హస్త - పుస్తకసంయోగం

సంవరః లోపలికి వెళ్ళకుండా మూసి వేయుట. ఇంద్రియాలు విషయాభిముఖంగా వెళ్ళకుండా అడ్డుకొనే నియమాభ్యాసం.

సంవాదః అభిప్రాయాదులలో ఏకత్వం.

సంవిద్ జ్ఞానం.

సంవేష్టితప్రసారితన్యాయ ఒక వస్త్రం మడత పెట్టినా, దానిని పరిచినా అది ఆ వస్త్రమే కాని మరొకటి కాదు కదా అదే న్యాయం.

సంశ్లేషః కలయిక. పరస్పరనిబిడసంబంధం.

సంస్కారః : లోపల అణగియున్న భావాలు మొదలైనవి. వాసన.

సంస్కారస్కన్ధః రాగద్వేషాదిక్లేశాలు. మదమానాద్యుపక్లేశాలు, ధర్మాధర్మాలు, సంస్కారస్కంధం.

సంస్థానమ్ అవయవాదుల విన్యాసం లేదా కూర్పు.

సంహతత్వమ్ కలిసి ఉండడం.

సంహతిః సముదాయం.

సంఘాతః సముదాయం.

సంజ్ఞాస్కన్ధః 'గోవు', ఇత్యాదిశబ్దాలచేత నిరూపించబడే జ్ఞానాల ప్రవాహం.

సత్ ఉన్నది. ఎల్లప్పుడూ ఉండేది.

సత్కార్యవాదః కార్యం పుట్టడానికి పూర్వం (పైకి కనబడడానికి పూర్వం) కూడ కారణంలో ఉన్నది అనే వాదం.

సత్త్వమ్ (1) సత్త్వగుణం (2) అంతః కరణం. (3) ప్రాణి.

సత్సంపత్తి : సత్‌లో (ఆత్మలో) కలిసి పోవడం.

సంతాన అవిచ్ఛిన్నప్రవాహం లేదా ధార.

సతానిన్ అవిచిన్నప్రవాహంలో ఉన్న వ్యక్తి.

సంనికర్షః ఇంద్రియాలకు విషయాలతో సంబంధం.

సంనిపాతః వచ్చి చేరడం. కలవడం.

సప్తభఙ్గీనయః ఏడు విధాలైన (జైన)న్యాయం.

సమన్వయః ఐకమత్యం.

సమయః ఒక కట్టుబాటు.

సమవాయః విడదీయరాని సంబంధం (అవయవానికి అవయవికి ఉన్న సంబంధం వంటిది).

సమవాయిన్ సమవాయసంబంధంతో కలిసినది.

సమష్టిః అనేకవస్తువుల ఒక సముదాయం. ఉదా. వందచెట్ల సమష్టి వనం అవుతుంది.

సమాధిః (1) సమాధానం (2)యోగంలో చిత్తం స్థిరంగా నిలచుట.

సమానన్యాయ రెండింటికి సమంగా వర్తించే న్యాయం. రెండింటికీ వర్తించే నియమం.

సమావర్తనమ్ విద్యాభ్యాసానంతరం గురు కులంనుండి ఇంటికి తిరిగి వచ్చుట.

సముదాయః అన్నింటిని కలపగా ఏర్పడిన మొత్తం.

సముద్రతరఙ్గన్యాయః సముద్రంనుండి బయలు దేరిన తరంగం సముద్రంకంటె భిన్నం కాదు అనే న్యాయం.

సంపదుపాసన అల్పమైన దానిమీద ఉత్కృష్టమైన వస్తు వును ఆరోపించి చేసే ఉపాసన. ఉదా. మనస్సును విశ్వేదేవతలనుగా ఉపాసించడం. దీనిలో ఆరోపించబడినదానికి ప్రాధాన్యం ఉంటుంది.

సంప్రతిపన్న అంగీకరించదగిన (అంగీకరించబడిన).

సంప్రతిపత్తిః అంగీకారం.

సంప్రతిష్ఠా నిలిపే ఆధారం.

సంప్రయోగః కలయిక.

సంప్రసాదః సుషుప్తి. గాఢనిద్ర.

సంబన్ధసాతత్యమ్ సంబంధం నిరంతరం కొనసాగుట.

సమ్యగ్దర్శన సరియైన, నిర్దుష్టమైన జ్ఞానం.

సర్గః సృష్టి.

సర్గశక్తిః సృష్టించే శక్తి.

సర్వశూన్యవాదిన్ : ఏమీ లేదని వాదించేవాడు. (బౌద్ధులలో ఒక తెగ).

సర్వాత్మతా ఆత్మ అన్నింటియందు, అంతటా ఒక్కటిగా ఉండుట.

సర్వాస్తిత్వవాదిన్ సర్వమూ సత్యమే అనే వాది.

సహకారి ఒక పనిలో కూడా ఉండి ఉపకరించే కారణం.

సహోపలమ్భనియమః రెండు వస్తువులు ఎల్లప్పుడూ ఒకదానితో ఒకటి కలిసియే తెలియబడతాయి అనే నియమం.

సాక్షిన్ పైన ఉండి తెలుసుకొంటూండేవాడు.

సాతత్యమ్ అవిచ్ఛిన్నంగా ఉండడం.

సాధనచతుష్టయమ్ ఆత్మజ్ఞానం కలగడానికి కావలసిన నాలుగు సాధనాలు (1) ఏది నిత్యం ఏది అనిత్యం అనే వివేకజ్ఞానం (2) పరమవైరాగ్యం (3) శమదమాదిసాధనసంపద (4) మోక్షంమీద తీవ్రవాంఛ

సాధనసామగ్రీ సాధనాల సముదాయం

సాధర్మ్యమ్ పోలిక

సాధారణకారణమ్ సాధారణమైన (అన్నింటికీ సంబంధించిన) కారణం.

సాధ్యపక్షనిక్షిప్త ఇంకా సాధించవలసి ఉన్న వాటిలో చేరిన

సాపేక్ష మరొకదానిమీద ఆధారపడి ఉన్న

సాంపరాయః : (1) మరణం (2) పరలోకం.

సామానాధికరణ్యమ్ ఒకే విభక్తిలో ఉండడం మొదలైన కారణాలచేత ఒకే వస్తువును నిర్దేశించుట.

సామర్థ్యమ్ శక్తి. పనిచేయగల శక్తి.

సామాన్యమ్ (1) పోలిక (2) జాతి (మనుష్యత్వం మొదలుగునవి).

సామాన్యలక్షణమ్ సామాన్యరూపమైన జ్ఞానం.

సామాన్యాత్మక సామాన్యరూపమైన.

సామ్యావస్థా అన్నీ సమంగా, హెచ్చుతగ్గులు లేకుండా, ఉన్న అవస్థ.

సారూప్యమ్ సామ్యం, పోలిక.

సావకాశ అవకాశం ఉన్న.

సికతాకూపన్యాయ ఇసుకనేలలో నుయ్యి తవ్వుతున్నప్పుడు ఒక ప్రక్క తవ్వుతూండగా మరొక ప్రక్క కూలిపోతున్నట్లు.

సిద్ధ : (1) తపస్సు, జ్ఞానమార్గం మొదలైనవాటిలో పూర్తి సఫలత్వం పొందినవాడు. (2) నిశ్చితమైనది.

సిద్ధి సర్వవిధాల పరిపూర్ణత్వం.

సుషుప్తి : గాఢనిద్ర.

సూక్ష్మశరీరమ్ పంచజ్ఞానేంద్రియాలు,పంచ కర్మేంద్రియాలు, పంచభూతతన్మాత్రులు, మనస్సు, బుద్ధి ఈ పదిహేడింటితోకూడిన, ఇంద్రియగోచరంకాని, ఒక స్థూలదేహం నుండి మరొక స్థూలదేహానికి మారుతూండే దేహం. చూ. లిఙ్గశరీరమ్.

సూత్రాత్మా సూక్ష్మశరీరసమష్ట్యుపహితచైతన్యం.

స్కన్ధః చిత్తవృత్తి విశేషాలు, రూప-విజ్ఞాన-వేదనా-సంజ్ఞా-సంస్కారాలనే ఐదు శరీరంలో ఉండేవి. (బౌ. మ) (చూ. పఞ్చస్కన్ధీ).

స్థూణానిఖననన్యాయ ఒక కఱ్ఱ నేలలో లోతుగా దిగడానికి మళ్లీమళ్లీతవ్విపాతినట్లు.

స్వప్నాన్తః స్వప్నావస్థయొక్క అసలు స్వరూపం.

స్వభావవిప్రకర్షః స్వభావాలలో ఉన్న భేదం.

స్వరూపానుపమర్దః స్వరూపాన్ని చెడగొట్టకుండా ఉండడం.

స్వలక్షణమ్ ఒక వస్తువుయొక్క, దానికి మాత్రమే చెందిన, లక్షణం.

స్వసంవేదనమ్ తన జ్ఞానం.

స్వాభావిక (1) స్వభావసిద్ధమైన (2) ఒకని సొత్తు.

స్వారాజ్యమ్ ఆత్మరాజ్యం.

స్రోతఃసంతాననిత్యతాన్యాయః ప్రవాహం నిత్యంగా ఉన్నట్లు కనబడినట్లు.

## హ

హానమ్ విడచుట.

హిరణ్యగర్భః సూక్ష్మశరీరసమష్ట్యుపహిత చైతన్యం, జీవసమష్టిరూపం.

హేతుఫలభావ కారణం దానిఫలం అనే సంబంధం.

హేతుస్వభావానురక్త హేతువుయొక్క స్వభావం చేరని. దాని లక్షణా లేవీ అంటని.

హేతుమత్ హేతువు కలది.

హేతుహేతుమద్భావః హేతవు దానినుండి పుట్టినది అనే సంబంధం.

హ్రస్వమ్ పరమాణువులో పరిమాణం.